అపరాధపరిశోధన అనుబంధం—166

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## స్మగ్లింగ్ రాకెట్

రచన: వసుంధర

## రాక్షస స్త్రీలు

రచన: సుంకరి రాంప్రసాద్

## అంతర్జాతీయ నేరస్థులు

రచన: వి. యస్. పి. తెన్నేటి

అపరాధ పరిశోధన సప్లిమెంట్—166
అక్టోబరు, 1987
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. పి. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# స్మగ్లింగ్ రాకెట్

## వసుంధర

డీయస్పీ రాఘవరావు-అర్జంటుగా సమావేశం ఏర్పాటు చేశాడు. దాంట్లో మొత్తం పన్నెండుగురు ఇన్‌స్పెక్టర్లు పాల్గొన్నారు. ఇంచుమించు అందరూ యువకులే!

"నేరస్థులు తమ ఆపరేషన్స్‌కు మన విశాఖపట్నాన్నెన్నుకోవడం — మనందరికీ సవాలు. ఇప్పుడిక్కడ విదేశీ వస్తువులు, మాదక ద్రవ్యాలు జోరుగా చేతులు మారుతున్నాయి. తెచ్చేదెవరో, పుచ్చుకుంటున్నదెవరో తెలుసుకోవడం కష్టంగా వుంది. అందుకోసం మనం చేసిన పటిష్టమైన ఏర్పాట్లన్నీ మీకు తెలిసే వుంటాయి-"

ఇన్‌స్పెక్టర్లందరూ తలలాడించారు.

విశాఖపట్నంలో అడుగుపెట్టే ప్రతివ్యక్తినీ శోధించడం జరుగుతోంది. చెకింగ్ తీవ్రంగా వుంటోంది. ఎయిర్ పోర్టులో, రైల్వేస్టేషన్లలో, బస్టాండులో — అన్నిచోట్లా పోలీసులు తమ విద్యుక్తధర్మం నిర్వహిస్తున్నారు.

## 4

"అంతమాత్రాన సరుకు విశాఖపట్నం చేరకుండా ఆగిపోతుందని కాదు. విశాఖపట్నానికి రోజూ కొన్ని వేలమంది వచ్చిపోతూంటారు. ఎయిర్ పోర్టులో చెక్ చేసినట్లు రైల్వేస్టేషన్ లోనూ, బస్ స్టాండులోనూ చేయడం సాధ్యంకాదు. ప్రతి మనిషినీ శోధించాలంటే మనకున్న సిబ్బంది చాలదు. పైగా సామాన్య పౌరులకిబ్బంది. అందువల్ల రద్దీగా వున్న ప్రాంతాల మనవాళ్ళు శాంపిల్ గా కొందరు అనుమానాస్పదవ్యక్తుల్నెన్నుకుని చెక్ చేస్తున్నారు. ఇంతవరకూ చెకింగ్ లో మనం సాధించిన ప్రగతి ఏమీ లేదు....అందుకు కారణమేమిటి? చెకింగ్ చాలడంలేదంటారా?"

ఇన్ స్పెక్టర్లెవరూ మాట్లాడలేదు.

"నేను మీ అభిప్రాయం తెలుసుకోగోరుతున్నాను-" గంభీరంగా అన్నాడు రాఘవరావు.

ఇన్ స్పెక్టర్ చంద్రకాంత్ లేచి నిలబడి__"సర్__ చెకింగు చాలదనడంలో సందేహమేమీ లేదు. కానీ అంతకుమించి చెకింగ్ పెంచడం ప్రాక్టికల్ కాదు__" అన్నాడు.

"గుడ్__అయితే నేను చెప్పదల్చుకున్న విశేషమది కాదు__మన పోలీసుల అసమర్థత!" అన్నాడు రాఘవరావు.

తమ కేదో గట్టి డోసే పడబోతోందని ఇన్ స్పెక్టర్లకర్థమయింది. ఇలాంటివి జీవితంలో వారికి కొత్తకాదు. రాఘవరావేం చెబుతాడోనని వారందరూ శ్రద్ధగా వినసాగారు.

"నేరస్థులు మన శాంపిల్ చెకింగ్ తప్పించుకుంటున్నారంటే మన శాంప్లింగ్ విధానంలో యేదో లోప

ముందన్న మాట!" అన్నాడు రాఘవరావు.

"ఉండొచ్చు సర్ — ఎందుకంటే అన్ని వేలమందిలో సరైన నేరస్థుడిని మనమనుమానించగల అవకాశాలు తక్కువ —" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సత్యనారాయణ లేచి నిలబడి.

"భూమిలో నిక్షిప్తమైన ఖనిజాల కంపోజిషన్ మొత్తమంతా ఒకేలా ఉండదు. కానీ సైంటిస్టులు శాంపిల్ తీసి సుమారుగా ఖనిజాల కంపోజిషన్-అంచనా వేయగల్గుతారు. ఆ అంచనా సరిగానే ఉంటుంది. అందుకు కారణం శాంప్లింగ్ పద్ధతి సరైన శాంపిల్ ఎలా తీసుకోవాలో వారికి తెలుసు. అందుకే సైన్సంతగా వృద్ధి పొందుతోంది. అలాగే మనకూ నేరస్థులను శాంప్లింగ్ చేయడానికి మంచి పద్ధతులున్నాయి. ఆ పద్ధతి ప్రకారం శాంప్లింగ్ చేస్తే వారానికొక నేరస్థుడైనా పట్టుకోగలుగుతాం. అలా జరగడం లేదంటే — మనలో ఎవ్వరికీ శాంప్లింగ్ పద్ధతులు సరిగా రావనుకోవాలి. మన అసమర్థతను అంగీకరించాలి...."

ఇన్‌స్పెక్టర్ల ముఖాలెర్రబడ్డాయి. కానీ యెవరూ మాట్లాడలేదు.

"నాకు మీ సమర్థతమీద అపనమ్మకంలేదు. అయితే సమస్య ఎంత గంభీరమైనదో మీరు తెలుసుకున్నట్లు లేదు. మీరు చిత్తశుద్ధితో ఈ విషయమై ప్రయత్నిస్తున్నట్లు లేదు. నేరస్థుణ్ణి పట్టుకున్నా పట్టుకోకపోయినా మీ జీతాలు మీకొస్తాయి. వేళకు డ్యూటీకొచ్చి వేళకింటికి తిరిగొస్తే — ఇంటిల్లాలు కూడా సంతోషిస్తుంది. మీరందరూ నేరస్థుల్ని పట్టుకోవడానికి మంచి—

కుటుంబ సంతోషానికి పాటు పడుతున్నారు. అది తప్పు కాదు. కానీ విచారించవలసిన విషయం కాదంటారా?"

"కాదు సర్ ....మీ అభియోగం సరైనది కాదు. మేమందరం కూడా కుటుంబ సంతోషానికిమించి నేరస్థుల్ని పట్టుకోవడం గురించే ఎక్కువ పాటుపడుతున్నాం...." అన్నాడినిస్పెక్టర్ చంద్రకాంత్.

"గుడ్ రియాక్షన్ ....నీ మాటలే నిజమైతే నేనొకటనుకోవాలి. మీరు చిత్తశుద్ధితో ప్రయత్నిస్తూ, సమర్థతను ప్రదర్శిస్తూ—ఇన్నాళ్ళుగా శ్రమపడుతూంటే—ఒక్కడంటే ఒక్కడు కూడా నేరస్థుడు దొరకలేదు. నేరాలు జరిగిపోతున్నట్లు ఋజువులున్నాయి....దీన్నిబట్టి ఏమాత్రం తెలివున్న వారైనా గ్రహించాల్సినదేమిటంటే మనలో ఎవరో ద్రోహులకు సాయం చేస్తున్నారు. కావాలనే నేరస్థుల్ని గుర్తించనట్లు నటిస్తున్నారు. అలాంటి వారొకరో యిద్దరో మాత్రమే వుండవచ్చు. కానీ ఒక్క ఉప్పురాయి కడివెడు పాలను విరిచినట్లు మన ప్రయత్నాలన్నీ కూడా — ఆ ఒకరిద్దరి కారణంగా వమ్మైపోతున్నాయి. ఎవరు వాళ్ళు....?"

ఇన్స్పెక్టర్లంతా ముఖముఖాలు చూసుకున్నారు.

"బైట నేరస్థుల్ని పట్టుకునేముందు మనం మనలో నేరస్థుడెవరో తెలుసుకోవాలి. ఈ విషయంలో నాకెవరు సాయపడతారు?" అన్నాడు రాఘవరావు.

ఇన్స్పెక్టర్లెవరూ మాట్లాడలేదు.

"ఎవరూ నాకు సాయపడరా?" ప్రశ్నను రెట్టించాడు రాఘవరావు.

చంద్రకాంత్ లేచి నిలబడి—"సర్—నాకు మన

వాళ్ళెవరి మీదా అపనమ్మకంలేదు...." అన్నాడు ధైర్యంగా.

"గుడ్....నీ నమ్మకం మంచిది. అది నీ మంచిబుద్ధిని తెలియచేస్తుంది. కానీ చెడ్డవాళ్ళను పట్టివ్వలేదు. అందుకే నేనొక నిర్ణయం తీసుకున్నాను...." అని ఆగాడు రాఘవరావు.

చంద్రకాంత్ ఇంకా నిలబడే వున్నాడు.

"మిస్టర్ చంద్రకాంత్ — కూర్చో!" అన్నాడు రాఘవరావు.

"సర్! మన డిపార్టుమెంటుకే కళంకం తెస్తున్న ఈ స్మగ్లింగ్ రాకెట్‌ని— నేను స్వయంగా సవాలుగా తీసుకుంటున్నాను. నెలరోజులు టైమివ్వండి...." అన్నాడతడు.

"నెలరోజుల్లో సత్యమన్నది సాధించలేకపోతే?" అడిగాడు రాఘవరావు.

"ఉద్యోగానికి రాజీనామా చేస్తాను...." అన్నాడు చంద్రకాంత్.

"ఓ.కే.డీజీ మై బాయ్-ముందు కూర్చో!" అన్నాడు రాఘవరావు.

చంద్రకాంత్ కూర్చోలేదు.

"ప్లీజ్ సిట్ డౌన్ ఐసే!" అన్నాడు రాఘవరావు కోపంగా.

చంద్రకాంత్ చటుక్కున కూర్చున్నాడు.

"మీరందరూ నేను చెప్పేది శ్రద్ధగా వినాలి. నేను మన డిపార్టుమెంటును చిన్నబుచ్చడంలేదు. మీలో ఎవ్వరినీ ప్రత్యేకంగా అనుమానించడంలేదు. ఉన్న పరిస్థితిని విశ్లేషించి చెబుతున్నాను. అది మీరర్థంచేసు

కోవాలి...." అని ఆగాడు రాఘవరావు.

"మీ అందరికీ క్రికెట్ ఆట తెలుసు. అందులో బ్యాట్స్‌మన్ క్రీజ్ దగ్గరకొచ్చేసరికి—అతణ్ని అవుట్ చేయడానికి బౌలరు సిద్ధంగా వుంటాడు. ఆ బౌలరుకు సాయం చేయడానికి — బౌలరుతో సహా పదకొండుగురు ఫీల్డర్సుంటారు. బ్యాట్స్‌మన్ తప్పుచేస్తే గమనించడానికి ద్దరంపైర్లు వాళ్ళంతా కళ్ళు చేసుకుని సిద్ధంగా వుంటారు. బంతి స్టంప్స్‌మీదికి వెళ్ళకుండా కాలడ్డు పెడితే తప్పు. బంతికి కాలడ్డం పెట్టకుండా, బ్యాట్‌తో ఆపకుండా స్టంప్సుమీదికి పోనిస్తే తప్పు. బంతిని ఫీల్డరు చేతికి దొంకేలా గాల్లోకి కొడితే తప్పు. బంతి స్టంప్సుని తాకే సమయంలో క్రీజ్‌లో లేకుంటే తప్పు.

ఇందులో ఏ ఒక్క తప్పుచేసినా అతడవుటవుతాడు. ఫీల్డరు తప్పుచేస్తే అతడికింకా అవకాశముంటుంది. బౌలరు తప్పుచేస్తే అతడికింకా అవకాశముంటుంది. బ్యాట్స్‌మన్ తప్పుచేస్తే అతడికి మరో అవకాశముండదు—(ఇల్లోగా), అంపైర్లో తప్పుచేస్తే తప్ప! అందుకని బ్యాట్స్‌మన్ క్రికెట్టాటలో అందరికంటే యెక్కువ ప్రతిభను సంత రించుకుంటాడు. ఆటలో అతడే కీలక స్థానంగా వుంటాడు. క్రికెట్ ఆట చూడ్డానికి వెళ్ళే ప్రేక్షకులు-బ్యాటింగు చూడ్డానికే అభిమానిస్తారు. మీకు తెలుసు కదూ!"

"సర్—ఇదంతా ఎందుకు చెబుతున్నట్లు?" అన్నాడు చంద్రకాంత్.

"నేరస్థుడు క్రికెట్‌లో బ్యాట్స్‌మన్ వంటివాడు. పోలీసులు బౌలర్లు. ప్రజలు ఫీల్డర్సు. కోర్టులు అంపైర్సు. ఇంతమందిలో ఎవరు పొరపాటుచేసినా ఫరవాలేదు.

నేరస్థుడు మాత్రం చిన్న పొరపాటుకూడా చేయకూడదు. కాబట్టి నేరస్థుడిగా రాణించాలనుకునేవాడు క్రికెట్లో గవాస్కరంతటి సామర్థ్యాన్ని సంపాదించడానికి ప్రయత్నిస్తాడు. మనం నేరస్థుణ్ణి పట్టడానికి కొత్త కొత్త పథకాలు వేస్తూంటే — మన నధిగమించడానికి నేరస్థుడు కొత్త పద్ధతులవలంబిస్తాడు. ఆ పద్ధతి తెలుసుకుంటే అతడి బలహీనతను పట్టేసినట్లే....

కానీ ఆ పద్ధతి తెలుసుకోవడం అంత సులభంకాదు. అందులోనూ మన డిపార్టుమెంటుకు కొన్ని పరిమితులుంటాయి. పైనుంచి రాజకీయ నాయకులు పని చేస్తూంటారు. కొన్ని పక్కలనుంచి మన బలహీనతలు తెలుసుకున్న బలవంతులుంటారు. అందుకే నేను — మన నగరంలో ప్రబలిన — స్మగ్లింగ్ ఆపరేషన్ను నరికట్టడానికో ప్రయివేటు డిటెక్టివుని నియోగించాను. అతడి పేరు డిటెక్టివ్ వెంకన్న.

అతడికి తన పేరు గురించిన తపనలేదు. నేరస్థుడికి శిక్షపడాలన్న పట్టుదలలేదు. నేరాన్ని రూపుమాపడం అతడి ధ్యేయం. అతడు నాకు స్నేహితుడు. గౌరవపాత్రుడు. నే నిప్పుడీ సమావేశం ఏర్పాటు చేయడానికి కారణమదే! ఈ విషయం మీకు తెలియబర్చడం.... మీ అందరికీ నేను చెప్పేదేమిటంటే — మీరందరూ ఈ నగరంలో నే పనిచేయడంలేదని నాకు తెలుసు. కానీ డిటెక్టివ్ వెంకన్నకు మీలో ఎవరితోనైనా పనిబడవచ్చు. అతణ్ణి మన డిపార్టుమెంటు మనిషిగా భావించి మీరంతా మీమీ సహకారాన్నందజేయాలి ..."

చంద్రకాంత్ లేచి నిలబడి — "సర్ —" అని ఏదో అనబోయాడు.

"మీకింకే సందేహాలున్నా — డిటెక్టివ్ వెంకన్నను కలుసుకోండి. అతడి చిరునామా యిస్తాను. నేనిక మీకు చెప్పదల్చుకున్న దేమీ లేదు — ఒక్కటి తప్ప!"

అంతా కుతూహలంగా రాఘవరావు వంక చూశారు.

"డిటెక్టివ్ వెంకన్నకు సాయపడనివారు — నేరసులకు సాయపడుతున్నట్లుగా గుర్తించబడతారు —" అన్నాడు రాఘవరావు.

## 2

డాల్ఫిన్స్ హోటల్లో డిటెక్టివ్ వెంకన్న బసచేసిన గదికి వెళ్ళాడు ఇన్ స్పెక్టర్ చంద్రకాంత్. సమయానికి వెంకన్న లేడు.

అతడి కూడా భార్య. ఇద్దరు లేడీ అసిస్టెంట్సు వచ్చినట్లు తెలిసింది చంద్రకాంత్ కి.

"ఎక్కడికెళ్ళారు?" అనడిగాడు చంద్రకాంత్. మఫ్టీలో ఉన్నమూలాన రిసెప్షనిస్టు అతణ్ణి పోలీసు మనిషిగా గుర్తించలేదు.

"జయదేవ్ మహల్ కి...."

"జయదేవ మహలా — అదెక్కడ?"

"న్యూ కాలనీలో కొత్తగా కట్టారు. హైదరాబాద్ లో రవీంద్రభారతిని మించి ఉంటుంది...."

"ఏమిటక్కడ విశేషం?"

"మిస్ ముత్యాలమ్మ ప్రోగ్రాముందక్కడీరోజు...."

"మిస్ ముత్యాలమ్మా — ఆమె ఎవరు?"

"ముత్యాలమ్మ తెలియదూ — మీకు? గొప్ప డాన్సింగ్ సింగర్ — ఆమె పాట, ఆట అద్భుతం — బోనీఎం ట్రూపామె ముందెందుకూ పనికిరాదు...."

"నే నెప్పుడూ ఆ పేరే వినలేదు...." అన్నాడు

చంద్రకాంత్.

"చాలా ఆశ్చర్యంగా వుంది. ముత్యాలమ్మ పేరు తెలుగు దేశంలోనే కాదు—ప్రపంచమంతటా మార్మోగుతోంది. ఆమె విదేశాల్లో కూడా ప్రదర్శనలిచ్చింది. ఈ ఊరొచ్చి నెల్లాళ్ళయింది. పురజనుల కోరిక మీద ఇక్కడే వుండిపోయింది. బహుశా మరో రెండు నెలలుండొచ్చు. వారానికొక్క ప్రదర్శనకు మించివ్వదామె. ఏ రోజు ప్రదర్శనిస్తుందో యెవరికీ తెలియదు. కొన్ని గంటల ముందామె ఆర్గనైజర్సుకి తెలియజేస్తుంది. వెంటనే టికెట్సు - అడ్వాన్సుగా బుక్కైపోతాయి .... సామాన్యులామె ప్రోగ్రాం చూడలేరు. అన్నిట్లోకీ చౌక టికెట్ పాతిక — అయితే వందరూపాయల టికెట్ కూడా బ్లాకులో అమ్ముతుందామె ప్రోగ్రామ్సుకు ...."

"వెంకన్నగారిక్కడికొచ్చి యే పనీ లేనట్లు—ఆ ప్రోగ్రాంకి వెళ్ళారా?" అన్నాడు చంద్రకాంత్ చిరాగ్గా.

"ఆయన బహుశా ఆ ప్రోగ్రాం చూడ్డంకోసమే ఈ ఊరొచ్చినట్లున్నారు. సకుటుంబంగా వచ్చారు...." అంది రిసెప్షనిస్టు.

"అలాగని మీకు చెప్పారా?"

"లేదు—ఊహించాను...."

చంద్రకాంత్ ఆమె నింకేమీ ప్రశ్నించకుండా అక్కణ్ణించి కదిలాడు.

"సర్ — వెంకన్నగారికేమైనా మెసేజివ్వాలా?" అంది రిసెప్షనిస్టు.

"అవసరంలేదు—" అంటూ హోటల్ ఆవరణలోంచి బైటపడి మోటార్ సైకిలెక్కాడతడు. బంది

నడుస్తున్నా అతడి ఆలోచనలెటో పోతున్నాయి.

వెంకన్న నిజంగా జయదేవ్ మహల్ కే వెళ్ళాడా?

అతడీ ఊరొచ్చింది పెద్ద బాధ్యతమీద! డీయస్పీ రాఘవరావతన్ని రప్పించాడు. అతడు భార్యనెందుకు వెంటబెట్టుకొచ్చాడు? ప్రోగ్రాంకెందుకెళ్ళాడు?

సాధారణంగా సెమినార్లలో యిలా జరుగుతూంటుంది.

ఒక ముఖ్య విశేషాన్ని చర్చించడానికో విశేషానికి సంబంధించిన ఫీల్డులోని నిపుణులందర్నీ ఒకచోట సమావేశపర్చడానికి సెమినార్లేర్పాటు చేస్తారు. నిపుణుల ఉపన్యాసాలు విని ప్రయోజనం పొందడానికి సెమినార్లకందరో సామాన్యులు కూడా వస్తారు. అయితే సెమినార్ ప్రయోజనం సాధించరు. వచ్చిన వారందరూ ఉపన్యాసాల గురించి పట్టించుకోకుండా — యాత్రాస్థలాలు దర్శించడం మొదలు పెడతారు.

వెంకన్న కూడా అంతేనా?

ఆలోచిస్తూనే ఇన్స్పెక్టర్ చంద్రకాంత్ న్యూకాలనీ చేరుకున్నాడు, అక్కడ వాకబుచేసి జయదేవ్ మహల్ చేరుకున్నాడు.

అప్పటికి మిస్ ముత్యాలమ్మ ప్రోగ్రాం ప్రారంభమై గంటయింది. ఇంకా రెండు గంటలుంటుంది.

జయదేవ్ మహల్ ముందు పెద్ద పోస్టరుంది. ఆ పోస్టర్లో చేతిలో మైక్రోఫోన్ తో — ఓ పాతికేళ్ళ యువతి—పాట పాడుతున్న పోజులో వుంది.

“ముత్యాలమ్మ బాగుంది—” అనుకున్నాడు చంద్రకాంత్.

అతడు జయదేవ్ మహల్ మేనేజర్ని కలుసుకుని

తన అయిడెంటిఫికేషన్ కార్డు చూపించాడు.

"ప్లాస్ ఫుల్ సార్ —" అన్నాడు మేనేజర్.

"చాలా ముఖ్యమైన పని. నేను లోపలకు వెళ్ళాలి. నాకు సీట్లక్కరలేదు—" అన్నాడు చంద్రకాంత్.

"ఏమిటిసార్ పని?" అన్నాడు మేనేజరు.

చంద్రకాంత్ ఏదో చెప్పబోయి—"చెప్పకూడదు" అన్నాడు. ఏం చెప్పాలో అతడికీ తెలియలేదు.

మేనేజరతణ్ని నొక్కించి అడగలేదు. తనే దగ్గరుండి హాల్లోకి తీసుకుని వెళ్ళి-"ఎక్కడ నిలబడతారు సార్?" అన్నాడు.

"గుమ్మం దగ్గర—" అన్నాడు చంద్రకాంత్.

మేనేజరు వెళ్ళిపోయాడు.

చంద్రకాంత్ గుమ్మం దగ్గర నిలబడి ఆలోచనలో పడ్డాడు—"నేనిప్పుడేం చేయాలి? నేనసలిక్కడికెందుకొచ్చాను?"

అతడి ఆలోచన తీవ్రతరమయ్యేలోగా స్టేజిమీద అంతవరకూ వినబడుతున్న వాయిద్యాల మోత ఒక్కసారిగా ఆగిపోయింది.

మైక్రోఫోన్ దగ్గరకో వ్యక్తి వచ్చాడు—"ఇప్పుడు మిస్ ముత్యాలమ్మద్వారా నాలుగో అయిటం వింటారు" అన్నాడతడు.

ఒక్కసారిగా వాద్యబృందాల ఘోష....

వేదికపై చీకటి అలముకుంది. ఆ చీకట్లోంచే వాద్య బృందాలు జోరుగా హోరుచేస్తున్నాయి. అలా కొద్ది సెకన్లు మాత్రమే....ఆ తర్వాత చీకట్లోంచీ సన్నటి వెలుగు....ఆ వెలుగుతోపాటే వాద్యబృందాల జోరు తగ్గి సన్నగా సితార్ స్వరం వినపడుతోంది. వెలుగు

పెరుగుతూంటే సితార్ నాదంకూడా పెరిగింది.

పెరుగుతున్న వెలుగులో — తెల్లని చీర — మల్లెపూలతో మైక్రోఫోన్ వద్ద ప్రత్యక్షమైన మిస్ ముత్యాలమ్మ నవమోహానాంగివలె వుంది.

ఆమె పెదవులు విచ్చుకున్నాయి.

సితార్ స్వరం సన్నబడుతోంది. ముత్యాలమ్మ గొంతులోంచి రాగమేదో బైటపడుతోంది. ఆ రాగం సితార్ మీద పలుకుతున్నట్లే వుంది.

“అద్భుతం....” అనుకున్నాడు చంద్రకాంత్.

అతడప్పుడు తానెవరో, ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో మర్చిపోయాడు.

క్రమంగా మిస్ ముత్యాలమ్మ పాట ప్రారంభమయింది.

చంద్రకాంత్ కళ్ళుమరిచి వింటున్నాడు.

అది శాస్త్రీయమో, లలితమో అతడికి తెలియదు. వింటున్నంతసేపూ శ్రవణానందం — చూస్తున్నంతసేపూ నయనానందం....

వరుసగా ఆమె చాలా పాటలు పాడింది.

కొందరామెకు చీట్లు పంపి ఫలానాపాట పాడమని కోరుతున్నారు. ఆమె శ్రోతల కోర్కెను మన్నిస్తోంది.

మొత్తం పదహారు పాటలు పాడిందామె — చంద్రకాంత్ వింటూండగా! ఆరంభంలోకంటె క్రమంగా పాటల నిడివి తగ్గిపోయింది.

కార్యక్రమం ముగిసేసరికి చంద్రకాంత్ — తాను హాలు మధ్యలో ఒక సీట్లో కూర్చుని ఉన్నట్లు గమనించి ఆశ్చర్యపోయాడు. తానక్కడికెలాగొచ్చాడో కూడా అతడికి గుర్తులేదు.

ఈ కార్యక్రమం తన శ్రీమతికి చూపించాలనిపించిం దతడికి.

చంద్రకాంత్ ఇంట్లో ఏడాది పాపా, అరవై ఏళ్ళ నాయనమ్మా వున్నారు. పాపను నాయనమ్మ కప్పగించి భార్యను తీసుకుని ముత్యాలమ్మ కార్యక్రమానికి రావాలని అతడనుకున్నాడు. మళ్ళీ ప్రోగ్రామెప్పుడో తెలుసు కుందుకు చంద్రకాంత్ మేనేజరు దగ్గరకు వెళ్లాడు.

"బాగా ఎంజాయ్ చేశారా సర్?" అన్నాడు మేనేజరు.

"చేశాను. కానీ గుమ్మం దగ్గర నిలబడ్డ నేను హాలు మధ్యలో కుర్చీలోకెలా వెళ్ళానో తెలియలేదు...."

మేనేజరు నవ్వి — "అయితే నేను మీకు సీటు చూపించడం తెలియదన్నమాట...." అన్నాడు.

"మీరు చూపించారా? హౌస్ ఫుల్ కదా— సీటెక్కడిది?"

"మధ్యలో ఒకాయన లేచి వెళ్ళిపోయాడు. మీరు గుమ్మం దగ్గరే నిలబడుండడం గమనించి ఆ సీటు మీకు చూపించాను...."

"బహుశా అదే జరిగుండొచ్చు—" అన్నాడు చంద్రకాంత్.

"బహుశా కాదు — నిజంగానే జరిగిందది...." అన్నాడు మేనేజరు.

"మీకు చాలా థాంక్స్-" అన్నాడు చంద్రకాంత్.

"ఇందులో నేను చేసిందేముందిగాని — మీతో విషయం చెప్పాలి-మీరు ప్రోగ్రాం చూడ్డానికొచ్చారా- పోలీసు పనిమీదొచ్చారా?"

చంద్రకాంత్ జవాబు చెప్పడానికి ముందే మాట

పడ్డాడు.

"నిజం చెప్పండి సార్—" అన్నాడు మేనేజరు.

"నేను పనిమీదే వచ్చాను. మీకు డిటెక్టివ్ వెంకన్న తెలుసా?" అనడిగాడు చంద్రకాంత్.

"ఆయన నాకు తెలియదు కానీ పేరు విన్నాను సర్...."

"ఆయనతో అర్జంటుగా మాట్లాడాల్సి వుంది. ఆయనేమో—ఇక్కడ ప్రోగ్రాం చూడ్డానికి వచ్చినట్లు తెలిసింది. ఆయన్ను కలుసుకోవాలనుకుని ప్రోగ్రాం మత్తులో పడిపోయాను. మనుషుల్ని తమ విద్యుక్త ధర్మాలనుండి కూడా మరిపింపజేసే ఇలాంటి కార్యక్రమాలు ప్రమాదమేమో ననిపిస్తుంది—" అన్నాడు చంద్రకాంత్.

"డిటెక్టివ్ వెంకన్నగానీ హాలుకొచ్చారా? అయ్యో తెలిస్తే పలకరించి ఆటోగ్రాఫ్ తీసుకునే వాణ్నే!" అని బాధపడ్డాడు మేనేజర్.

"వెంకన్నగార్నిక్కడ కలుసుకుని ప్రయోజన ముండదు. ప్రోగ్రాం మత్తులో ఆయన నాతో ఏం మాట్లాడేవాడో ఏమో...." అన్నాడు చంద్రకాంత్.

"ప్రోగ్రాం మత్తు గురించి మీరు మరీ అంతగా చెప్పకండి సార్ — ప్రోగ్రాం మధ్యలోంచి రోజూ కొందరు లేచి వెళ్ళడం నేను గమనించాను. ఈ రోజు మీకు సీటు దొరికాక కూడా ఇంకో ముగ్గురు బైటకు వెళ్ళిపోయారు...." అన్నాడు మేనేజర్.

"ఆశ్చర్యంగా ఉందే—అలా ఎందుకు జరిగింది?"

"ఎందుకేమిటి సార్? ఈ ప్రోగ్రాంకు గొప్పగొప్ప వాళ్ళొస్తారు. వాళ్ళలో కొందరికేవో అపాయింట్

మెంట్సుంటాయి...." అన్నాడు మేనేజర్.

"బైటకు మధ్యలో వెళ్ళే వాళ్ళు గొప్పవాళ్ళే అంటారా?"

"ఎందుకవ్వదు సర్! ఉదాహరణకి ఈ మధ్యలో లేచివెళ్ళిన వాళ్ళు ముగ్గురూ నాకు తెలుసు. ఒకాయన కేశవరావు. రెండో ఆయన మాధవరావు. మూడో ఆయన గోవిందరావు. ముగ్గురికీ నడిబజార్లో షాపు లున్నాయి..."

"వాళ్ళవరైతే నాకెందుగ్గానీ మళ్ళీ ప్రోగ్రాం ఎప్పుడు?" అన్నాడు చంద్రకాంత్.

"మళ్ళీ వారందాకా యెప్పుడో చెప్పలేను...." అన్నాడు మేనేజరు.

అప్పుడు చంద్రకాంత్ కి హోటల్ వాల్ఫిన్ రిసెప్షనిస్టు మాటలు గుర్తుచ్చాయి. అతడు తనలో తనే నవ్వుకుని—"మళ్ళీసారి ఫామిలీతో వచ్చి చూస్తాను...." అన్నాడు మేనేజరుతో.

"మీకు పక్క పక్క సీట్లు దొరకవేమో సార్-" అన్నాడు మేనేజర్.

"ఫామిలీతో వచ్చి ఇలా యెందుకు చూస్తాను?" అడ్వాన్సుగా టికెట్సు తీసుకుంటాను—" అన్నాడు చంద్రకాంత్ అక్కణ్ణించి కదులుతూ.

అతడిక అప్పుడు హోటల్ డాల్ఫిన్సుకు వెళ్ళలేదు. వెంకన్నను డిస్టర్బ్ చేయడం ఇష్టంలేక తిన్నగా ఇంటికే వెళ్ళాడు. వెళ్ళేసరికింటి దగ్గరే డిటెక్టివ్ వెంకన్న యెదురయ్యాడు.

చంద్రకాంత్ కి వెంకన్నతో పూర్వపరిచయముంది.

చూస్తూనే సురపతి—"నమస్కారం—" అన్నాడు.

"నమస్కారం పెద్దలకి— నేను వయసులో నీకంటే చిన్నవాణ్ని—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

చంద్రకాంత్ ఆశ్చర్యంగా—"మీరు నాకంటే పెద్దవారని విన్నాను—కనీసం ఒకటి రెండేళ్ళు-" అన్నాడు.

"నా యింట్లో భార్యకాక ఇద్దరసిస్టెట్లాడవాళ్ళు. వాళ్ళతో మసలడంవల్ల వయసు కాస్త తగ్గించి చెప్పుకోవడం అలవాటయింది. నేను నీకంటే కాస్త పెద్దవాణ్ని కావచ్చు. అంతమాత్రాన మనం నువ్వనుకుంటే తప్పా?" అన్నాడు వెంకన్న.

"తప్పులేదు — మీరొక్కరే కూర్చున్నారు....ఆదే నువ్వు ఒక్కడివే కూర్చున్నావు....—ఇంట్లో యెవరూ లేరా?"

"ఉన్నారు. నీ నాయనమ్మ మా ఆవిణ్ని నాతో మాట్లాడనివ్వడం లేదు. మీ నాయనమ్మతో మాట్లాడ్డం నాకిష్టంలేదు అందువల్ల ఒంటరిగా వదిలి పెట్టమని ఆవిణ్ని కోరాను. ఆవిడ నా కోర్కెను మన్నించి చాటుగా నన్ను గమనిస్తోంది...." అన్నాడు వెంకన్న.

అప్పుడు చటుక్కున ఓ వృద్ధురాలక్కడకు వచ్చి—"పోలీసినస్పెక్టరు నాయనమ్మని — మనుషుల్నామాత్రం అనుమానిస్తే తప్పా?" అంది.

వెంకన్న నవ్వి—"మీరు వయసులో నాకంటే చాలా పెద్దవారు. మీరేం చేసినా తప్పులేదు...." అన్నాడు.

"వ్రాడికి వినయగుణముంది—" అనుకుంటూ చంద్రకాంత్ నాయనమ్మ లోపలకు వెళ్ళిపోయింది.

అప్పుడు చంద్రకాంత్ ఉలిక్కిపడి—"అరే—అసలు మీరు....నువ్వు....ఇక్కడికెందుకొచ్చారు? నా యిల్లెలా

తెలిసింది?" అన్నాడు.

"జయదేవ్ మహల్నించి హోటలుకెళ్ళగానే రిసెప్షనిస్టు నీ గురించి చెప్పింది. అయితే ముత్యాలమ్మ కార్యక్రమానికి నువ్వు నా గురించే వచ్చావన్న విషయం గుర్తించి వెంటనే నీకోసం వచ్చాను. ఇక్కడ నీకోసం పదినిమిషాల్నించి యెదురుచూస్తున్నాను—" అన్నాడు వెంకన్న.

"అంటే హాల్లో మీరు అదే నువ్వు నన్ను చూశావన్నమాట...."

"అవు—చాలాసేపు గుమ్మం దగ్గర నిలబడి కార్యక్రమం చూశావు. ఆ తర్వాత కేశవరావు లేచివెడితే మేనేజరు నిన్నా సీట్లో కూర్చోపెట్టాడు. అదీ చూశాను. అప్పుడు నువ్వు నాకోసమే వచ్చావని తెలిస్తే పలకరించివుండేవాణ్ని. ఓసారి హాలో అందామనుకున్నాను కానీ ప్రోగ్రాం వదిలేక హడావుడై పోయింది. ఇక నీ యిల్లంటావా—నాకోసం హోటల్ దగ్గర మీ వాళ్ళో కారు వదిలిపెట్టారు. అది చూడ్డానికి టాక్సీలా వుంటుంది. నన్ను దిగబెట్టి వెళ్ళిపోయి మళ్ళీ నేను చెప్పిన టైముకి పికప్ చేసుకుందుకు వస్తుంది. అప్పుడా టాక్సీ నంబరు మారుతుంది. డ్రైవరుకూడా మారతాడు...." అన్నాడు వెంకన్న.

"అంటే నువ్విక్కడ అప్పుడే రంగంలో దిగిపోయావన్నమాట...."

"అవును...."

"రంగంలో దిగినవాడివి — మిస్ ముత్యాలమ్మ ప్రోగ్రాం కెందుకెళ్ళినట్టు?" అన్నాడు చంద్రకాంత్.

"వెళ్ళింది ముత్యాలమ్మ ప్రోగ్రానికేగానీ ముత్యా

లమ్మతో ప్రోగ్రానికొక్కాదుగదా — అందులో తప్పే ముంది? అందులోనూ సతీసమేతంగా వెళ్ళాను...." అని నవ్వి—"నువ్వు నాకోసం వచ్చేవా? ప్రోగ్రాం చూడ్డాని కొచ్చావా?" అన్నాడు వెంకన్న.

"నేను వచ్చింది మీకోసమే—అదే నీకోసమే.... కానీ అక్కడ ప్రోగ్రాం చూస్తూ వచ్చిన పని మర్చి పోయాను...."

"నిజమేలే—ఆ ప్రోగ్రాం మత్తు అలాంటిది. నాతో వచ్చిన నా భార్య, అసిస్టెంట్సు పనికూడా అంతే అయింది—" అన్నాడు వెంకన్న.

"కానీ మీరు....అదే నువ్వు...." అని—"సారీ వెంకన్నగారూ—నాకు మీరంటే చాలా గౌరవభావ ముంది. నువ్వనలేకపోతున్నాను. ఏమీ అనుకోవద్దు...." అన్నాడు చంద్రకాంత్.

"కానీ నేను నిన్ను నువ్వనే అంటాను. నేను నువ్వం టున్నప్పుడు నీ చేత మీరనిపించుకోవడం బాగుండదని పించి అలా అన్నాను. నీ యిష్టం....కానీ....నువ్వేదో చెప్పబోయి మాట మార్చావు...." అన్నాడు వెంకన్న.

"అదే మీరు....ప్రోగ్రాం మత్తులో పడ్డట్లు లేరు."

"పడితే ఎలా? నేను వచ్చిందెందుకు? ప్రోగ్రాం మత్తులో పడడానికొక్కాదుగదా.." అన్నాడు వెంకన్న.

"మరెందుకు?" అన్నాడు చంద్రకాంత్ కుతూహలంగా.

"నువ్వు గమనించావో లేదో — విశాఖపట్నంలో స్మగ్లింగ్ అపరేషన్సు ప్రారంభం కావడానికీ—మిస్ ముత్యాలమ్మ కార్యక్రమం ప్రారంభం కావడానికో సంబంధముంది...."

"ఎలా?"

"స్టూడెంట్స్ హాస్టలు దగ్గర మత్తుపదార్థాలమ్ముతూ ఓ వ్యక్తి పట్టుబడ్డాడు. అతణ్ణించి వివరాలు రాబట్టాలనుకునేలోగా విషం మింగి చచ్చాడు. సరిగ్గా అంతకు రెండురోజులముందే మిస్ ముత్యాలమ్మ తొలిప్రోగ్రాం అయింది...."

"మీరంటున్నది నాకు హాస్యాస్పదంగా వుంది—" అన్నాడు. చంద్రకాంత్ — "సరిగ్గా స్మగ్లింగ్ ఆపరేషన్కు ముందురోజున యేదైనా సినిమా రిలీజైతే నేరాన్నా సినిమాకే అంటగడతారా?"

"సినిమాకూ మిస్ ముత్యాలమ్మకూ తేడా వుంది. సినిమా బాగుంటే వందరోజులాడుతుంది. లేకుంటే ఒకరోజులో పోతుంది. కానీ ముత్యాలమ్మవంటి వాళ్ళ ప్రోగ్రామ్సు సాధారణంగా విశాఖపట్నంకంటె పెద్ద నగరాల్లో కూడా రెండుమూడు రోజులుండవు అలాంటిది ముత్యాలమ్మ షోస్ మూడు నెలలు మకాం పెడుతోంది. చిత్రంగా లేదూ?"

"మీరు చెబుతూంటే అనిపిస్తోంది. ముత్యాలమ్మే స్మగ్లింగ్ ముఠాను నడిపిస్తోందంటారా?"

"లేదు. కానీ స్మగ్లింగ్ రాకెట్లో ఆమె పాత్ర వుందని నా నమ్మకం...."

"ఎలా?" అన్నాడు చంద్రకాంత్.

వెంకన్న ఏదో అనబోగా ప్లేట్లలో ఇడ్లీలతో అప్పుడే వచ్చింది చంద్రకాంత్ భార్య — "అన్నయ్యగారు నాయనమ్మనుమానించారు. నేను పిల్లాణ్ణి నిద్రపుచ్చాలని లోపలుండిపోయాను...." అందామె.

ఆమె లోపల్నుంచి తమ సంభాషణంతా వింటోందని

గ్రహించిన వెంకన్న నవ్వుతూ—"సరేలే చెల్లెమ్మా.... ఇడ్లీలు నాకోసం నిజంగా వున్నాయా లేక మీ ఆయన కాలస్యమైపోతోందని నాకూ తెచ్చావా?" అన్నాడు.

"భలేవారే—అంతటి ఛలోక్తులు మా ఆవిడకర్థం కావు. ఆహారం చేసుకోగలదు—...." అన్నాడు చంద్రకాంత్.

"నిజమే—నా మెదడుకిప్పుడు పెళ్ళికిముందు పదును లేదు. ఆర్నెల్లేం కర్మ—చాలా ఏళ్ళ సావాసంకదా.," అంది చంద్రకాంత్ భార్య.

"ఇడ్లీలు పెడతారని తెలిస్తే మా ఆవిణ్ని కూడా తీసుకొద్దును తనకు చాలా యిష్టం-" అంటూ ఓ ముక్క విరిచి చట్నీలో నంచుకుని నోట్లో వేసుకుని—"రేపు మా ఆవిణ్నిక్కడికి పంపి ఈ చట్నీ రహస్యం ఛేదించమని చెప్పాలి—" అన్నాడు వెంకన్న.

"మంచినీళ్ళు తెస్తాను—" అని లోపలకు వెళ్ళింది చంద్రకాంత్ భార్య. ఆమె సిగ్గు నదిమిపెడుతూ నడిచి వెడుతూంటే వెంకన్నకు నవ్వొచ్చింది. అతడు గబగబా ఇడ్లీలు తినేసి టైము చూసుకుని—"టాక్సీ రావడానికింక పదిహేను నిమిషాలుంది. నేను నిన్ను కలుసుకుందుకు వచ్చిన ముఖ్యమైన పనేమిటంటే — ముత్యాలమ్మ ప్రోగ్రాం అవుతూండగా మధ్యలో లేచివెళ్ళిన ముగ్గురు ప్రముఖుల వివరాలు నాకు తెలుసుకొని రేపు సాయంత్రానికల్లా రిపోర్టివ్వాలి...." అన్నాడు వెంకన్న.

"ఎవరు వాళ్ళు?"

"కేశవరావు, మాధవరావు, గోవిందరావు.... వాళ్ళకు నడి జార్లో షాపులున్నాయి. పుర ప్రముఖుల జాబితాలోనే వస్తారు వాళ్ళు...."

"మీరు వాళ్ళనెప్పుడు గమనించారు?" ఆశ్చర్యంగా అడిగాడు చంద్రకాంత్.

"చెప్పానుగా.... నేను వెళ్ళింది ముత్యాలమ్మ ప్రోగ్రాం మత్తులో పడ్డానిక్కాదని...."

"మిస్ ముత్యాలమ్మ ప్రోగ్రాం గురించి మీ అనుమానమేమిటి?"

"అవన్నీ రేపు చెబుతాను...." అన్నాడు వెంకన్న.

తర్వాత అతడు చంద్రకాంత్ భార్య యిచ్చిన మంచి నీళ్ళు తాగి ఆ యింట్లోంచి బైటకు వచ్చాడు.

చంద్రకాంత్ అతడికి వీడ్కోలు చెప్పడానికి గేటు దాకా వెళ్ళాడు.

వెంకన్న రోడ్డెక్కి నాలుగడుగులు వేశాడో లేదో ఓ టాక్సీ అతణ్ని దూసుకుంటూ వెళ్ళింది.

"టాక్సీ!" అన్నాడు వెంకన్న.

టాక్సీ కాస్త దూరంలో ఆగింది.

"ఏర్పాట్లు బాగున్నాయి—" అనుకున్నాడు చంద్రకాంత్.

## 3

ఇన్‌స్పెక్టర్ చంద్రకాంత్ ముగ్గురు పురప్రముఖుల చరిత్రలూ వాకబు చేశాడు.

కేశవరావు పెద్దింటివాడే కానీ చదువబ్బలేదు. అల్లరి చిల్లరిగా తిరుగుతూంటే తండ్రి అతడి భవిష్యత్తు గురించి బెంగెట్టుకున్నాడు. చివరికతడు వ్యాపారంలో స్థిరపడి రాణించాడు. అతడి స్నేహితులంత ఎన్నదగిన వారు కాదు. కేశవరావు గురించి పోలీసు రికార్డుల్లో చెడ్డగా లేదు. కానీ ఊళ్ళో జరిగిన కొన్ని నేరాల వెనుక అతని హస్తముందా అని అనుమానించడం జరిగింది కొన్ని సందర్భాల్లో!

మాధవరావు ఆంధ్రుడు కాడు. మరాఠీ వాడు. వలసవచ్చి కాఫీ హోటల్లో క్లీనరుగా చేరాడు. ఎలాగయ్యాడో హఠాత్తుగా గొప్పవాడయ్యాడు. ముందుగా హోటలు ప్రారంభించాడు. తర్వాత హార్డువేర్ మర్చంటయ్యాడు. అతడి పేరొక్కసారి కూడా పోలీసుల రికార్డులోకి రాలేదు.

గోవిందరావుకు చిన్నతనంనుంచీ చిల్లరవ్యాపారాలున్నాయి. అదే పెద్దయ్యాక డిపార్టుమెంటల్ స్టోరుగా మారింది. ఊళ్ళో బ్రోతిల్ హౌస్ నడుపుతున్నాడని పుకారు. సాక్ష్యాలు లేవు. పేరుపడిన గూండాలక్కూడా ఒక్కచేత్తో సమాధానం చెప్పగలిగిన బలవంతుడు, ధైర్యవంతుడు. తనూ గూండాలాంటివాడే! చాలాసార్లు చాలా ప్రాంతాల తగువుల్లో ఇరుక్కున్నాడు. ఒకసారి ఆడపిల్లల అపహరణ కేసులో అరెస్టయ్యాడు. ఆర్నెల్లపాటు కోర్టు చుట్టూ తిరిగి నిరపరాధిగా వదిలిపెట్టబడ్డాడు.

ఈ ముగ్గురికీ ఒకరితో ఒకరికి సంబంధం లేదు. పరిచయాలున్నట్లు కూడా కనబడదు.

చంద్రకాంత్ ఈ వివరాలతో డాల్ఫిన్స్ హోటలుకి వెళ్ళాడు.

అతడు వెళ్ళేసరికి గదిలో వెంకన్న ఒక్కడే వున్నాడు.

"మన సంభాషణకంతరాయమని వాళ్ళను బైటకు పంపేశాను—" అన్నాను వెంకన్న.

"మీ పరిశోధనలక్కూడా వాళ్ళంతరాయమేనని నా అభిప్రాయం. అసలు మీరు వాళ్ళని కూడా ఎందుకు తెచ్చినట్లు?" అన్నాడు చంద్రకాంత్.

"లేవడానికి వాళ్ళేమైనా వస్తువులా? వాళ్ళే వచ్చారు...." అని నవ్వి—"నా అసిస్టెంటిద్దరూ చురుకైనవాళ్ళు. వాళ్ళ అవసరం నాకుంటుందనిపించింది. వాళ్ళు కన్నెపిల్లలు కావడంతో—నాకు బాడీగార్డుగా నా భార్యకూడా బయల్దేరింది...." అన్నాడు వెంకన్న.

"మీరు మీ ఆవిడపై చాలా అభియోగాలు తెస్తున్నారు. నేను నమ్మను...." అన్నాడు చంద్రకాంత్.

"నువ్వేమిటి — నేనే నమ్మలేకపోతున్నాను. మా ఊళ్ళో అయితే నేనిలా యేదైనా అనబోయేసరికి వంటింట్లోంచి ఆఫీసు గదిలోకి ఫోన్ చేసి హెచ్చరిస్తుంది. అక్కడేం మాట్లాడాలన్నా అగుమే! అది బాగా అలవాటైపోయి — ఇప్పుడిలా మాట్లాడుతూంటే నేను నేనేనా అని అనుమానంగా ఉంది—" అంటూండగా పక్కనే బల్లమీద ఫోన్ మ్రోగింది.

చంద్రకాంత్ పక్కనే వుంది ఫోన్. అందుకని అతడే ఫోనెత్తాడు.

"నేను — పద్మావతిని....మీరేనా మాట్లాడుతూంట...." అందవతలి గొంతు.

చంద్రకాంత్ ఫోన్ వెంకన్న కందించి—"మీ ఆవిడ—" అన్నాడు. అతడికి నవ్వొస్తుంటే పళ్ళ బిగువున ఆపుకున్నాడు.

వెంకన్న ముఖం చిట్లించి—"హలో!" అన్నాడు. ఆ తర్వాత అతడి ముఖం గంభీరంగా అయిపోయింది. చివరగా—"వెరీగుడ్—ప్రొసీడ్...." అని ఫోన్ పెట్టేశాడు.

చంద్రకాంత్ శ్రద్ధగా ఆ ఫోన్ సంభాషణ విన్నాడు. పద్మావతి మాటలు కూడా అతడికి వినపడు

తూనే ఉన్నాయి.

వెంకన్న భార్య అసిస్టెంట్సుతో కలిసి ముత్యాలమ్మను పలకరించడానికి వెళ్ళింది. అక్కణ్నించి జయదేవ్ మహల్ ప్రొప్రయిటరింటికి వెళుతోంది.

"మీరు వాళ్ళను పనిమీద పంపేరన్నమాట—...." అన్నాడతను.

వెంకన్న నవ్వి—"నే నడిగినవాళ్ళ వివరాలు సంపాదించారా?" అనడిగాడు మాట మార్చుతూ.

చంద్రకాంత్ అతడికి వివరాలు చెప్పి "మీ అనుమానం ముత్యాలమ్మ పైనా, జయదేవ్ మహల్ పైనా ఉంటే అందుక్కారణ మేమిటి? అసలేం జరుగుతుందంటారు?" అన్నాడు.

"ఏం జరుగుతోందో చెప్పలేను. కానీ జయదేవ్ మహల్లో నే ఏదో జరుగుతోంది. అందులో ముత్యాలమ్మది ప్రముఖపాత్ర—...."

"ఎలా చెప్పగలరు?"

"పోలీసు లిప్పటికే కేశవరావు, మాధవరావు, గోవిందరావుల మీద ఓ కన్నేసి ఉంచారు — నా మాటపై! ఈ వేళా రేపట్లో యేమైనా విశేషం బయటపడొచ్చు—"

"మీకు కొంత తెలిసింది.... నాకు చెప్పడంలేదు—" అన్నాడు చంద్రకాంత్.

"జయదేవ్ మహల్ స్మగ్లింగ్ రాకెట్ కు సమాచార కేంద్రంగా ఉపయోగపడుతోంది. అక్కడ మిస్ ముత్యాలమ్మ తన ప్రదర్శనలతో జనాల్ని సమ్మోహితుల్ని చేస్తూంటే దేశద్రోహులు తమ వ్యవహారాలు కొనసాగిస్తారు. ఒకరితో ఒకరు మాట్లాడుకుని సందేశా లిచ్చు

కుంటారు. ఇదీ నా అనుమానం——..."

"అయితే జయదేవ్ మహల్ ప్రొప్రయిటరు స్మగ్లింగ్ రాకెట్ నడుపుతున్నాడంటారా?"

"జయదేవ్ మహల్ ప్రొప్రయిటరు పురుషుడు కాదు. స్త్రీ. ఆమె పేరు జయదేవి. ఆమెకు లలితకళలంటే ప్రాణం. జాతీయ స్థాయిలో పేరు పొందిన గాయకురాలామె. ఆమె భర్తకు పెద్ద ఎస్టేటుండి. ఆమెకు పాతికేళ్ళప్పుడే అతడు మరణించాడు. ఆమెకు భర్తంటే ప్రాణం. అతడి పేరు జయదేవ్. అతడిని నిత్యం స్మరించుకోవాలని తన పేరును కూడా అతడి పేరుకు దగ్గరలో మార్చుకుంది. ఎస్టేటంతో మిగల్లేను భర్త పోయేసరికి అదామె క్లియర్ చేసి వచ్చిన డబ్బును బ్యాంకులో డిపాజిట్ చేసి తను దేశం నలుమూలలా తిరిగి ప్రదర్శనలిచ్చింది——గాయనిగా! ఆమె ప్రదర్శనలామెకు బాగా డబ్బు సంపాదించి పెట్టాయి. ఆ డబ్బుతోనే కొన్నేళ్ళ క్రితం జయదేవ్ మహల్ కట్టించింది. కళాసేవ చేసుకుంటోంది. ఆమెకు పిల్లలు లేరు. వయసిప్పుడే లై. ఆమెను స్మగ్లింగ్ రాకెట్ వ్యక్తిగా ఊహించుకోవడం మహాపాపం——...."

"అయితే ఏం జరిగిందంటారు?"

"జయదేవ్ మహల్లో ముత్యాలమ్మ కార్యక్రమాలకు ఏవరేర్పాటు చేస్తున్నారో తెలుసుకోవాలి. అందుకే పద్మావతిని పంపాను...." అన్నాడు వెంకన్న.

"మరి ముత్యాలమ్మ...."

"శ్రోతలను సమ్మోహితుల్ని చేయడం మినహాగా ఆమెకింకేమీ తెలుసు ననుకోను. తనకు తెలియకుండా నే ఆమె స్మగ్లర్సుకు సహకరిస్తోందని నా అభిప్రాయం. ఆమె

వెర రీ ఊరు రప్పించారో—యిక్కడెక్కడ కాల మెందుకుంటోందో—తెలుసుకోమని పద్మావతిని పంపించాను—....”

“ఏమైనా తెలిసిందా?”

“అంతా నువ్వూ విన్నావుగా. ప్రయోజనకరమైన సమాచారం తెలిసిందని చెప్పి ఊరుకుంది. ఫోన్లో చెప్పడం యిష్టంలేదనుకుంటాను....”

“నా భార్యను కొన్నాళ్ళపాటు మీ శ్రీమతివద్ద శిక్షణకు పంపాలి. ఇలా పరిశోధనలు చేయగలిగితే—నా కెంతో ఉపయోగపడుతుంది—....” అన్నాడు చంద్రకాంత్.

“అరే—నే నింకా మీ నాయనమ్మ దగ్గరకొచ్చి చాలా నేర్చుకోవాలనుకుంటున్నాను—” అన్నాడు వెంకన్న.

“సరే—అది మీరు మర్చిపోరు....—” అని—

“ఇంతకీ నేరస్థుడు జయదేవ్ మహల్ నెందు కెన్నుకున్నాడు? వేరే చోటు లేకనా?—....” అన్నాడు చంద్రకాంత్.

“స్మగ్లర్సును పోలీసులు దిగ్బంధం చేసేశారు. పోస్టల్ డిపార్టుమెంట్లో ఉత్తరాలను శాంపిల్ సర్వే జరుగుతోంది. కొన్నివేల ఉత్తరాల్లో స్మగ్లర్సుకి సంబంధించినవి పట్టుకోవడం సాధ్యపడుతుందా అనుకోవచ్చు. కానీ స్మగ్లింగ్ రాకెట్ అలాంటి రిస్కు తీసుకోదు. ఒక చిన్న ఉత్తరం బైటపడితే డొంకంతా కదుల్తుంది. అలాగే టెలిఫోన్లన్నీ టాప్ చేయబడుతున్నాయి. ఈ విషయంలో మా వాళ్ళు రిస్కు తీసుకోలేకపోతున్నారు. ఏ కాల్ టాప్ చేయబడుతుందో పోలీసుల కామూకీ

తెలుస్తుందోనని వారు భయపడుతున్నారు —....”
అన్నాడు వెంకన్న.

“అయితే?”

“అందుకే జయదేవ్ మహల్ ని వాళ్ళెన్నుకున్నారు.... అక్కడకు వచ్చేది కళాభిమానులు. జరిగేది కళాప్రదర్శన. అలాంటి ప్రదేశాన్నెవరూ స్మగ్లింగ్ సమాచార కేంద్రంగా అనుమానించలేరు—”

“మీరు చెప్పింది బాగానే ఉంది....”

“తర్వాత మనం గమనించదగ్గ విశేష మింకొకటుంది. మిస్ ముత్యాలమ్మ అసమాన ప్రతిభావంతురాలు. ఆమె గొంతులో పలికే స్వరాల్లో శ్రోతలను హిప్నటైజ్ చేయగల శక్తి ఉంది. ఆ శక్తి నుంచి తప్పించుకోవడం సులభం కాదు. అలాంటి కార్యక్రమంలో—కేశవరావు, మాధవరావు, గోవిందరావు—మధ్యలోంచి లేచి వెళ్ళిపోయారు. అంటే కార్యక్రమ ప్రభావం వారిమీద లేదు...”

“వారిని గమనిస్తున్న మీమీదా లేదు....” అన్నాడు చంద్రకాంత్.

“ఆ పాయింటుకే వస్తున్నాను—....” అన్నాడు వెంకన్న—“నేనా కార్యక్రమానికి ఓ ప్రయోజనంతో వెళ్ళాను. నా దృష్టంతా ఆ ప్రయోజనంమీదే ఉంది. అందువల్ల మిస్ ముత్యాలమ్మ సమ్మోహన శక్తి నాపై పని చేయలేదు. అలాగే కేశవరావు, మాధవరావు, గోవిందరావు—అక్కడికేదో పెద్ద ప్రయోజనంమీదనే వెళ్ళివుండాలి. వారి ప్రయోజనం కాగానే అక్కణ్ణుంచి లేచిపోయి వుంటారు.”

“అక్కడేం జరిగిందంటారు?”

"మాధవరావు నా పక్కవరసలోనే కూర్చున్నాడు. అతడు లేచి వెళ్ళిపోతే నేను—మళ్ళీ వస్తాడనుకున్నాను. తిరిగిరాలేదు.... అతడి పక్క అటూ యిటూ కూడా యెవరో కూర్చొంటున్నారు. వాళ్ళు బుద్ధిమంతులు. స్మగ్లింగ్ రాకెట్లో వుండాల్సిన టైపు కాదు. అయినా ఒకవేళ వాళ్ళమీద నిఘా వేయబడింది...."

"ఆ కూర్చొంటేన్సే మాధవరావుకు సమాచారం అందజేశారేమో—ముఖాలు చూసి యేం చెప్పగలం?" అన్నాడు చంద్రకాంత్.

"కాదనను. కానీ నా పక్కనున్న వాళ్ళెవ్వరూ పెదవి విప్పి మాట్లాడుకోలేదు. కార్యక్రమంలో శ్రోత అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు...."

"చెవిలో గుసగుసలాడుకోవచ్చు. కాగితంమీద రాసి అందించుకోవచ్చు....

"అది నిజమే.... కానీ నీకు తెలియని విశేష మొకటుంది.... అదేమిటంటే—మొత్తం హాలు—కార్యక్రమ సమయంలో అబ్జర్వేషన్లో ఉంది ..."

చంద్రకాంత్ ఆశ్చర్యపడి "యేమన్నారూ?...." అన్నాడు.

"థియేటర్ నలుమూలలా కెమెరా లేర్పాటు చేయబడ్డాయి. శ్రోతలలో ప్రతి ఒక్కరి మూవ్ మెంట్స్ చిత్రీకరించడం జరిగింది.... ఆ రిపోర్టు నాకు వచ్చింది. ఆ ప్రకారం కేశవరావు, మాధవరావు, గోవిందరావుకూడా యెవరితోనూ మాట్లాడలేదు. ఉన్నట్లుండి ఏదో గుర్తుకు వచ్చినవాళ్ళలా లేచి నిలబడి బయటకు వెళ్ళిపోయారు. కాసేపట్లో ఆ కాసెట్లు నాకు అందుతాయి. మరోసారి

వాటిని చూస్తాను—....” అన్నాడు వెంకన్న.

"మీ దృష్టంతా జయదేవ్ మహల్ మీదే ఉంది. అన్ని యేర్పాట్లూ అక్కడే చేసుకుంటున్నారు. దురదృష్టవశాత్తూ మీ ఆలోచన తప్పయితే—....”

"ఆ అనుమానం నాకుంది. ఒకోసారి మన దృష్టిని మళ్ళించడానికి లాంటివి చేస్తుంటారు నేరస్థులు. నేనీ ఊరొస్తున్నానని తెలిసి — నేరస్థులు నా దృష్టిని మరల్చి తప్పుదారికి మళ్ళించడానికే జయదేవ్ మహల్లో, ముత్యాలమ్మ కార్యక్రమము నిర్ణయించి ఉండవచ్చు. అయితే ఒకోసారి లోతుగా ఆలోచించడంవల్ల మనం ఒక్కడుగు కూడా ముందుకు వెయ్యలేం. నా ఆలోచన తప్పు కాదని నా నమ్మకం. అందుకే జయదేవ్ మహల్ని నాలుగు వేపుల నుంచీ చుట్టుముట్టుతున్నాను. దీని గురించి మరొక్క వారం మినహా వృథా చేయను—....”

"ఆ తర్వాతేం చేస్తారు?"

"వచ్చేవారం ముత్యాలమ్మ ప్రోగ్రాంలో అన్నీ బైటపడతాయని నేను నమ్ముతున్నాను....” అన్నాడు వెంకన్న.

"అంతా మీ రనుకున్నట్లే జరగాలని ఆశిస్తున్నాను. నా వల్ల మీకు సాయం ఏం కావాలో చెప్పండి....”

"ఈ వేళా రేపట్లో—బంగారం, మాదక ద్రవ్యాలతో మనుషులెవరైనా పట్టుబడొచ్చు.... అప్రమత్తులై ఉండాలి మీ డిపార్టుమెంటు—....” అన్నాడు వెంకన్న.

చంద్రకాంత్ అతడివద్ద సెలవు తీసుకున్నాడు.

## 4

సేఠ్ గులాబ్‌చంద్ నిజాయితీపరుడయిన వ్యాపారి. తనవద్దకు బంగారం బిస్కట్ తెచ్చిన వ్యక్తిని పోలీసులకు అప్పగించాడు.

చంద్రకాంత్ ఆ వ్యక్తికి పోలీసుదెబ్బల రుచి చూపించాడు.

"నా పేరు విక్టర్...." అన్నాడతడు.

"ఇంకా...." అన్నాడు చంద్రకాంత్.

"నల్లగా పొడుగ్గా వున్న వ్యక్తి నాతో సూట్‌కేసిచ్చి ఎల్లమ్మతోట దగ్గర పార్కులో పెట్టమన్నాడు. అందుకు ప్రతిఫలంగా నాకీ బిస్కట్టిచ్చాడు. అది మార్చాలనుకుని మీకు పట్టుబడ్డాను. ఇంతకుమించి నాకేమీ తెలియదు...."

చంద్రకాంత్ లాఠీ అతడి ఒంటిమీద నాట్యం చేసింది. కానీ అంతకుమించి అతణ్నించి కే సమాచారమూ అందలేదు.

చంద్రకాంత్ వెంకన్నకు ఫోన్ చేసి విషయం చెప్పాడు.

మరో పావు గంటలో వెంకన్న పోలీస్‌స్టేషన్లో వున్నాడు.

చంద్రకాంత్ అతణ్ని విక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాడు.

"నా పేరు వెంకన్న. నేను నిన్ను రక్షించడానికి వచ్చాను...." అన్నాడతడు.

విక్టర్ ఆదోలా నవ్వి ఊరుకున్నాడు.

"నా ప్రశ్నలకు నువ్వు సూటిగా జవాబు చెప్పాలి...."

విక్టర్ మాట్లాడకుండా నిర్లక్ష్యంగా వెంకన్నవంక

చూశాడు.

"నీకు సేఠ్ గులాబ్‌చంద్ ఎలా తెలుసు?"

"బజార్లో ఆయనకు బంగారు నగల వ్యాపార ముంది...."

"అలాంటి దుకాణాలు చాలా వున్నాయి. సేఠ్ గులాబ్‌చంద్ దగ్గరకే నువ్వెందుకెళ్ళావు?"

విక్టర్ మాట్లాడలేదు.

"ఎవరో నీకా షాపు గురించి సూచించి ఉండాలి. అవునా?"

విక్టర్ తలాడించాడు.

"ఎవరతడు?"

"నాకు నోట్ కేసందించిన వ్యక్తి....అత డెవరో నాకు తెలియదు. నల్లగా పొడుగ్గా వున్నాడు...."

"అతడు నీకు సేఠ్ గులాబ్‌చంద్ గురించి చెప్పాడంటే—అతడు నీ శ్రేయోభిలాషి కాదు. ఎందుకంటే యింతవరకూ గులాబ్‌చంద్ యెందరినో పోలీసులకు అప్పగించాడు. నిన్ను పోలీసుల కప్పగించాలనే అతడను కున్నాడు ..."

విక్టర్ మాట్లాడలేదు.

"అతడెవరో నీకు తెలుసు. చెప్పు...."

"నాకు తెలియదు—" అన్నాడు విక్టర్.

చంద్రకాంత్ లాఠీ యెత్తి—"చెప్పు—...." అన్నాడు.

వెంకన్న అతణ్ని వారించి—"పద—ఇక్కణ్నించి పోదాం—" అన్నాడు.

ఇద్దరూ అక్కణ్నించి వెళ్ళి ఆఫీసురూంలో కూర్చు

న్నారు.

“విక్టర్‌గురించి నువ్వు తెలుసుకున్న విశేషాలను బట్టి నీ కేమనిపిస్తోంది....”

“మీరు మరోసారి విక్టర్ని కలుసుకుని నా కంటే యెక్కువ తెలుసుకోలేదనిపించింది....” అన్నాడు చంద్రకాంత్ చిరాగ్గా.

వెంకన్న నవ్వి—“సేఠ్ గులాబ్‌చంద్‌పై నీ అభిప్రాయం?” అన్నాడు.

“నా అభిప్రాయ మేమిటి? మొత్తం డిపార్టుమెంటంతా అతడికి ఋణపడి ఉంటుంది....” అన్నాడు చంద్రకాంత్.

“చాలాసార్లు గులాబ్‌చంద్ దొంగల్ని పట్టిచ్చాడు. ఆ విషయం పత్రికా ముఖంగా కూడా వచ్చింది. అవునా?” అన్నాడు.

“ఊఁ!”

“అలాంటప్పుడు దొంగసరుకు అమ్మేవాళ్ళు—గులాబ్‌చంద్ వద్ద ఇంకా దొంగసరుకు తీసుకుని వెడుతున్నారంటే — వాళ్ళెవరికి కొత్తవాళ్ళయి ఉండాలి. వాళ్ళ నుపయోగించుకున్నవాళ్ళు కావాలని వాళ్ళను పోలీసుల కప్పజెప్పాలనుకుంటున్నారు. ఆ విధంగా పోలీసుల దృష్టి మళ్ళించి తమ పని చక్కబెట్టుకుంటున్నారు. విక్టర్‌కు నిజంగానే నల్లగా పొడుగ్గా ఉన్న ఆ వ్యక్తి తెలిసుండదు....”

“కావచ్చు....”

“లేదా — గులాబ్‌చందే ఏదో నాటక మాడుతున్నాడు. డిపార్టుమెంట్లో తన నిజాయితీని నిలబెట్టుకునేందుకు విక్టర్‌లాంటి వాళ్ళనతడు బలిపెడుతున్నాడు.

అసలు నల్లగా పొడుగ్గా వున్న వ్యక్తంటూ యెవరూ లేడు. అంతా విక్టర్ కల్పన. గులాబ్ చంద్ చెప్పినట్లే చేస్తున్నాడతడు ...."

"అందువల్ల అతడికి ప్రయోజనమేమిటి? చావుదెబ్బలు తినడం మినహాగా—" అన్నాడు చంద్రకాంత్

"ఎవరెస్టు శిఖరం చేరాలనుకున్నవాడు — వళ్ళు హూనమైపోతున్నా మంచుకొండలపై నడుస్తూనే ఉంటాడు. ఊపిరాడకపోతున్నా మాస్కులు పెట్టుకుని అవస్థపడతాడు. చలి వణికిస్తూంటే యెలాగో ఓర్చుకుంటాడు. ఏదో సాధించాలన్న తపన అది. అంటే మనిషికి ప్రయోజనమున్నప్పుడెంత బాధనైనా ఓర్చుకుంటాడు. ఈ నేరస్థులూ అలాంటివాళ్ళే! డబ్బు సంపాదించడంకోసం వాళ్ళేమైనా చేస్తారు. విక్టర్ నువ్వు పెట్టే బాధలన్నీ తట్టుకుంటాడు. అందుకు తగ్గ ప్రతిఫలం పొందుతాడు. ప్రస్తుతానికి గులాబ్ చంద్ ప్రయోజనం సాధిస్తాడతడు. నిజాయితీపరుడని తెలిసీ — దొంగలు గులాబ్ చంద్ దగ్గరకే వెడుతున్నారంటే-నువ్వు గులాబ్ చంద్ నే అనుమానించాలి — అలాంటిదెప్పుడైనా చేశావా?"

చంద్రకాంత్ ముఖం చిన్నబోయింది—"మీ ఆలోచనా ధోరణి చూస్తూంటే నాకాశ్చర్యంగా వుంది. ఇలా యెందుకాలోచించలేమా అని చిన్నతనంగా వుంది. లోపమెక్కడుందో తెలియడంలేదు—"

"డియర్ మిస్టర్ చంద్రకాంత్ —....లోపం మీ డిపార్టుమెంటు శిక్షణలో వుంది. మొదట మీకు నేరస్థుడంటే గౌరవంలేదు. వాడి తెలివిపైన నమ్మకంలేదు. పిల్లి ఎలకను వేటాడినట్లు వాణ్ని వేటాడాలనుకుంటారు.

చేతిలో అధికారముంది కాబట్టి వాణ్ని హింసించాలనుకుంటారు...."

"వెంకన్నగారూ — నా కర్థమవుతోంది. నేరస్థుడి గురించి చెబుతూ మా డీయస్పీగారొకసారి గవాస్కర్‌తో పోల్చారు. ఇప్పుడు మీరేమో ఎవరెస్టు శిఖరాధిరోహణ చేసేవారితో పోల్చారు. నేరస్థుల గురించి నేనెప్పుడూ ఆలోచించలేదలా....వాళ్ళు క్రూరులు....సంఘ విద్రోహులు....వాళ్ళను కసిగా అంతం చేయాలనే అనుకున్నాను......ఎప్పుడూ వాళ్ళ గురించి మనుషులన్న దృష్టితో ఆలోచించలేదు—...." అన్నాడు చంద్రకాంత్.

"అలా ఆలోచించినప్పుడే మీరు నేరాల్ని రూపుమాపగల్గుతారు. నిత్యం గూండాలతో, దుష్టులతో మసిలే మీరు — క్రమంగా రఫ్‌గా మారిపోవడంలో ఆశ్చర్యంలేదు. కానీ అప్పుడు మీకూ నేరస్థులకూ తేడా యేముంది? సమాజంలో దెబ్బతిని—రఫ్‌గా మారతాడు నేరస్థుడు. ఆ నేరస్థులతో వ్యవహరించి రఫ్‌గా మారతారు మీరు. అలాకాకుండా సావధానంగా ఆలోచిస్తే ఈ సమాజం ఒక అడవిలాంటిది. అందులో సాధు జంతువులూ, క్రూరమృగాలూ ఉంటాయి. క్రూరమృగాల బారినుంచి రక్షించుకోవడంకోసం మనం చట్టం, నియమాలు, ప్రభుత్వం ఏర్పాటు చేసుకున్నాం.

అయితే అడవిలో క్రూరమృగాలనుకూడా వన్యమృగ సంరక్షణ పేరిట—మనం వేటాడనివ్వడంలేదు. అలాంటప్పుడు నేరస్థులనుమాత్రం యెందుకు వేటాడాలి? అడవిలో క్రూరమృగాలు సృష్టిలోని ఒక భాగమనుకుంటే నేరస్థులనుకూడా సమాజంలో ఒక భాగంగా భావిం

చాలి. వాళ్ళను వేటాడ్డానికి బదులు సంస్కరించాలి. సాధ్యపడకపోతే — జంతువులను జూలో ఉంచినట్లు జైల్లో ఉంచాలి. జూలోని జంతువులను జాలిగా చూసినట్లే—జైల్లో నేరస్థుల్ని కూడా అభిమానంగా చూసుకోవాలి. కాదంటావా?"

"మీరు చెప్పినవన్నీ అంగీకరిస్తాను. నా ఆలోచనా ధోరణి మార్చుకుంటాను. విక్టర్నిక కొట్టను—" అన్నాడు చంద్రకాంత్.

"అంతే కాదు — గులాబ్ చంద్‌న్ననుమానించు—"

"అనుమానిస్తాను—"

"అయితే వెంటనే రంగంలోకి దూకు—"

చంద్రకాంత్ తెల్ల మొహం వేసి "ఎలా?" అన్నాడు.

"పాత ఖైదీని తప్పించు. గులాబ్ చంద్ యింట్లో దొంగతనానికి పంపు. గులాబ్ చంద్ దొంగతనం బైట పడుతుంది—...." అన్నాడు వెంకన్న.

"ఖైదీలను తప్పించడం చట్టరీత్యా నేరం—...."

"భలేవాడివే- నేను చెప్పిన విషయమిలా అర్థమయిందా నీకు?" అన్నాడు వెంకన్న — "విక్టర్ తనకు దొంగ బంగారం అమ్మచూపాడని గులాబ్ చంద్ అన్నాడు. విక్టర్ గులాబ్ చంద్ మనిషి. పాత ఖైదీ తప్పించుకున్నాడని నువ్వు ప్రచారం చేస్తావు తప్పించుకున్నవాడు ఖైదీ కానవసరంలేదు. గులాబ్ చందింట్లో సమర్థవంతంగా దొంగతనంచేయగలవాడెవరైనా సరే—పాతఖైదీయే—నీ డిపార్టుమెంట్లో అలాంటి మనుషులే లేరా?"

"ఉన్నారు. మీరుచెప్పిందంతా నాకర్థమయింది...."

వెంకన్న నవ్వి — "స్మగ్లింగ్ రాకెట్ మూల పురుషుల్ని బైటపెట్టడానికి నాకింక వారంరోజులు

గడువు చాలు—" అన్నాడు.

"అన్నట్లు మీరు—జయదేవ్ మహల్లో కేశవరావు, మాధవరావు, గోవిందరావు ఏం చేశారో ఆ విడియో చూశారా?"

"చూశాను — చాలా ముఖ్యమైన విశేషాలే తెలిశాయి...."

"ఏమిటవి?"

"కేశవరావు బుద్ధిగా థియేటర్లో ఎంటరయ్యాడు. తను లేచి వెళ్ళేదాకా యెవర్నీ పలకరించలేదు. స్మగ్లింగ్ గురించి సమాచారమేదీ అందిన జాడలేదు. మిగతా ఇద్దరి విషయంలోనూ అంతే జరిగింది...."

"ఇందులో ముఖ్య విశేషమేముంది?"

"ఒకవేళ జయదేవ్ మహల్లోనే స్మగ్లింగ్ రాకెట్ సమాచారాన్నొకరి కొకరికందజేస్తోందనుకో—అప్పుడెలా జరుగుతోంది?"

"మీరే చెప్పండి—"

"నువ్వా ఆ కార్యక్రమానికి వెళ్ళావు. ఆలోచించి చూడు. గుర్తు తెచ్చుకుని ఊహించి చెప్పు...."

"ఏమూహించను?—నాకేం స్ఫురించలేదు."

"అయితే నేనిప్పుడు చెప్పను. వచ్చే కార్యక్రమందాకా ఎదురుచూడు—"

"మిస్ ముత్యాలమ్మ ప్రోగ్రాంకు మా ఆవిణ్ణి తీసుకెడదామనుకుంటున్నాను...."

"తీసుకెళ్ళు — తప్పులేదు—.....కానీ నువ్వోసారి ప్రోగ్రాం చూసేశావు కాబట్టి—నీ భార్యను ప్రోగ్రాంకు వదిలిపెట్టి నువ్వు ప్రోగ్రాం చూసేవాళ్ళను గమనించు.

ఈలోగా జయదేవ్ మహల్ కాసెట్లు నీకోపారిస్తాను..." అంటూ లేచాడు వెంకన్న.

## 5

ఆ రోజు మిస్ ముత్యాలమ్మ కార్యక్రమం.

ఇన్స్పెక్టర్ చంద్రకాంత్ కార్యక్రమానికి వెళ్ళాడు భార్యతోసహా. కాసేపు పరిసరాలను గమనించాడు. తర్వాత ప్రోగ్రాంలో మునిగిపోయాడు.

అతడు తను వచ్చిన పని మర్చిపోలేదు. కానీ తనకు తనే—"అందర్నీ గమనిస్తూ నేను చేసేదేముందిక్కడ? సాధించేదేమీ లేనప్పుడు మంచి ప్రోగ్రామెందుకు మిస్సవ్వాలి?" అని సమాధానపర్చుకున్నాడు.

అతడి భార్యకూడా ప్రోగ్రాం పరవశంలో పడింది. మధ్య మధ్య ఆ పరవశాన్ని భర్తతో పంచుకునేది. భార్యను తీసుకుని వచ్చినందుకతడెంతో సంతోషించాడు. ముందురోజుకంటే ప్రోగ్రాం బాగా ఎంజాయ్ చేశాడతడు.

ప్రోగ్రాం అయిపోయాక—"చాలా థాంక్సండీ—ఇంత మంచి ప్రోగ్రాం నాకు చూపించారు. ఎవరిగొంతులోనూ ఇలాంటి అద్భుతశక్తి ఎరుగను నేను—" అంది చంద్రకాంత్ భార్య.

భార్యాభర్తలిద్దరూ బైటకొచ్చారు. మోటారుసైకిలు మీద యిల్లు చేరారు.

అప్పటికి డిటెక్టివ్ వెంకన్న డ్రాయింగ్ రూమ్‌లో ఉన్నాడు. చంద్రకాంత్ నాయనమ్మ అతడితో కబుర్లు చెబుతోంది.

చంద్రకాంత్‌ను చూస్తూనే—"వాళ్ళో డిస్టర్బ్ చేయడానికి నాకు మనసొప్పలేదు. అందుకని ఇంటికొచ్చాను—"

అన్నాడు వెంకన్న.

చంద్రకాంత్ భార్య అతడికి నమస్కరించి లోపలకు వెళ్ళింది. చంద్రకాంత్ అతడి రాకకు ఆశ్చర్యపడ్డాడు.

"నేను చెప్పింది-నువ్వు మర్చిపోయావు.." అన్నాడు వెంకన్న.

"మర్చిపోలేదు. అవసరం కనబడలేదు...."

"నేను గులాబ్ చంద్ ని అనుమానించమన్నాను. విన్నావు. ఏం జరిగింది?"

"స్మగ్లింగ్ బంగారం........అయిదువందల బిస్కట్లు గులాబ్ చందిట్లో దొరికింది. కానీ అతడికీ—జయదేవ్ మహల్ కీ సంబంధం లేదు గదా!"

"ఎందుకు లేదు? జయదేవ్ మహల్ కారణంగానే నేను గులాబ్ చంద్ ననుమానించాను...." అన్నాడు వెంకన్న.

"అదెలా జరిగింది?"

"ఎలా జరిగిందో నీకు నీవే తెలుసుకుంటావనే జయదేవ్ మహల్ గురించి నిన్ను ముందుగా హెచ్చరించాను. మిస్ ముత్యాలమ్మ కార్యక్రమానికే నువ్వు ప్రాధాన్యత నిచ్చావు. అయినా అది నీ తప్పు కాదులే—గవర్న మెంటుద్యోగులకే విషయంలోనూ అర్జెన్సీ ఫీలింగుండదు...."

చంద్రకాంత్—"అయాం సారీ—" అన్నాడు.

"అయినా తప్పు పూర్తిగా నీది కాదు. మిస్ ముత్యాలమ్మ గొంతులోని హిప్నాటిక్ పవర్ ని స్మగ్లింగ్ రాకెట్ ఉపయోగించుకోవాలన్న అద్భుతమైన ఆలోచన వచ్చిన వ్యక్తిని మనమభినందించాలి. ఆమె గొంతు నిన్ను నీ డ్యూటీ మర్చిపోయేలా చేయగలదు...."

"అలాగనకండి. ఆమె గొంతుకు మీరు లొంగలేదు.

నేనుమాత్రమెందుకు లొంగాలి? మీరు సాధించింది నేనూ సాధిస్తాను. తర్వాతి కార్యక్రమంలో నేను మీకు పూర్తిసాయపడతాను...." అన్నాడు చంద్రకాంత్.

"ఇంక నీకా అవకాశంలేదు. కేసు పూర్తయిపోయింది...."

"పూర్తయిపోయిందా?" అన్నాడు చంద్రకాంత్ ఆశ్చర్యంగా—"అయితే నేరస్థులెవరు?"

"ఎమ్మెల్యే భగవాన్‌లు—" అన్నాడు వెంకన్న.

"ఎలా తెలిసింది?"

"మిస్ ముత్యాలమ్మ కార్యక్రమాన్ని జయదేవ్ మహల్లో ఏర్పాటు చేయించిందాయనే...." అన్నాడు వెంకన్న.

"అంతమాత్రాన ఆయన స్మగ్లింగ్ రాకెట్ నడుపుతున్నట్లు మీరెలా చెప్పగలరు?"

"ఎలా చెప్పగలనంటే—కేవలం స్మగ్లింగ్ రాకెట్ వ్యవహారాలు నడపడానికే మిస్ ముత్యాలమ్మ యిక్కడకొచ్చింది...."

"కానీ మిస్ ముత్యాలమ్మలో అనుమానించతగ్గ విశేషమేదీ కనబడలేదే?"

"ఉంది. కానీ ఆమె హిప్నాటిక్ పవర్ మనవా విషయం గుర్తించకుండా చేసింది...."

"వెంకన్నగారూ — విషయమేమిటో సూటిగా చెప్పండి—"

"ముత్యాలమ్మ పాట పాడుతుంది. పాటలో స్మగ్లింగ్ రాకెట్‌కు సందేశముంటుంది...."

"చంద్రకాంత్ నోరు తెరిచి—"ఆఁ" అన్నాడు. ఓ క్షణమాగి—"నేను నమ్మను—" అన్నాడు.

"నువ్వు ముత్యాలమ్మ పాట, ఆట చూసి మురిసి పోయావు తప్ప—ఆమె ఏం పాడిందో యెప్పుడూ విన లేదు...."

చంద్రకాంత్ గుర్తుచేసుకుందుకు ప్రయత్నించాడు. అతడికి పాట స్ఫురించలేదు.

"నేను పాడి వినిపించనా?" అన్నాడు వెంకన్న. అతని మాట పూర్తయ్యేలోగానే అక్కడ ముత్యాలమ్మ గొంతు ప్రతిధ్వనించింది.

పాకెట్ టేపురికార్డర్లో మిస్ ముత్యాలమ్మ పాట...

చంద్రకాంత్ వింటున్నాడు.

"శాంతాశ్రమ వాటికలో ప్రశాంతకుమారులెందరో

బంగారం పిలుస్తోంది సింగారం తెలుస్తోంది

డబ్బుంటే భాస్కరుడికి బంగారం దొరకదా?

దమ్ముంటే భాస్కరుడికి సింగారం దొరకదా?"

"ఆపండి—" అన్నాడు చంద్రకాంత్—"ఏమిటీ పాట అర్థం?"

"ప్రశాంతకుమార్ అనేవాడు ఓ ఆడపిల్లద్వారా బంగారం పంపాడు. ఆమె శాంతాశ్రమ ప్రాంతాల ఉంది. డబ్బిచ్చి భాస్కర్ ఆ బంగారం తెచ్చుకోవాలి. భాస్కర్ ఎవరో తెలుసా?"

"ఎవరు?"

"పాట విని లేచివెళ్ళాడు. రెడ్ హ్యాండెడ్‌గా పట్టు బడ్డాడు...."

"పాట వినగానే లేవడమెందుకు?"

"పాటలో టైము కూడా సూచించబడుతుంది. ప్రోగ్రాం అవుతూండగానే యెవరైనా తమ పనులు చేసుకోవాలి...."

"అంటే ముత్యాలమ్మ తన పాటలను స్మగ్లింగ్ రాకెట్ కు అనుగుణంగా రాస్తోందన్నమాట...."

"లేదు...." అన్నాడు వెంకన్న—"ఈ పాటల్లో ఆమె ప్రమేయం లేదు. ఎలాంటి పాటలకైనా క్షణాల మీద ట్యూన్ కట్టి పాడేయగలదామె. ఆమె యెలా పాడినా ట్యూన్ అందమైన దనిపించే గొంతున్న దామెకు. ఆమె అప్పటికప్పుడు ట్యూన్ కట్టి పాడే పాటకు—అప్పటికప్పుడు సంగీతం సమకూర్చగల వాద్య బృంద మామెకుంది...."

"అయితే మీ రిన్నాళ్ళెందుకు కాగారు? ఆమె పాటల జాబితా ముందే చూడాల్సింది...." అన్నాడు చంద్రకాంత్.

"ఆమె ముందుగా తయారుచేసుకున్న పాటలలో యే సందేశమూ వుండదు. ఆమె ప్రోగ్రామిస్తూండగా కొందరు శ్రోతలామెకు పాట పంపిస్తారు. అదే స్మగ్లింగ్ రాకెట్ సందేశం. ఆ చీటీ పంపినవాళ్ళు, అది విని లేచిన వాళ్ళు, అసలీ కార్యక్రమ నిర్వాహకులు—ఇలా అన్వే షించుకుంటూపోతే— మొత్తం స్మగ్లింగ్ రాకెట్ బైట పడుతుంది. అయితే యిలా వాళ్ళు చేస్తారని మన మూహించలేము. మనం వాళ్ళు చేసేది తెలుసుకుంటామని వాళ్ళనుకోలేరు. రెండు అద్భుతాలు జరిగాయి—...." అన్నాడు వెంకన్న.

"నాకంతా కలలా వుంది. ఇంకా నేను మీరు చెప్పింది నిజమని నమ్మలేకపోతున్నాను...." అన్నాడు చంద్రకాంత్.

"అందుకే నేను నిన్ను కలుసుకుంటూంట. డీయస్పీ రాఘవరావు, నేను ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా

అన్ని యేర్పాట్లూ చేసుకుంటూ వెడుతూ— నేను నీ ద్వారా ఏదో సాధించాలనుకుంటున్నట్లు నేరస్థులను తప్పుదారిని పట్టించాము అందుకు నువ్వు నీకు తెలియకుండా నే సహకరించావు. ఇకనుంచి శాస్త్రీయ సంగీత ప్రదర్శనకు వెళ్ళినా సరే—రాగా లాక్కు లే కాక— వాళ్ళు పాడే పాటల భావం కూడా వింటూండు—" అన్నాడు వెంకన్న నవ్వుతూ.

చల్లటి నిమ్మరసం తీసుకుని అప్పుడే వచ్చింది చంద్రకాంత్ భార్య.

"చాలెమ్మా! నేను సాధించిన విజయానికి నీ భర్తకు క్రెడిట్ రాబోతోంది. అందుకు ప్రతిఫలంగా నేను కోరే దొక్క టే—నువ్వు, నీ యిడ్లీ, చట్నీ ఫార్ములా కాగితంమీద రాసివ్వాలి—" అన్నాడు వెంకన్న.

మర్నాడు పేపర్లో స్మగ్లింగ్ రాకెట్ కార్యకలాపాలు ఛేదించడంలో ఇన్‌స్పెక్టర్ చంద్రకాంత్ పాత్ర గురించి మొదటి పేజీలో విశేషంగా వచ్చింది. అది చదివి చంద్రకాంత్ కూడా ఆశ్చర్యపడ్డాడు.

— అ యి పో యిం ది :—

# రాక్షస స్త్రీలు

సుంకరి రాంప్రసాద్

జైలు ఆవరణ సందడిగా వుంది.

ఉదయ ఫలహారం కోసం ఖైదీలు బారులుతీర్చి నిలుచున్నారు. లే ఎండలో వారి చేతులలోని సిల్వర్ గిన్నెలు తళ తళ మెరుస్తున్నాయి.

అప్పటికే టిఫిన్ కలెక్టు చేసుకొన్న కొందరు ఖైదీలు చెట్లక్రింద కూర్చొని, కబుర్లు చెప్పుకుంటూ ఫలహారం చేస్తున్నారు.

అది.... మహిళా సేరస్తుల నుంచే జైలు కావడంచేత తెల్లని చీరలలో తళ తళ లాడిపోతున్నారు ఆ ఖైదీలు, తెల్లని జైలు యూనిఫారాలలో ఆ స్త్రీలు ఖైదీల్లా కనిపించటంలేదు.

ఆశ్రమవాటికలోని ముని కన్యల్లా ఉన్నారు.

హరితవనంలో విహరిస్తోన్న శ్వేత విహంగాల్లా ఉన్నారు.

దూరంగా ఒక మూలనున్న బాదంచెట్టు క్రింద

ఒంటరిగా కూర్చుని టిఫిన్ చేస్తున్న సుగుణ, సన్నగా అడుగుల చప్పుడు వినిపించడంతో తల యెత్తి చూసింది.

ఎదురుగా ఒక అందమైన యువతి నిలబడి వుంది. పాతికేళ్ళ వయసుంటుంది ఆమెకు.

తెల్లని చాయ. అందమైన కోలముఖం. తీర్చిదిద్దినట్లున్న కనుముక్కు తీరు. చూడగానే ముద్దుపెట్టుకోవాలనిపించేంతటి ముద్దయిన ఎర్రని పెదవులు. నాజూకయిన శరీరంతో మగాడిని కవ్వించే అందమైన వంపులు.

ఆ జైలు యూనిఫారమే లేకుంటే, ఆమె ఒక ఖైదీ అని యెవరైనా చెప్పినా నమ్మబుద్ధికాదు.

ఆ యువతి చనువుగా సుగుణ ప్రక్క నేలమీద కూర్చొంది. ఆమెవంక ఇబ్బందిగా చూసింది సుగుణ.

సుగుణకు ఒంటరితనమంటే యిష్టం.

ఆ జైలులోనికి వచ్చి కొన్ని నెలలు కావస్తున్నా, యెంతో అవసరం ఉంటే తప్ప ఆమె యెవరితోనూ మాట్లాడలేదు. చివరకు భోజనం చేసేటప్పుడు కూడా అందరికీ దూరంగా, ఒంటరిగా కూర్చుంటుంది.

క్రొత్తలో ఆమె ప్రవర్తన మిగిలిన ఖైదీలకు ఎబ్బెట్టుగా అనిపించినా- కాలక్రమేణా వారుకూడా ఆమెను పట్టించుకోవడం మానేశారు.

ఇప్పుడు....ఎవరో ఒక అపరిచిత యువతి వచ్చి చనువుగా తన ప్రక్కన కూర్చొనేసరికి, ఆమెవంక ఆశ్చర్యంగా చూసింది సుగుణ. ఆ యువతి పలకరింపుగా నవ్వింది.

"నా పేరు సంధ్య." అంది ఆ యువతి సుగుణతో సంభాషణను ప్రారంభిస్తూ.

సుగుణ ఆమెవంక అనాసక్తంగా చూసింది.

"మీ పేరు సుగుణ."

తన పేరు ఆమెకెలా తెలిసిందా అని ఆశ్చర్య పోయింది సుగుణ. సంధ్య పెదవులపై మరోసారి దర హాసం విరిసింది.

నవ్వటం అందరి సొత్తు. కాని, అందంగా నవ్వటం మాత్రం కొందరికే సాధ్యపడుతుంది. అలా అందంగా నవ్వగలిగే కొద్దిమందిలో సంధ్య ఒకతె.

మనుషుల దృష్టిని ఆకట్టుకొనే నవ్వు అది.... అప్రయత్నంగానె ఆమెవంక చూసింది సుగుణ.

"ముప్ఫయి యేళ్ళ వయసులో మీరిలా జైలుపా లవటం, అందునా యావజ్జీవ కారాగార శిక్షను అనుభ వించాల్సి రావటం నిజంగా మీ దురదృష్టం సుగుణా!"

ఆమె మాటలను నిర్లిప్తంగా వింటూ కూర్చుంది సుగుణ. ఆమెకు యిలాంటి సానుభూతి వాక్యాలు వినటం మామూలై పోయింది.

"కాని, మీరు కావాలనుకుంటే మీ దురదృష్టం అదృష్టంగా మారుతుంది.

ఈ జైలు నుండి బయటపడి హాయిగా బ్రతక వచ్చు...." అంది సంధ్య ఆమె కళ్ళలోనికి సూటిగా చూస్తూ.

అంతవరకూ మౌనంగా కూర్చున్న సంధ్య పెదవి విప్పింది.

"ఈ జైలునుండి తప్పించుకొని పారిపోవటమే మీ ఆలోచన అయితే అది సాధ్యపడే విషయం కాదు. ఈ జైలుకు చాలా పటిష్టమైన కాపలా వుంది.

అదీగాక, ఆ రిస్క్‌ను నేను తీసుకోదలచుకోలేదు. తప్పించుకొనే ప్రయత్నంలో పట్టుబడితే........ మళ్ళీ

దానికో క్రొత్త శిక్ష. ఎందుకొచ్చిన రిస్క్?"

"మీరు తప్పించుకోవాల్సిన అవసరంలేదు సుగుణా! న్యాయస్థానమే మిమ్మల్ని నిర్దోషులుగా ఎంచి విడుదల చేస్తుంది."

ఆమె మాటలకు ఉలిక్కిపడింది సుగుణ. ఆశ్చర్యం, ఆశ, ఆనందం ఒకేసారి ముప్పిరిగొనగా ఆమె గొంతు చిన్నగా వణికింది.

"ఎలా?" అంది ఆమె ఆత్రంగా.

"అది నేను చెప్పను సుగుణా! చేసి చూపిస్తాను. మీరు నాతో ఒక అంగీకారానికి వస్తే!"

"ఏమిటి కావాలి మీకు?"

"మీ ఆస్తిలో సగం వాటా. అదీ క్యాష్ రూపంలో.

"సగం వాటానా...." అంది సుగుణ.... నీళ్ళు నములుతూ.

"అవును సుగుణా. నీ ఆస్తి విలువ.... అంటే నీచే హత్యగావింపబడ్డ నీ భర్త ద్వారా సంక్రమించిన ఆస్తి విలువ హీనంగా ఇరవై లక్షలు ఉంటుంది. అందులో సగం, అంటే పదిలక్షలు.

ఐ వాంట్ దోజ్ టెన్ లాక్స్!

పదిలక్షలంటే ఎక్కువ మొత్తమే కావచ్చు. కాని పన్నెండేళ్ళ జైలుజీవిత క్లేశం తప్పిపోవాలంటే, కటకటాల మధ్య కరిగిపోవాల్సిన మీ యవ్వనాన్ని, మీరు ఆనందంగా అనుభవించాలనుకుంటే మీరా మాత్రం మూల్యం చెల్లించక తప్పదు సుగుణా!

జైలునుండి వచ్చాక మీరు అనుభవిద్దామన్నా అప్పుడు పోయిన వయసు మీకు తిరిగిరాదు కదా!

విలువైనది కాలం. దాని విలువ అమూల్యం అలాంటి కాలానికి నే వదులుకుంటున్న మూల్యం కేవలం పదిలక్షలు."

ఆమె మాటలను అయిష్టంగానే తలాడించింది సుగుణ....

'పదిలక్షలు వదులుకోవడం కష్టమే. కాని యావజ్జీవ కారాగార శిక్ష నుండి బయటపడటానికి ఆ మాత్రం ఖర్చు తప్పదేమో!'

అందుకే సుగుణ ఆ ప్రపోజల్ ను అంగీకరించింది.

"దట్స్ గుడ్ సుగుణా!

"అయితే ఇక నా ప్రయత్నంలో ఉంటాను" అంటూ లేచి నిలబడింది సంధ్య.

రెండడుగులు ముందుకు వేసి టక్కున ఆగింది వెను తిరిగి చూసి....

"ఒక్క మాట సుగుణా!

జైలునుండి విడుదలయ్యాక, నన్ను మోసం చేయాలనే ఆలోచన కలలో కూడా రానీయకు.

జైలునుండి తప్పించగల్గుతున్న నేను నిన్ను మళ్ళీ సులువుగా జైలుకు పంపించగలననే మాట పైసల నిజం నీకు గుర్తుంటుందనే ఆశిస్తాను.

గుడ్ లక్! వస్తాను" అంటూ వడి వడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది సంధ్య.

అప్రతిభురాలై ఆమె వంకే చూస్తూ నిలుచుండి పోయింది సుగుణ.

## 2

ప్రియా ఫెర్టిలైజర్ కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్ గోపాలరావు.

డ్యూటీ ఈజ్ డివైన్ అని త్రికరణశుద్ధిగా నమ్మిన మనిషతడు.

ముప్ఫయిఐదేళ్ళ వయసులోనే భార్య పోయినా, మళ్ళీ పెళ్ళి మాట తలపెట్టకుండా పదేళ్ళపాటు ఒంటరిగానే బ్రతికాడు.

అతడి దురదృష్టం అతడికో వారసుడ్ని ఇవ్వకుండానే కన్నుమూసింది అతడి భార్య.

ఒంటరితనాన్ని మరచిపోవడానికి అహోరాత్రాలూ కంపెనీలోనే శ్రమించేవాడతడు. అతడి కృషి, శ్రమా అతడికి మేనేజింగ్ డైరెక్టర్ స్థానాన్ని సంపాదించి పెట్టాయి.

కాని, యిప్పుడు........యాభై అయిదేళ్ళ వయసులో మళ్ళీ అతడిని ఒంటరితనం వెంటాడటం ప్రారంభించింది.

నిజమేనేమో! మనిషికి బాల్యంలోనూ, వృద్ధాప్యంలోనూ తోడు కావాలంటారు.

అతడు తను కలలుగన్న స్థాయికి ఎదిగాడు. డబ్బూ, హోదా అన్నీ సంపాదించాడు. కాని అవి అనుభవించడానికి, అతనితో ఆనందాన్ని పాలుపంచుకోవడానికి నా అనేవారు ఎవరూ లేరు.

సాయంత్రం ఒంటరిగా లాన్‌లో కూర్చుని టీ త్రాగుతూ....తన కిష్టమయిన శ్రీశ్రీ గీతాన్ని టేప్ రికార్డర్‌లో వింటున్నప్పుడు....

"చీకటి ముసిరిన ఏకాంతంలో
నేనున్నానని నిండుగా పలికే
తోడొకరుండిన అదే భాగ్యమూ
అదే స్వర్గమూ!

మనసున మనసై
బ్రతుకున బ్రతుకై ........ ॥తోడొక॥

ఆ పాటలోని భావం సూటిగా అతడి గుండెలకు తాకేది. తను ఒంటరి నన్న భావం అతడిని కదిలించి వేసేది.

'నిజమే! జీవితపు రెండవ అంకంలోనికి అడుగు పెడుతున్న ఈ దశలో తనకూ ఒక తోడు కావాలి!' అనుకున్నాడతడు దీర్ఘంగా నిట్టూరుస్తూ.

అలాంటి దశలో అతడి జీవితంలోనికి ప్రవేశించింది సుగుణ. షీ ఈజ్ ఎ ఫాస్టు గర్ల్!

సుగుణ క్రొత్తగా చేరిన అతడి పర్సనల్ సెక్రటరీ. డ్యూటీలో చేరిన కొద్ది కాలానికే, ఒక్క ఆఫీసు పనులే కాక, అతడి స్వంత పనులను కూడా చక్కదిద్దేటంత సాన్నిహిత్యాన్ని సంపాదించింది ఆమె.

అతడిప్పుడు రహస్యంత ఆప్యాయత కోసం ఆత్రంగా యెదురుచూస్తోన్నాడు. అది సుగుణలో లభించింది అతడికి.

"అదే ప్రేమంటే" అంది ఆమె.

"కాబోలు" ననుకున్నాడు అతడు.

"ప్రేమకు వయసుతో సంబంధం లేదు. పడుచు క్లియోపాత్రా, ముసలి సీజర్‌ను ప్రేమించిందంటే.... కారణం.... అతడిలోని హీరోయిజాన్ని చూసి కాదూ!" అంది ఆమె. అతడి బుగ్గలను పెదవులతో రాస్తూ.

"నిజమే సుమా!" అనుకున్నాడతడు మైకంగా.

అందమయిన ఇరవై యేళ్ళ అమ్మాయి "నీవే నా హీరోవి" అంటే కదలని మగాడుంటాడా? అందులో ఏభయి యేళ్ళు దగ్గరపడుతున్న వయస్సులో.

వారి ప్రేమ పెళ్ళిగా మారింది.

ఒక్క తాళిబొట్టుతో ...అతడి ఆజ్ఞలను పాటించే సెక్రటరీ, అతడిని ఆజ్ఞాపించ గలిగే భార్య అయి పోయింది.

దినాలు క్షణాలుగా గడిచిపోయాయి. ఇప్పుడు గోపాలరావుకు జీవితం యెంతో తృప్తిగా వుంది.

కాని.... అన్నీ మనిషి అనుకున్నట్లుగా జరిగితే అది జీవితం ఎందుకు అవుతుంది?

ఓ రోజు రాత్రి ...కంపెనీ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ మీటింగ్ ఉంది, ఆలస్యంగా వస్తానని భార్యకు చెప్పి, కంపెనీకి వెళ్ళాడు అతడు.

కాని, అనుకోని పరిస్థితులవల్ల, మీటింగ్ కాన్సిల్ కావటంతో వెంటనే యింటికి వచ్చేశాడు. ఆత్రంగా తమ బెడ్‌రూమ్‌ను సమీపించబోయిన అతడు....లోపల నుండి యేవో మగ గొంతు వినిపించేసరికి టక్కున ఆగి పోయాడు.

కీ హోల్ నుండి లోపలకు తొంగి చూశాడు.

అంతే!

లోపలి దృశ్యం విద్యుద్ఘాతంలా అతడి మనసును తాకింది.

తమ బెడ్ పై, తన భార్య ఎవరో పరాయిపురుషునితో నగ్నంగా....

పట్టలేని కోపంలో అతడు తలుపులను విసురుగా తన్నాడు. "సుగుణా!" అంటూ గావుకేక వేశాడు.

ఆ కేకతో లోపలివారు ఉలిక్కిపడ్డారు. ఆ యువకుడు గబ గబా బట్టలు వేసుకొని, తలుపు తెరిచి, అడ్డంగా వున్న గోపాలరావును ప్రక్కకు తోసేసి, పరుగెత్తు

కుంటూ పారిపోయాడు.

సుగుణ మాత్రం మంచంమీద అలాగే నగ్నంగానే పడుకుంది. ఆమె ముఖంలో భయం కూడా లేదు.

"ఎవడు వాడు?" అన్నాడు గోపాలరావు కళ్ళతో నిప్పులను కురిపిస్తూ.

"అతడా....నా బాయ్‌ఫ్రెండ్ ఆంటోనీ" అంది ఆమె నవ్వుతూ.

"యూ బిచ్! ఇంకా నవ్వుతున్నావా? సిగ్గులేదూ!" అన్నాడతడు ఆవేశంగా.

ఆమె మరోసారి సన్నగా నవ్వింది.

"నేను మన పెళ్ళికి ముందే చెప్పాను. నీవు సీజర్, నేను క్లియోపాత్రా అని. మరి మన మధ్యకు ఏంటోనీ వస్తే కోప్పడతారేం?

సీజర్, ఏంటోనీల నిద్దరినీ క్లియోపాత ప్రేమించలేదూ? నేనూ అంతే! ఐ వాంట్ యూ బోత్!"

ఆమె ఒక్కొక్క మాట తన గుండెను తూట్లు పొడుస్తోంటే పట్టలేని కోపంతో అతడు చాచి ఆమె చెంపపై కొట్టాడు.

ఆమె ముఖం చూడలేక, గిరుక్కున వెనుతిరిగి ఆ గదిలో నుండి బయటకు వెళ్ళిపోయాడు.

'మంచి మనిషికో మాట. మంచి గొడ్డుకో దెబ్బ' అన్నారు. కాని ఆమె ఆ రెండింటి కన్నా నీచమైంది.

ఆస్తికోసం గోపాలరావును వలలో వేసుకొని పెళ్ళాడింది.

"కాని యిప్పుడు తన గుట్టు బయటపడింది కాబట్టి, తన భర్త తనకు విడాకులిస్తే....మళ్ళీ తన ప్లాట్‌ఫారం మీద పడాలి. అంతకు ముందే మేల్కొవాలి" అనుకుంది

ఆమె చెంపను తడుముకుంటూ.

తన ప్రియుడికి ఆంటోనీకి వెంటనే కబురు పంపించింది ఆమె. ఆ రోజు రాత్రి చాలాసేపు తర్జనభర్జనలు పడ్డాక వారు ఒక నిర్ణయానికి వచ్చారు.

ఆంటోనీకి మాత్రం లోలోపల భయంగా వుంది. ఏవో చిన్న చిన్న నేరాలు మాత్రమే చేసేవాడతడు.

కాని, ఒక్కసారిగా 'హత్య' అనేసరికి అతడికి కాళ్ళూ, చేతులూ ఆడటంలేదు.

ఎంతో ధైర్యంగా, నిబ్బరంగా ఉన్నది సుగుణే! నిజానికి మగవారికన్నా ఆడవారిలోనే తెగింపు యెక్కువ ఉంటుంది. కాని, సమాజపు కట్టుబాట్లతో, ఆచారాల పేరుతో స్త్రీ బంధింపబడి....ఆమెశక్తి నిగూఢమౌతూంది. ఒక్కసారి ఆ కట్టుబాట్లను తెంచుకున్న స్త్రీ ఏమైనా చేయగల్గుతుంది. అందులో తప్పుచేసి పట్టుబడ్డ జారిణి ఎంతకయినా తెగిసుంది.

నిద్రపోతున్న గోపాలరావు గదిలోకి పిల్లుల్లా ప్రవేశించారు వారిద్దరూ. తలగడను అతని ముఖానికి అదిమి పెట్టి బలంగా నొక్కిపట్టాడు ఆంటోనీ. భర్త కాళ్ళూ చేతులనూ కదలకుండా పట్టుకుంది సుగుణ.

కేవలం కొద్ది నిముషాల పోరాటం తరువాత శాశ్వతంగా నిద్రపోయాడు గోపాలరావు.

పెరడులో గొయ్యి తీసి, అతడి శవాన్ని పాతిపెట్టారు వారు. రాయితో అతడి ముఖాన్ని పూర్తిగా చితుకగొట్టారు. ఇప్పుడు ఆ శవాన్ని యెవరయినా చూసినా దానిని పోల్చుకోలేరు.

తన భర్త యెక్కడికో క్యాంపు వెళ్ళారని లోకాన్ని నమ్మించడానికి ప్రయత్నించింది ఆమె.

అయితే, సుగుణ తప్పటడుగు వేసింది అక్కడే. గోపాలరావు ఒక అనామకుడు కాడు. ఒక కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్.

పనంటే ప్రాణం యిచ్చే అలాంటి వ్యక్తి, ఎవ్వరికీ చెప్పకుండా అర్ధాంతరంగా యెక్కడికో వెళ్ళాడంటే యెవరు నమ్మినా, అతడు పనిచేస్తున్న కంపెనీ వారు నమ్మలేదు.

రెండురోజులు వెయిటు చేశారు వారు. కాని, గోపాలరావు దగ్గర నుండి కనీసం ఫోన్ అయినా రాకపోవడంతో, వారు పోలీస్ కంప్లైంట్ యిచ్చారు.

పోలీసులు రంగంలోకి దిగారు.

ఇన్స్పెక్టర్ జయంత్ పరిశోధన ప్రారంభించాడు. సుగుణను కలుసుకున్నాడతడు.

మూడు రోజులుగా భర్త కనిపించడం లేదన్న ఆదుర్దా కాని, కలవరం కాని మచ్చుకయినా ఆమెలో కనిపించలేదు అతడికి.

సుగుణను యెంత ప్రశ్నించినా అతనికి కావాల్సిన సమాచారం ఏమీ లభించలేదు.

'తన భర్త ఎక్కడకు వెళ్ళిందీ, ఏమయిందీ తెలియక తనే తల్లడిల్లిపోతున్నా' నంది ఆమె దీనంగా.

ఎందుకో ఆమె దుఃఖం అసహజంగా తోచింది అతడికి. ఇట్లో పనివారిని ఒక్కొక్కరినీ పిలిచి ఎంక్వయిరీ ప్రారంభించా డతడు.

గూర్ఖాతో సహా అందరు పనివారూ తమ కేమీ తెలియదని చెప్పారు.

డబ్బు పాపిష్టిద టారు. సుగుణ యెరచూపిన డబ్బు ఆ పనిమనుషుల నోళ్ళు మూయించింది. అతడి కేసు

విచిత్రంగా తోచింది.

'తాళికట్టిన భార్యకు తెలియును. అహర్నిశలూ కాపలా ఉండే గూర్ఖాకూ తెలియును. రాత్రీ, పగలూ ఇట్లోనే మసిలే పనివారికీ తెలియును.

కాని....ఆ యింటి యజమాని మాత్రం ఉన్నట్టుండి అదృశ్యమయ్యాడు. చిత్రం కామా!'

అతడు ఆలోచిస్తోన్నాడు.

'ఇందులో ఎక్కడో ఏదో మర్మం ఉంది. కాని, నిజం దాయబడుతోంది.'

అతడు జీపును యెక్కి వెనుతిరిగాడు. సరిగ్గా అతడి జీపు మెయిన్ గేటు దాటే సమయంలో అతడిని కలుసుకున్నాడో వ్యక్తి.

అతడు....సీనయ్య.

గోపాలరావు యింట్లో పనిచేసే ముసలి నౌకరు. యజమాని ఉప్పు తిని బ్రతుకుతున్నాననే విశ్వాసం అతడిలో యేమూలో కాస్త యెక్కువే వుంది. అందుకే అతడు సుగుణ చూపిన డబ్బు ఎరకు చిక్కి, పెదవి విప్పకుండా ఉండలేకపోయాడు.

"సుగుణకు ఎవరో యువకునితో అక్రమ సంబంధం ఉందని, అతడు యజమాని లేని సమయంలో తరచుగా ఆ యింటికి వస్తూండేవాడని, ఆ విషయంపైనే ఆ రాత్రి భార్యాభర్తల మధ్య పోట్లాట జరిగిందని" చెప్పాడు సీనయ్య

అయితే...ఆ రాత్రి తరువాత ఏం జరిగిందో మాత్రం అతడూ చెప్పలేకపోయాడు.

సీనయ్య చెప్పిన మాటలు ఇన్‌స్పెక్టర్‌లో క్రొత్త ఆలోచనలను రేపాయి.

'పరాయి మగవానితో భార్యకున్న అక్రమ సంబం ధాన్ని కళ్ళారా చూశాడు గోపాలరావు.

ఆ షాక్‌ను తట్టుకోలేక, భార్యమీద అసహ్యంతో, జీవితంమీద విరక్తి కలిగి దేశాలు పట్టిపోయాడా?

లేకుంటే....

తన రహస్యం బయటపడిందన్న ఆవేశంలో తన ప్రియుని సహకారంతో భర్తను....సుగుణ హత్య చేసి ఉంటుందా?

అదే నిజమయితే మరి శవం?'

పోలీసు ఆలోచనలెప్పుడూ హత్యలూ, దొంగతనాల మీదే ఉంటాయి. అదృష్టవశాత్తూ ఇన్‌స్పెక్టర్ జయంత్ ఆలోచనలు ఈ కేసుకు సంబంధించినంత వరకూ సరైన ట్రాక్‌లో నడిచాయి.

అతడు వెంటనే పోలీసుకుక్కలను తెప్పించాడు. గోపాలరావు గదిలోని బట్టలను వాటికి వాసన చూపించి వదిలారు. అవి భవనం, తోట అంతా కలియ తిరిగి, చివరకు తోటలో ఒకచోట ఆగిపోయాయి.

ముక్కుపుటాలను ఎగబీలుస్తూ, కాలి గోళ్ళతో మట్టిని గోకసాగాయి. ఇన్‌స్పెక్టర్ వచ్చి ఆ స్థలాన్ని చూశాడు.

మిగిలిన నేలకూ, ఆ స్థలానికీ మధ్య ఏదో తేడా కని పించింది అతడికి. అక్కడ మట్టి కాస్త పచ్చిగా, తడిగా గోయి తీసి, కప్పి పెట్టినట్లు అగుపిస్తుంది.

ఇన్‌స్పెక్టర్ ఆజ్ఞతో ఆ స్థలాన్ని త్రవ్వటం ప్రారం భించారు పోలీసులు. వారు ఎంతోసేపు తవ్వాల్సిన అవసరం లేక పోయింది.

నాలుగడుగుల లోతులో....

వెల్లకిలా పడున్న శవం కనిపించింది వారికి. శవం ముఖం అంతా చితికిపోయి, ఆ పైన చెదలు కొరికి, తిని వేయటంతో.... అది యెవరి శవమో పోల్చలేకపోయారు ఎవరూ.

కాని, ఒడ్డూ, పొడుగూ, శవం ఆకారాన్ని బట్టి, అది గోపాలరావు శవమే అని నిర్ధారించారు పోలీసులు.

శవాన్ని చెదలు కొరికి తినేయటంవలన వ్రేలిముద్రలు కూడా లభించలేదు వారికి. అక్కడ.... ఆ గోతి దగ్గర ఇద్దరు వ్యక్తుల అడుగుజాడలు మాత్రం లభించాయి.

అందులో ఒక జత కాలిముద్రలు సుగుణవి. స్టోర్ రూమ్‌లో పార, గునపం కనిపించాయి. కాని అవి శుభ్రంగా కడుగబడి వున్నాయి. కడగబడిన ఆ రెండింటి మీదా కొన్ని వ్రేలిముద్రలు లభించాయి.

ఆ వ్రేలిముద్రలు సుగుణవి.

భర్తను తన ప్రియుని సహాయంతో చంపిందన్న అభియోగంతో సుగుణపై చార్జిషీట్ ఫైలు చేయబడింది.

కోర్టులో ...

'తనకేమీ తెలియదనీ, తాను నిర్దోషిననీ' చెప్పింది సుగుణ ఏడుస్తూ!

అయితే గోతి దగ్గర ఆమె అడుగుల గుర్తులూ, గునపం పారపై ఆమె వ్రేలిముద్రలు ఎలా ఏర్పడ్డాయో ఆమె కన్విన్సింగ్‌గా చెప్పలేక పోయింది. షీహేడ్ నో ఆన్సర్స్.

ఆ శవం గోపాలరావుదే అని పోలీసులు నిర్ధారించటం చేత, గోపాలరావు మరణంవలన లాభం పొందుతున్న ఏకైక వ్యక్తి సుగుణ కావడంచేత—

ఆ స్త్రీకోసం భర్తను చంపిందన్న పోలీసుల అభి

యోగాన్ని కోర్టు విశ్వసించింది.

అన్నింటినీ మించి.... హత్య చేయ బడ్డ రోజు రాత్రి.... గోపాలరావు జీవితంలో చివరిసారిగా డైరీలో వ్రాసు కున్న వాక్యాలు వ్యాయస్థానాన్ని కన్విన్స్ చేశాయి.

పీపుల్స్ ఎగ్జిబిట్ 'డి' గా కోర్టువారి ముందు ఉంచ బడ్డ ఆ డైరీలో....

'తన భార్య సుగుణను, పరాయి పురుషునితో నగ్నంగా తమ పడక గదిలోనే చూసిన క్షణంలో తను ఎంత క్షోభను అనుభవించినదీ వ్రాసాడు గోపాలరావు.

"ఆ క్షణంలో వారిద్దరినీ అక్కడికక్కడే నరికి పోగులు పెడదామన్న ఆవేశం వచ్చింది నాకు."

ఇవి గోపాలరావు డైరీలో వ్రాసుకున్న చివరి మాటలు.

సుగుణే భర్తను చంపిందన్న ఆరోపణకు ప్రత్యక్ష సాక్ష్యం లేకపోయినప్పటికీ, గోపాలరావును చంపే అవసరం ఆమెకు తప్ప యింకెవరికీ లేకపోవటం చేత, మిగిలిన సాక్ష్యాలు ఆమెకు ప్రతికూలంగా వుండటంచేత న్యాయస్థానం ఆమెను ముద్దాయిగా ఎంచి, యావజ్జీవ కారాగార శిక్షను విధించింది.

అయితే.... ఈ హత్యలో సుగుణతోపాటు పాలు పంచుకున్న రెండవ వ్యక్తి ఆమె ప్రియుడు ఆంటోనీ మాత్రం అజ్ఞాతంలోనే ఉండిపోయాడు.

# 3

"ఏమ్మా? నీ కంటికి నేను వెధవలా కన్పిస్తు న్నానా?" కోపంగా అన్నాడు లాయర్ గణపతిరావు.

"అదేమిటండీ అలా అంటారు?"

ఆశ్చర్యపోతూ అంది అతడి కెదురుగా కూర్చున్న

ఛెయిర్‌లో ఒద్దికగా కూర్చున్న యువతి.

“కాకుంటే ఏమిటట!

అది కేసా? దానిని నేను టేకప్ చేయాలా? కేసుల్లేని చెట్టుక్రింద ప్లీడరయినా ఆ కేసును టేకప్ చేస్తాడా!

అందులో ఒక కోర్టులో జడ్జిమెంట్ యిచ్చేశాక, ఓప్రక్క ముద్దాయి శిక్షను కూడా అనుభవించేస్తున్న ఈ కేసును.

మర్డర్ కేసంటే మాటలనుకున్నారా?

అయినా ఈ కేసులో యేముందని వాదించడానికి నా బొంద!” చిర్రుబుర్రులాడాడు గణపతిరావు.

ఆమె చిన్నగా నవ్వింది.

“కేసు కష్టమైనదే లాయర్ గారూ కాని, లక్ష రూపాయలంటే......అది తక్కువ మొత్తమేమీ కాదుగా!”

“అచ్చా!!” అతడు ఆశ్చర్యంగా నోరు వెళ్లబెట్టాడు.

‘మై గుడ్ నెస్! లక్ష. ఒక్క కేసుకు ఆమె ఆఫర్ చేస్తున్న ఫీజు ఒన్ లాక్!’

అతడు ఆశ్చర్యంలోనుండి ఇంకా తేరుకోలేదు. తాను వింటున్నది కలో, నిజమో అర్థంకాలేదు అతడికి.

ఆమె హాండ్ బ్యాగ్ తెరచి ఒక నోట్లకట్టను పైకి తీసి టేబిల్ మీద పెట్టింది.

“పదివేలు. మీ అడ్వాన్స్” అంది ఆమె మరోసారి చిన్నగా నవ్వుతూ.

తనతో ఎవరైనా ప్రాక్టికల్ జోక్ చేస్తున్నారన్న అనుమానం యేమైనా మిగిలివుంటే అదంతా ఆ నోట్లకట్టను చూడగానే అతనిలో నుండి పటాపంచలై పారిపోయింది.

ఆ నోట్లకట్టను అలాగా అందుకొని డ్రాయర్‌లో పెట్టాడు.

"ఫీజా దేముంది లెండి. మీరు యిస్తారు. నేను తీసుకుంటాను. కాని, కేసులో మనకేమిటి ఛాన్సెస్ వున్నాయా అని ఆలోచిస్తున్నాను" అన్నాడతడు నీళ్ళు నములుతూ.

"కేసు రజలుపై మీకు అనుమానం అక్కర్లేదు లాయర్ గారూ! మనం తప్పక గెలుస్తాం."

తనపై, తన శక్తిసామర్థ్యాలపై ఆమెకున్న నమ్మకానికి అతడు గర్వంగా ఫీలయ్యాడు.

"నిజమేనమ్మా. డిఫెన్స్ లాయర్ గణపతిరావు కేసును చేపట్టాడంటే, దానిని గెలిచి తీరతాడు.

కాని.... ఈ కేసులో యెక్కడా డిఫెన్స్‌కు తావున్నట్లు తోచడంలేదు.

కోడిగ్రుడ్డుకు ఈకలు పీకాలంటే...." నవ్వుతూ అన్నాడతడు.

"కోడిగ్రుడ్డుకు ఈకలను మొలిపించే బాధ్యత నాది లాయర్ గారూ!" అంది ఆమె నవ్వుతూ.

ఆమె మాటలకు అతడి పెదవుల మీది నవ్వు మాయమయ్యింది. అతడి ముఖం మ్లానమయ్యింది.

'అంటే..ఆమె మొలిపించిన ఈకలను తాను కోర్టులో పీకాలా!'

ఉలికి వస్తున్న ఆవేశాన్ని యెలాగో అపుకున్నాడతడు.

'నిజమే! కోడిగ్రుడ్డుకు ఈకలు పీకడానికి లక్షరూపాయలు ఫీజునిచ్చే క్లయింట్‌తో దురుసుగా మాట్లాడం తెలివి తెలిసిన లాయర్ చేయాల్సిన పనికాదు.'

అతడికి ఒక్క విషయం స్పష్టంగా అర్థమవుతూంది.

ఆమెకు తనపై విశ్వాసం కన్న, ఆమెపై ఆమెకు విశ్వాసం ఎక్కువని.

ఆమె ఒక ఫైలును అతడికి అందించింది.

"ఇందులో ఆ కేసుకు సంబంధించిన పూర్తి వివరాలు ఐమిన్ కోర్టు హియరింగ్స్, ప్రాసిక్యూషన్ వారి కథనం....కోర్టు యిచ్చిన తీర్పు....అన్నీ డీటెయిల్డుగా టైపు చేయబడి వున్నాయి.

ఈ రోజు మీరు వాటిని బాగా స్టడీ చేయండి. రేపు మళ్ళీ మిమ్మల్ని ఇదే వేళకు కలుసుకుంటాను నేను."

మంత్ర ముగ్ధునిలా ఆమె మాటలను వింటూ ఆ ఫైలును అందుకున్నాడు గణపతిరావు.

ఆ యువతి....సంధ్య.

## 4

ట్రింగ్....ట్రింగ్....

కాలింగ్ బజరు మ్రోగింది.

అంతవరకూ అసహనంగా గదిలో పచార్లు చేస్తున్న నికల్సన్ ఆత్రంగా గది తలుపులు తెరిచాడు.

ఎదురుగా నిలబడ్డ యువతిని చూడగానే అతడి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"కాయా? పండా?" అడిగాడతడు ఆత్రంగా.

ఆమె తీయగా నవ్వింది.

'నే వెళ్ళాక కాయ యెలా అవుతుంది?' అన్నట్లుంది ఆ నవ్వు.

అతడామె వంక గర్వంగా చూశాడు.

నాలుగు కళ్ళు రెండయిన వేళ....

ఛటాలున ఆమెను కౌగిలిలోనికి లాక్కుని గాఢంగా ఆమెను చుంబించాడతడు.

తాకింది పెదవిపైనా కందినవి మాత్రం చెక్కిళ్ళు. కన్నులు అరమోడ్పులయిన వేళ, ఒక తీయని అనుభూతి వింతైన పులకరింతై....ఆమె మేను సన్నగా కంపించింది.

రెండు నిముషాల తరువాత వారు కౌగిలినుండి విడివడ్డారు.

"థాంక్యూ" అన్నాడతడు నవ్వుతూ.

"థాంక్స్....ముద్దుకా? సుద్దుకా?" అంది ఆమె చిలిపిగా.

"రెండింటికీనూ" అన్నాడతడు ఆమె బుగ్గపై చిటిక వేస్తూ.

ఆమె వయ్యారంగా నడుచుకుంటూ వెళ్ళి బెడ్ మీద వెల్లకిలా పడుకుంది. తలుపుకు గడియ పెట్టి వచ్చి, అతడు కూడా ఆమె ప్రక్కనే మేను వాల్చాడు.

"ఏమిటో...., చూస్తూ, చూస్తూ లక్షరూపాయలను అప్పనంగా ఆ లాయర్ కు అప్పజెప్పటం నాకేం నచ్చలేదు బాబూ!"

అతడి గుండెలపై తలవాల్చి గోముగా అంది ఆమె. అతడు చిరునవ్వు చిందించాడు.

"నిజం నికల్సన్!

కష్టపడి ఇంత పకడ్బందీగా ప్లాన్ వేస్తూంది మనం. కోర్టులో అతడేమి వాదించాలో 'క్లూలు' యివ్వబోతోంది మనం.

అతడన్నట్లు....ఆఫ్ట్రాల్ కోర్టులో నిలబడి కోడిగుడ్డుకు ఈకలు పీకడానికి....లక్షరూపాయలా....నో.... ఇట్స్ టూ మచ్!"

చిన్నపిల్లలా ఉక్రోషంగా అంటున్న ఆమె వంక చూసి మరోసారి చిన్నగా నవ్వాడతడు.

"తప్పదు డార్లింగ్!

పది లక్షల కోసం ఒక లక్షను స్టేక్ చేయాలి. జస్టు ఫర్ సేఫ్టీ.

నిజమే! నీవన్నట్లు మనం యిచ్చిన పాఠాన్ని, కోర్టు హాల్లో అప్పజెప్పేందుకు....ప్రముఖ డిఫెన్సు లాయర్ గణపతిరావు అవసరం లేదు. ఏ చెట్టుకింద ప్లీడరయినా చాలు. సరిపోతాడు.

కాని.... రేపు మనం కోర్టు హాల్లో ప్రవేశపెట్టబోయే సాక్ష్యాధారాలను గమనించిన వారెవరైనా, ఒక అనామక లాయర్ ఇంత అద్భుతమైన పరిశోధన, వాదన ఎలా చేయగలిగాడని ఆశ్చర్యపోతారు.

ఆశ్చర్యం అనుమానానికి, అనుమానం పరిశోధనకు దారితీస్తే.... తెర వెనుకనున్న మనం బయట పడతాం. అంతటితో ఇంతటి మన శ్రమా బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది.

మన ప్లాను సర్వనాశనం అవుతుంది.

అదే.... ఈ కేసును గణపతిరావు వాదిస్తే....

బెమ్మిని తిమ్మిని చేయగల అంతటి ప్రముఖ డిఫెన్స్ లాయర్ మీద యెవరికీ అనుమానం రాదు. తెర వెనుక యెవరో ఉండి అతడికి సలహాలిస్తున్నారన్న ఆలోచన కూడా యెవరికీ రాదు. ఇదంతా అతడి ప్రతిభే అనుకుంటారు. అదే మనకు కావల్సింది.

అప్పుడే మనం ఆడబోయే నాటకం విజయవంత మౌతుంది.

అంతటి గణపతిరావు మనం చెప్పినట్లుగా ఆడాలంటే, మనం ఒక లక్షను వదలుకోక తప్పదు."

అతడి మాటలను శ్రద్ధగా వింది ఆమె. అతడివంక ప్రశంసాపూర్వకంగా చూసిందామె.

## 5

కోర్టు హాలు కిట కిట లాడుతోంది.

బోనులో దీనంగా నిలబడి ఉంది సుగుణ. ప్రేక్షకులు ఆమెవంక గుచ్చి గుచ్చి చూస్తోన్నారు. వారి చూపులను భరిస్తూ నిలబడటం ఆమెకు కష్టంగా ఉంది.

కుర్చీలో నుండి మెల్లగా పైకి లేచాడు ప్రముఖ డిఫెన్స్ లాయర్ గణపతిరావు.

జడ్జివంక తిరిగి, చిన్నగా తల వంచి, అభివాదం చేసి, ఒక్కసారి చుట్టూ కలయజూసి, తరువాత చిన్నగా గొంతును సవరించుకున్నాడు.

“హానరబుల్ జస్టిస్ అండ్ జంటిల్ మెన్ ఆఫ్ ద జ్యూరీ....!

ఈ రోజు మీ అందరి సమక్షంలో ఈ బోనులో ముద్దాయిగా నిలుచుని ఉన్న నా క్లయింట్ శ్రీమతి సుగుణ నిర్దోషి.

ఆ సత్యాన్ని సహేతుకంగా, సాక్ష్యాధారాలతో సహా నేను నిరూపించగలను.

ఐ ప్రే ద కోర్టు టు అక్సెప్ట్ ద పిటీషన్ ఆఫ్ మై క్లయింట్ ఫర్ ద రీ ఆర్గ్యుమెంట్ ఇన్ దిస్ కేస్.”

అంతవరకూ మౌనంగా కూర్చున్న పబ్లిక్ ప్రాసిక్యూటర్ రామానుజం చటుక్కున లేచి నిలబడ్డాడు.

“ఐ అబ్జక్ట్ ఇట్ యువర్ ఆనర్! పూర్తి సాక్ష్యాధారాలతో ఈ ముద్దాయి దోషి అని నిరూపించబడ్డాక, ఒక న్యాయస్థానం ఆమె ‘దోషి’ అని నిర్ధారిస్తూ తీర్పును కూడా యిచ్చేశాక, ఓ ప్రక్క సదరు ముద్దాయి శిక్షను

కూడా అనుభవిస్తున్న ఈ సమయంలో....

మళ్ళీ ఆ కేసును తిరగతోడటంవలన అమూల్యమైన కోర్టువారి కాలాన్ని వృధాపర్చడం తప్ప, వేరొక ఫలిత మేమీ ఉండదని కోర్టువారికి మనవి చేస్తున్నాను."

"కావచ్చు యువరానర్!

మై లెర్నడ్ ఫ్రెండ్ చెప్పినట్లు కొంతకాలం వృధా అయితే కావచ్చు.

కాని జీవితం కాలంకన్నా విలువైనది కదా! వేయి మంది దోషులు శిక్షను తప్పించుకున్నా, ఒక్క నిర్దోషి మాత్రం శిక్షింపబడకూడదని న్యాయశాస్త్ర ఆదర్శం ప్రకారం....

నా క్లయింట్ కు తాను నిర్దోషినని నిరూపించుకో డానికి మరో అవకాశాన్ని కల్పించాలి" అన్నాడు గణ పతిరావు.

"అబజక్షన్ ఓవర్ రూల్డు" అన్నారు జడ్జిగారు.

"యువరానర్!

నా క్లయింట్ శ్రీమతి సుగుణపై మోపబడ్డ మొదటి అభియోగం....'ఆమె ఈ హత్యను ఆస్తి కోసం చేసిందని.'

ఈ అభియోగం నిరాధారమైనదని ఋజువు చేసేందుకు సాక్ష్యులను ప్రవేశపెట్టడానికి కోర్టువారిని అనుమతి కోరుతున్నాను."

"రిక్వెస్టు గ్రాంటెడ్. ప్రొసీడ్" అన్నారు జడ్జి గారు.

"నా మొదటి సాక్షి....లాయర్ ముకుందం."

"లాయర్ ముకుందం...లాయర్ ముకుందం!" రాగ యుక్తంగా అరిచాడు కోర్టు జవాను.

నలభై యేళ్ళ వయసున్న మధ్యవయస్కుడు మెల్లగా నడుచుకుంటూ వచ్చి బోనులో ప్రవేశించాడు.

ఒక్కసారి అతనివంక పాలోచనగా చూసి, ప్రశ్నలను అడగటం ప్రారంభించాడు గణపతిరావు.

"మీ పేరు?"

"ముకుందం.... క."

"వృత్తి....?"

"మీ వృత్తే! లాయర్ని" చిన్నగా నవ్వుతూ అన్నాడతడు.

"ప్రియా ఫెర్టిలైజర్స్ మేనేజింగ్ డైరెక్టర్ గోపాలరావుగారు మీకు తెలుసా?"

"తెలుసు. నేను వారి ఫామిలీ లాయర్ని."

"గోపాలరావుగారి తదనంతరం వారి ఆస్తి ఎవరికి చెందుతుంది"

"వారి భార్య సుగుణగారికి"

"అలా........వీలునామా యేమయినా వ్రాశారా వారు?"

"ఆఁ.... వారి విల్లును నేనే రిజిష్టర్ చేయించాను."

"ఆ విల్లును గురించి సుగుణగారికి చెప్పారా?"

"ఆఁ.... చెప్పాను."

"ఎప్పుడు?"

"ఆమె జైల్లో ఉండగా కలుసుకొని చెప్పాను."

"అంటే, ఆమె భర్త మరణం తరువాతే, మీరు ఆ వీలునామా గురించి తెలియజేశారంటారు."

"అవును."

"దట్సాల్ యువరానర్!" అంటూ కూర్చున్నాడు గణపతిరావు.

ప్రాసిక్యూటర్ రామానుజానికి, గణపతిరావు ఎత్తే మిటో స్పష్టంగా తెలుస్తూంది.

"ఎనీ కొశ్చెన్స్ ఫ్రం ప్రాసిక్యూషన్?" జడ్జిగారు ప్రశ్నించారు.

రామానుజం లేచి నిలబడ్డాడు. సూటిగా బోనులో నిలబడ్డ ముకుందాన్ని చూశాడు.

"వెల్ మిస్టర్ ముకుందం.

మీరు విల్లు గురించి శ్రీమతి సుగుణతో యిప్పుడే.... అంటే గోపాలరావుగారి హత్య తరువాతే చెప్పివుండవచ్చు.

కాని, అంత మాత్రాన హత్యకు ముందు ముద్దాయికి ఆ విల్లు గురించి తెలియదని ఎలా నిర్ధారించగలరు?

ఒకవేళ, ఆమె భర్త తను వ్రాసిన విల్లు గురించి ఆమెకు చెప్పివుండవచ్చు కదా!"

"అబ్జక్షన్ యువరానర్" అంటూ గణపతిరావు లేచి నిలబడ్డాడు.

"ప్రాసిక్యూటర్ గారు తమ అభిప్రాయాన్ని బలవంతంగా సాక్షిపై రుద్దాలని ప్రయత్నిస్తున్నారు."

"అబ్జక్షన్ సస్టెయిండ్" అన్నారు జడ్జిగారు.

"పోనీ మరోకలా అడుగుతాను" అన్నాడు రామానుజం.

"ఆ విల్లును గూర్చి తన భార్యతో గాని, లేక యింకెవరితో గాని గోపాలరావుగారు చెప్పినట్లుగా మీకు తెలుసా?"

"లేదు!

ఆ విల్లును గురించి కొన్నాళ్ళ పాటు యెవరికీ తెలియనీయవద్దని గోపాలరావుగారే స్వయంగా

చెప్పారు.

అలా నాతో అన్న వ్యక్తి, తాను ఇంకెవరితోనైనా చెప్పివుంటారంటే నేను నమ్మను."

ముకుందం మాటలకు, రామానుజం ముఖం మ్లానమయింది.

తను చెప్పిన చిలకపలుకలను, చక్కగా కోర్టులో అప్పజెప్పిన ముకుందంవంక ముచ్చటగా చూశాడు లాయర్ గణపతిరావు.

"నో మోర్ యువరానర్" అంటూ విసుగ్గా కుర్చీలో కూలబడ్డాడు రామానుజం.

"మై నెక్స్ట్ విట్నెస్ గుమస్తా గుర్నాథం" అన్నాడు గణపతిరావు.

కోర్టు బంట్రోతు పిలుపునందుకుని, గుమస్తా గుర్నాథం, బోనులోకి వచ్చి నిలబడ్డాడు.

భగవద్గీతమీద చేయి వేసి అంతా నిజమే చెబుతానని అబద్ధం చెప్పనని ప్రమాణం చేశాడు.

గణపతిరావు బోనును సమీపించి గుర్నాథం వంక సూటిగా చూశాడు.

"మీ పేరు?"

"గుర్నాథమండి."

"మీరేం చేస్తుంటారు?"

"గోపాలరావుగారి యింటిలో గుమస్తానండి."

"ఇంటిలోనా?"

"చిత్తం! యింటికి కావాల్సిన వెచ్చాలు, నౌకరుల జీతాలూ, ఇతర చిల్లర జమాఖర్చులూ అన్నీ చూస్తుంటానండి."

"మీ అమ్మగారు, అంటే శ్రీమతి సుగుణగారు ఖర్చు

మనిషా?"

"మెల్లగా అడుగుతారేమిటండీ! వేలకు, వేలు ఎకం చేత్తో ఖర్చు చేసేవారండీ."

"ఆమెకు ఖర్చుకు కావాల్సిన డబ్బును అయ్యగారే యిచ్చేవారా?"

"లేదండి. నేనే యిచ్చేవాడినండి."

"మీరా?"

"చిత్తం! పెట్టీకేష్ అంతా నేనే చూస్తూండేవాడిని కదండి. అందులో యిచ్చేవాడినండి"

"మరి, మీ అమ్మగారు అంత డబ్బును దుబారాగా ఖర్చు చేస్తుంటే మీ అయ్యగారు కోప్పడేవారు కాదా!"

"ఛ! ఛ! ఆయన అలాంటివారు కాదండి. అమ్మగారు యెంత కావాలంటే అంత డబ్బు యివ్వమని చెప్పేవారండి. వారేమిటండి లక్షాధికారులు!"

"దట్సాల్ యువరానర్" అన్నాడు గణపతిరావు.

"ఎనీ కొశ్చెన్స్ ఫ్రం ప్రాసిక్యూషన్?"

"నో కొశ్చెన్స్ యువరానర్!"

రామానుజానికి తెలుసు. ఈ సాక్షిని ప్రశ్నించడం వృధా అని గణపతిరావు ఒకసారి చుట్టూ కలియజూసి గొంతును సవరించుకున్నాడు.

"మి లార్డ్!

ఇప్పుడు కోర్టువారి సమక్షంలో ప్రశ్నించబడ్డ ఇద్దరు సాక్షుల కథనాన్ని మీరు ఆలకించారు.

నిజమే! శ్రీమతి సుగుణ ఖర్చు మనిషే!

అయితే, ఆమె విలాసంగా ఖర్చుచేయడానికి ఆమెకు అడ్డంకులు యేమీ లేవు. ఆమె భర్త ఆమెకు ఆర్థికంగా

పూర్తి స్వేచ్ఛ నిచ్చాడు.

బంగారు గ్రుడ్లు పెట్టే బాతును ఎవరూ చంపుకోరు యువరానర్! పెంచుకుంటారు.

యిక, ఆ స్తి తన పేర వ్రాయబడిందన్న విషయం ముద్దాయికి ఈ హత్య జరిగిన తరువాతే తెలిసింది. కాబట్టి ముద్దాయి ఆస్తికోసమే ఈ హత్యను చేసిందనడానికి ఆస్కారమే లేదు."

తన వాదనను ఆపి క్రిగంట ప్రాసిక్యూటర్ వంక చూశాడు గణపతిరావు.

జడ్జిగారు ఒకసారి తన చేతికున్న వాచ్ వంక చూసు కున్నారు. తరువాత మెల్లగా లేచి నిలబడ్డారు.

"ద కోర్ట్ ఈజ్ ఎడ్ జర్న్డ్" అన్నారు.

# 6

"యువరానర్!

ఈ కేసులోని ముఖ్యమైన పాయింట్ను మై లెర్నెడ్ డిఫెన్స్ లాయర్ గణపతిరావ్ తెలివిగా మభ్యపరి చారు....

ఈ హత్య ఎందుకు జరిగింది?

ముద్దాయి సుగుణ, ఒక పరాయి పురుషునితో అక్రమ సంబంధాన్ని కలిగివుండటాన్ని, హతుడు గోపాలరావు ప్రత్యక్షంగా చూశాడు.

ఆ విషయాన్ని పీపుల్స్ ఎగ్జిబిట్ 'డి'గా సబ్మిట్ చేయబడ్డ హతుని డైరీ ధృవపరుస్తూంది.

తన భర్తకు తన అక్రమసంబంధం గురించి తెలిసి పోయిందని గ్రహించిన ముద్దాయి సుగుణ, తన ప్రియుని సహాయంతో ఈ హత్య చేసింది.

యువరానర్!

ముద్దాయికున్న అక్రమసంబంధం గురించి ఆ యింటి నౌకరు సీనయ్య సాక్ష్యం ఉంది.

అన్నింటినీ మించి....ఆ యింటి పెరడులో దొరికిన శవం. ఆ గోతిదగ్గర ముద్దాయి అడుగుల గుర్తులు, స్టోర్ రూమ్‌లో లభించిన పార, గునపంపై ముద్దాయి వేలి ముద్రలు....యివన్నీ శ్రీమతి సుగుణను దోషిగా నిర్ధారిస్తున్నాయి.

ఇట్స్ ఎ ప్రీ ప్లాన్డ్ కోల్డు మర్డర్!

యువరానర్!

పరాయిపురుషునితో అక్రమసంబంధం పెట్టుకున్నది చాలక, ఆ రహస్యం భర్తకు తెలిసిపోయిందని తెలిసి, తాళికట్టిన భర్తనే అమానుషంగా చంపిన ఈ హంతకిని కోర్టువారు కఠినంగా శిక్షించాలని మనవి చేస్తున్నాను."

తన వాదనను ముగించి, గర్వంగా తన సీటులో కూర్చున్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ రామానుజం.

డిఫెన్స్ లాయర్ గణపతిరావు మెల్లగా లేచి నిలబడ్డాడు. జడ్జిగారికి అభివాదం చేశాడు.

"మిలార్డ్!

ప్రాసిక్యూటర్ గారు అడిగిన ప్రశ్న అన్నింటికీ సమాధానం ఒక్కటే! అది....నా క్లయింట్ సుగుణ సాక్ష్యం!

శ్రీమతి సుగుణ మరోసారి తన వాఙ్మూలాన్ని ఇవ్వడానికి కోర్టువారు అనుమతించాలి."

"రిక్వెస్టు గ్రాంటెడ్" అన్నారు జడ్జిగారు.

కోర్టు గుమాస్తా తెచ్చిన భగవద్గీ మీద చేయి వేసి "దేవుని ఎదుట ప్రమాణం చేసి అంతా నిజమే చెబుతాను, అబద్ధం చెప్పను...." అంది బోనులో నిలబడ్డ

సుగుణ.

అంతా ఆమెవంక ఉత్సుకతో చూస్తున్నారు.

"నేనూ, ఆంటోనీ ప్రేమించుకున్నాం. పెళ్ళి కూడా చేసుకోవాలనుకున్నాం. కాని చివరిక్షణంలో తెలిసింది నాకు అతడు ప్రేమిస్తున్నది నా అందాన్ని, నేను చేస్తున్న ఉద్యోగాన్ని, తద్వారా వస్తున్న సంపాదనని. మా మధ్య పెళ్ళి ప్రసక్తి వచ్చిన పదిరోజులలో నే అత డెక్కడికో పరారై పోయాడు.

ఆ తరువాత నా వివాహం గోపాలరావుగారితో జరిగింది. హాయిగా సాగిపోతున్న నా సంసారంలోకి విషపు పురుగులా మళ్ళీ ప్రవేశించాడు ఆంటోనీ.

మేము వ్రాసుకున్న ఉత్తరాలు, మే మిద్దరం కలిసి తీయించుకున్న ఫోటోలను చూపించి, నన్ను బ్లాక్ మెయిల్ చేయసాగాడు.

ఆ ఉత్తరాలూ, ఫోటోలు నా భర్త చేతిలో పడితే నా కాపురం కూలిపోతుంది. అడదాన్ని నేను యేం చేయగలను! అతడు అడిగిన డబ్బును యివ్వసాగాను.

అయితే, అతడు కేవలం డబ్బుతో తృప్తిపడలేదు. నా శరీరాన్ని కూడా కోరాడు.

నిజమే!

అతడికి నా శరీరం మేమీ క్రొత్తది కాదు. పెళ్ళికిముందే యేం తొందరపడ్డాం! కాని, యిప్పుడు యింకొకరి భార్య నయిన నేను మళ్ళీ అతడితో అక్రమ సంబంధం పెట్టు కోవాలంటే నాకు అసహ్యం వేసింది.

కాని, నా కాపురం నిలబెట్టుకోవడానికి అతడి కోరికకు తల వంచక తప్పలేదు నాకు.

నా దురదృష్టం! మా అక్రమసంబంధం నా భర్త

కంట పడింది.

ఆ రోజు రాత్రి....

నా భర్తను చూసి ఆంటోనీ పారిపోయాడు. నా భర్త నన్ను నా నా దుర్భాషలూ ఆడి తన గదిలోనికి వెళ్ళిపోయాడు. నేను ఏడుస్తూ కూర్చున్నాను.

సుమారు గంటో, రెండు గంటలో గడిచివుంటాయి. ఆంటోనీ మళ్ళీ వచ్చాడు. నా నగలనూ, చేతికి అందిన డబ్బునూ తీసుకొని తనతో వచ్చేయమన్నాడు.

"నా సంసారాన్ని యిప్పటికే సర్వనాశనం చేశావు. ఇంకా నన్నెందుకు వెంటాడుతావు? తక్షణం నా కళ్ళ ముందు నుండి పో!" అంటూ అతడిని తిట్టాను నేను.

మే మిద్దరం ఘర్షణ పడుతున్నాం.

ఇంతలో ఆ గదిలోనికి యెప్పుడు వచ్చారో.... యేమో! నా భర్త పిల్లిలా అడుగులు వేసుకుంటూ ఆంటోనీ వెనుకకు చేరుకున్నారు. అతడి చేతిలో యేదో గూటంలాంటి వస్తువుంది. దానితో బలంగా ఆంటోనీ తలపై మోదారు.

అంతే! రక్తం వరదలయి కారుతుంటే కుప్పకూలి పోయాడు ఆంటోనీ. నా భర్త అతడి ముఖాన్ని పూర్తిగా చితకగొట్టారు.

నేను నిశ్చేష్టురాలినై నిలబడి వుండిపోయాను.

ఆ కోపంలో హత్య చేసేశారు గాని, ఆ తరువాత నా భర్తకు కూడా కాళ్ళూ, చేతులూ ఆడలేదు. కొంత సేపటి తరువాత ఆయన తేరుకున్నారు.

ఆంటోనీ శవాన్ని తోటలో పాతిపెట్టాం మేమిద్దరం. నా గదినీ, ఆ పలుగునూ, పారనూ శుభ్రంగా కడిగి వేసాను నేను.

అంతా సవ్యంగా జరిగిపోయింది అనుకున్నాను నేను. కాని, నా భర్త ఆ రోజు రాత్రే యెక్కడికో వెళ్ళిపోయారు. పోలీసులు వచ్చి ఎంక్వయిరీ ప్రారంభించారు.

నేనేం చెప్పగలను?

నిజం చెబితే, నా భర్త మెడకు ఉరిత్రాడు చుట్టుకుంటుంది. నిజం చెప్పకుంటే నన్నే హంతకురాలుగా పోలీసులు చిత్రిస్తున్నారు.

నేను తీవ్రంగా ఆలోచించాను.

నా భర్తను రక్షించుకోవాలంటే నేను నోరు విప్పకూడదు. దాని పర్యవసానం నేను ఉరికంబానికి ఎక్కాల్సినా సరే!

నా భర్తకు నేను చేసిన ద్రోహానికి అదే నాకు తగిన శిక్ష అనుకున్నాను.

ఇదంతా ఎందుకు చేశాను?

కేవలం, నా భర్త నన్ను క్షమిస్తాడని.

కాని, ఆయన నా గూర్చి పట్టించుకోలేదు. ఆయన కోసం జైలులో క్రుంగిపోతున్న నన్ను చూడటానికి ఆయన ఒక్కసారి వచ్చి ఉంటే.... నన్ను పలకరించి ఉంటే.... నేను జీవితాంతం హాయిగా జైలు శిక్షను అనుభవించి ఉండేదాన్ని.

కాని, అజ్ఞాతంగా వున్న నా భర్త నన్ను పూర్తిగా నిర్లక్ష్యం చేశారు. నేనెవరో తెలియనట్లు ఊరుకున్నారు.

ఎవరికోసం నేను ఈ శిక్షను అనుభవిస్తున్నానో, ఆయనకు నేనేమైపోయినా అవసరం లేనప్పుడు నేనెందుకు అన్యాయంగా శిక్షను అనుభవించాలి? అందుకే నిజం చెబుతున్నాను. నేను నిర్దోషిని.

నాకే పాపమూ తెలియదు"

—అంటూ భోరుమని ఏడుస్తూ, బోనులో కుప్పలా కూలిపోయింది సుగుణ.

ఇంతలో....

ప్రేక్షకుల గ్యాలరీ మధ్య నుండి ఒక వ్యక్తి సుడి గాలిలా ముందుకు దూసుకు వచ్చాడు. గడ్డాలూ, మీసాలూ వత్తుగా పెరిగి వున్నాయి అతడికి. ముదురు ఆకుపచ్చరంగు శాలువా కప్పుకొని వున్నాడు.

అతడిని చూస్తూనే ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చున్న నౌకరు సీనయ్య, గుమస్తా, గురునాథం, లాయర్ ముకుందం ఆశ్చర్యంగా లేచి నిలబడ్డారు.

"అయ్యగారూ!" అన్నాడు సీనయ్య.

"గోపాలరావుగారు....గోపాలరావుగారు....గోపాల గారు..."

కోర్టు హాలంతా గుస, గుసలతో....కలకలం బయలు దేరింది.

అంతా అతడి వంకే చూస్తున్నారు.

ఇన్‌స్పెక్టర్ జయంత్ ఆత్రంగా తన ముందున్న ఫైలును తిరగవేశాడు. అందులోనున్న గోపాలరావు ఫోటో వంక, ఆ వ్యక్తి వంక మార్చి మార్చి చూశాడు.

సందేహం లేదు.

అతడు గోపాలరావే!

పబ్లిక్ ప్రాసిక్యూటర్ రామానుజం ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

బోనులో కూలబడిన సుగుణ ఆ కలకలానికి కళ్ళు తెరిచి చూసింది.

ఎదురుగా తన భర్త....గోపాలరావు.

"ఏమండీ....!" అంది ఆమె ఆనందంగా లేచి నిం

బడుతూ.

ఆ వ్యక్తి మరో అడుగు ముందుకు వేశాడు. శాలువా క్రిందనున్న అతడి కుడిచేయి పైకి వచ్చింది. అతని చేతిలోని రివాల్వర్ రెండుసార్లు గర్జించింది.

మొదటి గుండు సూటిగా వచ్చి సుగుణ భుజానికి తాకింది. అంతే! ఆమె కెవ్వున కేక వేస్తూ క్రిందకు పడిపోయింది. రెండవ గుండు ఆమె నిలుచున్న బోనుకు తగిలింది.

“మై గాడ్!” చిన్నగా అర్చారు జడ్జిగారు.

రివాల్వర్ మోతతో కోర్టులో అలజడి ప్రారంభమయింది. కెవ్వుమని కేకలు వేస్తూ ప్రేక్షకులు, లాయర్లు పిచ్చెక్కినట్లు పరుగులెత్తారు.

ఇన్స్పెక్టర్ జయంత్, కాన్స్టేబుల్స్ని ఎలర్టు చేసి గ్యాలరీవైపు పరిగెత్తేసరికి.....గోపాలరావు అదృశ్యమయ్యాడు.

## 7

“నీవు తిరిగి వచ్చేటంత వరకూ టెన్షన్‌తో చచ్చిపోయాననుకో నిక్కీ!” అంది సంధ్య అతడిని లతలా పెనవేసుకుపోతూ,

చిన్నగా నవ్వాడు నికల్సన్.

“ఎందుకు డార్లింగ్! అంత భయం?” పెట్టుడు గడ్డం మీసాలనూ తీసేస్తూ అన్నాడతను.

అతడి భుజంమీదనున్న ముదురు ఆకుపచ్చరంగు శాలువాను తీసి ప్రక్కన పడేసింది ఆమె.

“నీకు నవ్వులాటగానే వుంటుంది నిక్కీ! గోపాలరావు వేషంలో ఉన్న నీవు మన దురదృష్టవశాత్తూ పోలీసులకు పట్టుబడితే.....!”

"నెవ్వర్!" అన్నాడతడు దృఢంగా.

"దేశ ప్రధానిని చంపటానికి. ప్రధాని ఒక నిర్ణీత స్థలానికి, నిర్ణీత సమయానికి వస్తారని తెలిసి. ఆ స్థలంలో అందరిమధ్యా రెండు రోజులుగా పొదలలో దాక్కున్న హంతకుని ఆచూకీని కనుగొనలేని ఈ పోలీసు వ్యవస్థలో మనలాంటి వారు చాలా సులువుగా తప్పించుకోవచ్చు.... డార్లింగ్!

ఆఫ్టరాల్....ఏ కాపలా వుండని ఒక కోర్టు హాల్లో ఒక వ్యక్తిని కాల్చిరావడం. అదెంత పని?"

సంధ్య కళ్ళు విప్పార్చుకుని అతని వంకే చూస్తుంది.

"అయితే ఒక్క విషయంలో నాకు భయం వేసింది! నేను ప్రేల్చిన రివాల్వర్ గుండు సుగుణ భుజానికి కాక గుండెకు తగులుతుందేమోనని!

ఎంత ఎక్స్‌పర్ట్ షూటర్‌నైనా, అది ప్రాణాలతో చెలగాటం కదా! అదీగాక మనకు సుగుణ ఎలాగైనా బ్రతికే తీరాలికదా!" అన్నాడతడు నవ్వుతూ.

"అయితే సుగుణ నిర్దోషిగా విడుదలవుతుందంటావా?" ఆత్రంగా అడిగిందామె.

"ఏం? సందేహమా?"

—అదే సమయంలో....

అక్కడ....కోర్టు హాల్లో....

లాయర్ గణపతిరావు తన చివరి వాదనను కొనసాగిస్తున్నాడు.

"యువరానర్!

ప్రాసిక్యూషన్ వారు పీపుల్స్ ఎగ్జిబిట్ 'డి'గా ప్రవేశపెట్టిన గోపాలరావుగారి డైరీలో వ్రాసుకున్న చివరి మాటలను ఒక్కసారి పరిశీలించండి.

'ఆ క్షణంలో వాళ్ళిద్దరినీ అక్కడి, కక్కడే నరికి పోగులు పెడదామన్న ఆవేశం వచ్చింది నాకు.

ఇవి స్వయంగా గోపాలరావుగారు వ్రాసిన మాటలు!

నిజమే! తాళికట్టిన భార్య పరాయి మగవానితో కులుకుతుంటే యే మగాడూ చూస్తూ సహించలేడు. పట్టరానంత ఆవేశం వస్తుంది ఎవరికైనా.

ఆ ఆవేశంలోనే....గోపాలరావుగారు తన భార్య ప్రియుడైన ఆంటోనీని హత్య చేశారు.

ఆ హత్యకు ప్రత్యక్ష సాక్షి....ఈ కేసులో ముద్దాయిగా పరిగణింపబడుతున్న నా క్లయింట్ సుగుణ.

ఈ రోజు....మనందరి కళ్ళ ఎదుటే, చనిపోయాడని భావించబడుతున్న గోపాలరావు దారుణంగా తన భార్యను హత్య చేయడానికి ప్రయత్నించడం మనం కళ్ళార చూశాం. ఆయనలో హంతకుని ప్రవృత్తి ఉందనడానికి ఈ సంఘటనే ప్రత్యక్ష సాక్షం.

సుగుణను హత్య చేయాల్సిన అవసరం ఒక్క గోపాలరావుకు తప్ప యింకెవరికీ లేదు.

హత్యకు మోటివ్....ఆమెపట్ల అతడికున్న అసహ్యం, ద్వేషం, పగ.

ఆమెపై పగబట్టేవారు ఇంకెవరు ఉంటారు?

యువరానర్!

ఇండియన్ ఎవిడెన్స్ యాక్టు 1872, సెక్షన్స్ 107, 108 లు ప్రకారం చనిపోయాడని భావింపబడుతున్న గోపాలరావు జీవించి వున్నాడనే నిజం, నిరూపించబడటంవలన___

సదరు గోపాలరావుని హత్య చేసిందన్న అభియోగం మోపబడ్డ నా క్లయింట్ నిర్దోషి అని నిర్ధారణ మవు

తున్నది.

జీవించి వున్న మనిషి హత్య చేయబడ్డాడనటం, ఆ హత్యా నేరానికి ఒక అమాయకురాల్ని శిక్షించబోవటం అర్థరహితం. యువరానర్!

హత్య చేయబడ్డది ఆంటోనీ.

గోపాలరావు హంతకుడు కాదు హంతకుడు!"

జడ్జిగారు గణపతిరావు వంక ప్రశంసాపూర్వకంగా చూశారు.

"యువరానర్!

సరిగ్గా ఇలాంటి కేసే ఒకటి ఈ మధ్య ఆస్ట్రేలియాలో జరిగింది.

తన భర్తను హత్య చేసిందన్న నేరంపై ఒక స్త్రీ అరెస్టు చేయబడింది.

అయితే సిడ్నీలో.... భారత, ఆస్ట్రేలియాల మధ్య జరుగుతున్న ఒక క్రికెట్ మ్యాచ్‌లో.... ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చున్న ఆమె భర్తను కొందరు వ్యక్తులు చూశారు.

పోలీసులు ఆమె భర్తకోసం అన్వేషణ ప్రారంభించారు. కాని, యింతవరకూ అతడి ఆచూకీ లభించలేదు.

అయితే, ఆమె భర్త జీవించి వున్నాడని తెలియడం చేత జీవించివున్న భర్తను చంపిందన్న అభియోగాన్ని కొట్టిపారేస్తూ... బెనిఫిట్ ఆఫ్ డౌట్ క్రింద ఆమెను నిర్దోషిగా విడుదల చేసింది ఆ న్యాయస్థానం.

మిలార్డ్!

ఆస్ట్రేలియా కోర్టు తీర్పును కూడా ఒక రిఫరెన్స్‌గా తీసుకొని, నా క్లయింటును నిర్దోషిగా గుర్తించి విడుదల చేయాల్సిందిగా కోర్టువారిని అర్థిస్తున్నాను."

ఆర్గ్యుమెంటును ముగించి, జడ్జికి అభివాదం చేసి, హుందాగా నడుచుకుంటూ పోయి తన సీట్లో కూర్చున్నాడు గణపతిరావు.

"బ్లడీ.... బెనిఫిట్ ఆఫ్ డౌట్!" మనసులో కసిగా తిట్టుకున్నాడు ప్రాసిక్యూటర్ రామానుజం.

అతనికి తెలుసు. ఈ కేసులో తాను ఓడిపోబోతున్నానని, 'సుగుణ నిర్దోషి' అని జడ్జిగారు తీర్పు ఇవ్వబోతున్నారని.

"బ్లడీ ఎవిడెన్స్ ఏక్ట్!" అనుకున్నాడు అతడు విసుగ్గా.

# 8

శవం వంక పరీక్షగా చూశాడు ఇన్స్పెక్టర్ జయంత్.

ఆ రోజు ఉదయం స్టేషన్ మాస్టర్ వద్ద నుండి ఫోన్ వచ్చింది అతనికి. 'రైల్వేస్టేషన్ కు కొంతదూరంలో పట్టాలపై ఒక శవం పడివుందని, మార్నింగ్ రొటీన్ ప్రకారం ట్రాక్ చెక్ చేయడానికి వెళ్ళిన లైన్ మేన్ ఆ శవాన్ని చూసి తనకు రిపోర్టు చేశాడని' చెప్పాడతడు.

ఆ కాల్ అందుకున్న మరుక్షణం హుటాహుటిని బయలుదేరి రైల్వేస్టేషన్ చేరుకున్నాడు ఇన్స్పెక్టర్.

శవాన్ని ముందుగా చూసిన లైన్ మేన్ స్టేషన్ మాస్టర్ ముందు నడుస్తూ దారి చూపుతుంటే వెంట వచ్చిన కానిస్టేబుల్సుతో సహా ఆ డెత్ స్పాట్ వంక నడిచాడు జయంత్.

రైల్వే ట్రాక్ కు అడ్డంగా పడివుంది ఆ శవం. నిజానికి అది శవాకారంలో లేదు. నలిగి గుజ్జులా మారిన మాంసపు

ముద్దలా వుంది.

పగిలిన తలలోనుండి బ్రతుళ్ళిపడ్డ తెల్లని మెదడు రక్తం ఓడుతూ ఓ ప్రక్కగా పడివుంది. అసలు ఆ శవానికి తల భాగం కనిపించటం లేదు. ఆ స్థానంలో క్రిమా కొట్టబడి నట్లు కొంత మాంసపుముద్ద పట్టాలకు అంటివుంది. కాళ్ళూ, చేతులూ చెఱకుగడల్లా పిప్పి అయివున్నాయి. పెద్ద బండతో మోదినట్లు గుండె, పొట్ట చితికిపోయి మాంసపు ముద్దల్లా కన్పిస్తున్నాయి.

ఎన్నో శవాలను చూసిన పోలీసులు సయితం ఆ శవాన్ని చూడలేక ముఖాల్ని తిప్పుకున్నారు. వారి కడుపులో ప్రేగులు మెలిత్రిప్పినట్లయింది. మరో రెండు క్షణాలు అక్కడే ఉంటే వాంతి వచ్చేటట్లుంది వారి పరిస్థితి.

ఇక చూడలేక గిరుక్కున వెనుతిరిగాడు ఇన్‌స్పెక్టర్ జయంత్. అప్పుడు అతని కంట పడింది ఆ శవంపై నున్న శాలువా.

కళ్ళు విప్పార్చుకొని చూశా డతడు.

అది....ఆకుపచ్చ రంగు శాలువా!

అలాంటి శాలువాను యెక్కడో చూసినట్లని పించింది అతనికి. కాని ఎక్కడో గుర్తుకు రావటం లేదు.

అతడు ఆలోచిస్తున్నాడు.

"సార్! శవానికి కాస్త దూరంలో ఈ సంచి పడి వుంది సర్!"

ఖాకీ రంగులో నున్న చిన్న గుడ్డ సంచీని అందిస్తూ అన్నాడొక కానిస్టేబిల్.

ఆ సంచిని అందుకున్నా డతడు అందులో ఏముందో

నని ఆత్రంగా తొంగిచూశాడు.

మడతలు పెట్టబడిన పెద్ద సేఫ్ కిన్ కనిపించింది. దానిని పైకి తీశాడు. సేవ్ కిన్ మడతలమధ్య ఏదో నల్లని వస్తువు కన్పిస్తూంది.

సేవ్ కిన్ మడతలను విప్పాడు.

అంతే! ఆ మడతల మధ్యనున్న నల్లనివస్తువును చూసి ఉలిక్కిపడ్డాడతడు.

అది... రివాల్వర్!

దానిపైనున్న వేలిముద్రలు చెరిగిపోకుండా జాగ్రత్తగా ఆ సేవ్ కిన్ తోనే చుట్టి ఆ సంచిలోనే భద్రపరిచాడు.

సేవ్ కిన్ ను లోపల పెడుతూ వుండగా, అతని చేతి వేళ్ళకు తగిలాయి సంచి అడుగునున్న కొన్ని కాగితాలు. వాటిని పైకి తీసాడతడు.

అవి దస్తావేజు కాగితాలు.

వాటిని తెరచి చూశాడు.

అంతే! ఆశ్చర్యంతో అతని కళ్ళు పెద్దవయ్యాయి. అవి... తన యావదాస్తినీ తన భార్య సుగుణ పేర వ్రాస్తూ రిజిష్టర్ చేయించిన గోపాలరావుగారి వీలునామా నకలు పత్రాలు.

వాటిని చూడగానే ఆ ఆకుపచ్చ రంగు శాలువాను తాను ఎక్కడ చూశాడో ఛటుక్కున గుర్తుకు వచ్చింది అతనికి.

కోర్టులో తన భార్య సుగుణను రివాల్వర్ తో కాల్చి చంపడానికి ప్రయత్నించిన గోపాలరావు సరిగ్గా అలాంటి శాలువనే ధరించాడు.

'ఆ శాలువా.... సేవ్ కిన్ లో చుట్టబడ్డ రివాల్వర్, ఆ వీలునామా పత్రాలు' వీటిని బట్టి ఆ శవం యెవరిదో

అర్థం అయిపోయింది అతనికి.

'గోపాలరావు! గోపాలరావేనా?'—అతడు సందిగ్ధంలో కొట్టు, మిట్టులాడుతున్నాడు.

"బహుశ ట్రాక్‌ను క్రాస్ చేస్తూ ఉండగా ఈ ప్రమాదం సంభవించి వుండవచ్చు ఇన్‌స్పెక్టర్! చీకటిలో వస్తున్న రైలును గమనించలేదో! లేక, రైలు వచ్చే లోగా క్రాస్ చేసేయగలనన్న గుడ్డి నమ్మకంతో.... నిర్లక్ష్యంగా పట్టాలను దాటేయబోయాడో!

ఎనీ హౌ! ఇట్స్ ఎ హారిబుల్ డెత్!"

స్టేషన్ మాష్టరు చెబుతున్న మాటలను వింటూ చక, చకా అడుగులు వేస్తున్నాడు ఇన్‌స్పెక్టర్.

అయితే, అతడు ఆలోచిస్తున్నది హతుడు ఎలా మరణించాడా అని కాదు. హతుడు గోపాలరావే అయితే, అతని సంచిలో ఆ విల్లు యెందుకున్నట్లు?—అదీ అతడు ఆలోచిస్తున్నది.

అది విల్లు నకలు.

ఆ రోజు రాత్రి.... ఆంటోనీని హత్యచేసి, పారిపోయిన గోపాలరావు తనతో పాటుగా ఆ విల్లు నకలును కూడా తీసుకొనిపోయి ఉంటాడా?

ఎందుకోసమైనా, ఏమైనా....

అలా తీసుకొని వెళ్ళేవాడయితే అసలు విల్లునే తీసుకొని వెళ్ళిపోతాడు కాని నకలు ఎందుకు తీసుకు వెళ్తాడు?

కాబట్టి, ఆ రోజు రాత్రి అతడు ఆ విల్లును తీసుకొని వెళ్ళివుండడు. ఈ మధ్యే యెవరో అతనికి ఆ నకలును అందించి వుండాలి.

ఎవరు అందించి ఉంటారు?

ఎవరి దగ్గర ఉంటుంది ఆ నకలు?

ఎవరైతే ఆ విల్లును వ్రాసారో ఆ లాయర్ వద్ద ఉంటుంది ఆ నకలు! అంటే లాయర్ ముకుందరావు ఆ విల్లును గోపాలరావుకు అందజేసి ఉంటాడా? ఎందుకు?

ఆ చిక్కు ప్రశ్నల ముడులను విప్పడంకోసం అతడు వెంటనే లాయర్ ముకుందరావును కలుసుకున్నాడు.

"నిజమే! నేనే ఆ విల్లు నకలును గోపాలరావుగారికి అందజేశాను" అన్నాడు ముకుందరావు.

"ఎప్పుడు?"

"నిన్న రాత్రి!"

"ఏం జరిగిందో కొంచెం వివరంగా చెబుతారా?" ముకుందరావు కళ్ళలోనికి సూటిగా చూస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్.

ముకుందరావు చిన్నగా గొంతును సవరించుకున్నాడు.

"నిన్న రాత్రి ఏడుగంటల ప్రాంతంలో అనుకుంటాను. నాకు గోపాలరావుగారి దగ్గరనుండి ఫోన్ వచ్చింది ఫోన్‌లో ఆయన గొంతు విని ఆశ్చర్యపోయాను నేను.

రైల్వేస్టేషన్‌కు దగ్గరలో నున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లోనుండి తాను మాట్లాడుతున్నాననీ, వెంటనే తాను వ్రాసిన విల్లు పత్రాలను తీసుకొని అక్కడికి రమ్మని చెప్పారాయన."

"ఎందుకు? ఎందుకా విల్లు?" అసహనంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

అతనిని చూసి చిన్నగా నవ్వాడు ముకుందరావు.

"నేనూ అదే ప్రశ్న వేశాను ఇన్‌స్పెక్టర్!

'తాను విల్లును మార్చి వ్రాయాలనుకుంటున్నానని' అన్నారాయన.

అయితే అసలు విల్లు పత్రాలు నా వద్ద లేవు. అవి

సుగుణగారికి అందచేశాను....ఈ మధ్యే! ఆ మాటే చెప్పారాయనతో.

అయితే విల్లు నకలును తీసుకురమ్మని చెప్పారాయన. సరే నన్నాను నేను."

"అయితే, గోపాలరావుగారిని మీరు కలుసుకున్నారా?" ఆత్రంగా అడిగాడు ఇన్ స్పెక్టర్.

అవునన్నట్లు తలూపా డతడు.

'ప్రశాంతంగా గడచిపోతున్న తన జీవితం లోనికి ప్రవేశించి, ఈ రోజు తాను హంతకునిగా మారి, ఇలా చీకటి జీవితాన్ని గడుపుతుండడానికి కారణమైన తన భార్య సుగుణకు తన ఆస్తి దక్కడానికి వీలులేదనీ .

ఇన్నాళ్ళూ, తన బదులుగా జైలుశిక్షను అనుభవిస్తున్నదనే సాఫ్ట్ కార్నర్ యేమైనా తన భార్యపై మిగిలివుంటే.... అది ఆమె నిన్న కోర్టులో యిచ్చిన వాఙ్మూలంలో తుడిచిపెట్టుకు పోయిందనీ....

నూరు ఆరైనా, ఆరు నూరైనా తన ఆస్తి ఆ పాతకికి మాత్రం దక్కకూడదనీ

తన యావదాస్తినీ నాకు తోచిన యే అనాధ శరణాలయం పేరైనా వ్రాసి విల్లును సిద్ధంచేసి మరునాడు అంటే ఈ రోజు రాత్రి అదే వేళకు ఆ పబ్లిక్ టెలిఫోన్ బూత్ దగ్గరకే వచ్చి తనను కలుసుకొమ్మని చెప్పారాయన.

కాని, ఇంతలోనే ఆయనను మృత్యువు కబళించి వేస్తుందని కలలో కూడా వూహించలేక పోయాను."

బాధతో ముకుందరావు గొంతు గద్గదమయ్యింది.

అనునయంగా ముకుందరావు భుజాన్ని తట్టి బయటకు నడిచాడతడు.

నిజమే! యింక ఈ కేసులో యెవరినైనా ప్రశ్నించ డానికి ఏముంది గనుక!

ముకుందరావును కలుసుకోబోయే ముందే, బాలిస్టిక్, ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్ట్సునుండి అతనికి రిపోర్టులందాయి.

'గుంచిలో నేవ్ కిన్‌తో చుట్టబడిన రివాల్వర్.... పాయింట్ త్రి, టు కాలిబర్ రకానికి చెందినదని, కోర్టులో కాల్చబడి, సుగుణ భుజంలోనుండి దూసుకు పోయిన బుల్లెట్ ఆ రివాల్వర్‌నుండే కాల్చబడిందనీ' బాలిస్టిక్ ఎక్స్‌పర్టు రిపోర్టు యిచ్చాడు.

ఆ రివాల్వర్ పై లభించిన వ్రేలిముద్రలు గోపాలరావు గారివేనని ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్టు రిపోర్టు యిచ్చాడు.

సో! హంతకుడు గోపాలరావేనని నిర్ధారణమైపోయింది!

మొదట హతుడు ఆంటోనీని చంపిన హంతకునిగా కోర్టులో నిరూపించబడిన గోపాలరావే రైలు ప్రమా దంలో హతునిగా మారాక....యిక కేసేముంది!

జస్టు ఒన్ కన్ క్లోజ్ దట్ ఫైల్ హేపీలీ! హాయిగా ఆ కేసు ఫైలును మూసేసి మూల పారేయవచ్చు.

అఫ్‌కోర్స్!

అది ఇన్‌స్పెక్టర్ జయంత్ కాకుండా మరో పోలీసు ఆఫీసరైనట్లయితే, ఖచ్చితంగా ఆ పని చేసి ఉండేవాడు.

అప్పుడు ఈ కథ ఇంతటితోనే ముగిసి ఉండేది!

## 9

"గేమ్!"

గొల్లుమని వినిపించిన అరుపులవ, డ్రాయింగ్ రూమ్ లోని కుషన్ ఛెయిర్‌లో కూర్చుని దీర్ఘాలోచనలో మునిగి ఉన్న ఇన్‌స్పెక్టర్ జయంత్ తలత్రిప్పి చూశాడు.

హాలులో కేరమ్స్ ఆడుకుంటున్న పిల్లలు ఆనందంతో కేరింతలు కొడుతున్నారు.

వారి వంక నవ్వుతూ చూశాడతడు.

చూపులు పిల్లలమీదున్నా, అతని మెదడులో మాత్రం ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

అతనికి యెదురుగా నున్న టేబిల్ పై మూసి, మూల పారేయాల్సిన సుగుణ కేసు ఫైలు తెరచి పెట్టబడి వుంది. అతడు ఆ కేసుయొక్క పూర్వాపరాలను సమీక్షించుకుంటున్నాడు.

'ఇనాళ్ళూ మౌనంగా శిక్షను అనుభవిస్తున్న సుగుణ మళ్ళీ తన కేసును కోర్టుకు అప్పీల్ చేసిందంటే, తాను నిర్దోషిగా నిరూపింపబడతానని ఆమెకు దృఢమైన నమ్మకం కలిగి ఉండాలి.

ఆమెకు అంతగా నమ్మకం కల్గించిన ఆ ఆధారం ఏమిటి?

ఏ సాక్ష్యాధారాలున్నా, సుగుణ ఏ వాఙ్మూలాన్ని యిచ్చినా, ఆ రోజు గోపాలరావు అలా కోర్టు హాల్లో ప్రత్యక్షం కాకుంటే, ఆమె నిర్దోషిగా నిరూపింపబడి ఉండేది కాదు.

అంటే, కేసు హియరింగ్ జరుగుతూ ఉండగా తన భర్త గోపాలరావు కోర్టు హాలులోనికి వస్తాడని ఆమెకు ముందే తెలిసి ఉండాలి.

ఎలా తెలుస్తుంది?

జైలు గోడల మధ్య శిక్షను అనుభవిస్తున్న ఒక ఖైదీకి, ఎప్పుడో ఎక్కడికో పారిపోయి అజ్ఞాతంగా జీవిస్తున్న గోపాలరావు ఉనికి ఎలా తెలుస్తుంది?

అంటే, ఎవరో అతని ఉనికి ఆమెకు చెప్పి ఉండాలి.

అంటే, జైలులోనున్న సుగుణకు ఎవరో కలిసి వుండాలి.

ఎవరు? ఎవరా వ్యక్తి?

ఆ వ్యక్తికి గోపాలరావు ఉనికి తెలిసి వుండాలి.

ఎక్కడో, ఏ మారుమూలలో, ఎవరి కంటా పడకుండా అజ్ఞాతంగా బ్రతుకుతున్న గోపాలరావుకు—

తన భార్య సుగుణ కేసు మళ్ళీ కోర్టుకు అప్పీల్ చేయబడిందనీ, ఆ కేసు హియరింగ్స్‌లో ఆ కోర్టే తన భార్య తన స్త్రీ త్ర వాఙ్మూలాన్ని ఇవ్వబోతోందనీ అతనికి ఎలా తెలిసింది?

ముందుగా తెలియకుంటే, తన భార్యను హత్యచేయడానికి రివాల్వర్‌ను పట్టుకొని మరీ అతడు కోర్టుకు యెందుకు వస్తాడు? వచ్చాడంటే ఆ కేసుయొక్క పూర్తి వివరాలు అతనికి తెలిసి ఉండాలి!

తెలిసి ఉండాలంటే, ఎవరో అతనికి చెప్పివుండాలి. అతడిని కలసి ప్రోవోక్ చేసి ఉండాలి!

ఎవరు? ఎవరా వ్యక్తి?

అటు సుగుణకు ఒక వ్యక్తి సహకరించాడు. ఇటు గోపాలరావుకూ యింకొక వ్యక్తి సహకరించాడు.

"డబుల్ గేమ్!"

గొల్లున వినిపించిన పిల్లల అరుపులకు ఉలిక్కిపడ్డాడతడు.

"డబుల్ గేమ్!"

అప్రయత్నంగా అతని పదాలు ఉచ్చరించాయా పదాల్ని!

"య్యాస్! ఇట్స్ ఎ డబుల్ గేమ్! అటు సుగుణతోనూ, ఇటు గోపాలరావుతోనూ ఎవరో డబుల్ గేమ్ ఆడుతున్నారు.

అయితే ఈ గేమ్ వలన అతనికి వచ్చిన లాభం ఏమిటి? ఇంతవరకు జరిగిన సంఘటనల దృష్ట్యా ఈ కేసులో లాభం పొందుతున్నది ఒకే ఒక వ్యక్తి!

అది.... సుగుణ!

గోపాలరావు కోర్టు హాల్లో ప్రత్యక్షం కావటంవలన ఆమె నిర్దోషి గా నిరూపింపబడింది. ఇప్పుడు గోపాలరావు ఏక్సిడెంట్ లో మరణించాడు కాబట్టి అతని యావదాస్తీ ఆమెకే సంక్రమిస్తూంది.

అంతే!

ఆ ఆలోచన వచ్చిన మరుక్షణం యెవరో ఛెళ్ళున చెర్నాకోలతో చరిచినట్లయింది అతనికి.

కోర్టు హాల్లో కనిపించిన మరునాడే, గోపాలరావు ప్రమాదంలో మరణించడం కేవలం యాదృచ్ఛికమా?

లేక ఆ ప్రమాదం కల్పించబడిందా?

ఆస్తి కోసం గోపాలరావు హత్య చేయబడ్డాడా? ఏది నిజమో, ఏది అబద్ధమో తేల్చుకోలేని పరిస్థితి.

అయినా ఆ ఆలోచన వచ్చాక యింక తాపీగా కూర్చుని ఉండలేకపోయా డతడు. చివాలున కుర్చీలో నుంచి పైకి లేచాడు.

ఇప్పుడతని దృష్టి అంతా ఈ డబుల్ గేమ్‌ను ఆడుతున్న అజ్ఞాత వ్యక్తిపైనే ఉంది. ఎంత తెర వెనుకే ఉండి ఈ నాటకాన్ని ఆడిస్తున్నా, కనీసం జైలులో నున్న సుగుణను ఎప్రోచ్ కావడానికయినా ఆ వ్యక్తో, అతని అనుచరుడో రంగస్థల ప్రవేశం చేసివుండాలి!

'ఆ తీగెను పట్టుకోగల్గితే, ఈ డొంక అదే కదులుతుంది....' అనుకున్నా డతడు బయటకు అడుగులు వేస్తూ.

# 10

"చంపాలాల్ యేమంటున్నాడు లాయర్ గారూ!" తనన్ను సోఫాలో వయ్యారంగా వెనక్కి వాలుతూ అంది సుగుణ.

కొన్ని రోజుల క్రితం వరకూ, జైలులో ఒంటరిగా, దిగులుగా గడిపిన ఆ ఖైదీ సుగుణా, ఈ రోజు గోపాల రావు ఆస్తికి సర్వాధికారిణి అయిన అష్టాధికారి సుగుణా ఒక్కరేనంటే చూసేవారికి నమ్మబుద్ధి కాదు.

ఆమె మాటల్లో, ప్రవర్తనలో అంత మార్పు వచ్చింది. ఆస్తి తెచ్చిన అహం ఆమె అణువణువులో తొణికిసలాడుతూంది.

'ఇంతలో ఎంత హుందానీ, ఎంత దర్పాన్నీ ఒలకబోస్తూంది' అనుకున్నాడు ముకుందరావు.

"తొమ్మిది లక్షల వరకూ యిస్తానన్నాడు" అన్నాడతడు.

"ఇన్ని బేరాలు అనవసరం లాయర్ గారూ! పది లక్షలకు ఒక్క పైసా కూడా తగ్గేలేదు. అతడు కాదంటే మరో పార్టీని చూసుకుందాం!"

సంధ్యకిచ్చిన మాట ప్రకారం, ఆమెకివ్వాల్సిన పది లక్షల కోసం ఆస్తిలో కొంత భాగాన్ని బేరం పెట్టిందామె.

జైలులో తనను కలసినప్పుడు....

"జైలునుండి విడుదలయ్యాక నన్ను మోసం చేయాలనే ఆలోచన కలలో కూడా రానీయకు.

"జైలునుండి నిన్ను తప్పించగల్గుతున్న నేను, నిన్ను మళ్ళీ సులువుగా జైలుకు పంపించగలననే నూరు పైసల నిజం నీకు గుర్తుంటుందనే ఆశిస్తాను"—అంటూ సంధ్య

చేసిన హెచ్చరిక ఇంకా ఆమెకు గుర్తుంది.

పది లక్షల కోసం లోభపడి, మళ్ళీ జైలుపాలు కాదలచుకోలేదామె. అందుకే శేఠ్ చంపాలాల్‌కు తన ఆస్తిని అమ్మాలని చూస్తోందామె.

ఏదో చెబుదామని నోరు తెరిచిన ముకుందరావు ట్రేలో టీ కప్పులతో లోనికి వచ్చిన యువతిని చూసి ఆగిపోయాడు.

ఆ యింటిలోని పనిమనుషులంతా అతనికి తెలుసు. అయితే ఆ యువతిని మాత్రం అతడెప్పుడూ చూడలేదు. ఆమెవంక అనీజీగా చూశాడతడు.

అతని కళ్ళలోని ఆశ్చర్యాన్ని, అసహనాన్ని గమనించింది సుగుణ. చిన్నగా నవ్విందామె.

“రత్నం అని క్రొత్తగా పనిలో చేరింది లెండి. మంచి చురుకైన అమ్మాయి!” అందామె.

ట్రేలోని టీ కప్పులను టేబిల్‌పై ఉంచి, తల వంచుకొని బుద్ధిగా ఆ గదిలో నుండి వెళ్ళిపోయింది ఆ యువతి.

ఆమె వెళ్ళిపోయిన రెండు నిముషాల తరువాత.... “సరే! చంపాలాల్‌తో మాట్లాడుతాను సుగుణాదేవి!” అన్నాడు ముకుందరావు మెల్లగా.

సరేనన్నట్లు తలాడించింది ఆమె.

“ఇక వెళ్ళొస్తా” నంటూ ముకుందరావు కుర్చీలోంచి లేచాడు. మెల్లగా అడుగులు వేసుకుంటూ బయటకు నడిచాడు.

అతనివంకే చూస్తూ—

‘పనిమనిషి రత్నాన్ని చూసి లాయర్‌గా రెందుకు ఉలిక్కిపడ్డారు చెప్మా!....’ అనుకుందామె ఆశ్చర్యంగా

సుఖందరావు వెళ్ళిపోయిన పది నిముషాల తరువాత, బురఖా ధరించిన ఒక ముస్లిం యువతి సుగుణను కలుసు కోవడానికి వచ్చింది.

ఆ యువతి గూర్చి పనిమనిషి రత్నం వచ్చి చెప్ప గానే ఆలోచనలో పడిందామె.

'తనకు తెలిసినంతలో తనకు గాని, తన భర్తకు గాని ముస్లిం స్నేహితు లెవరూ లేరు. మరి ఎవరై ఉంటుంది ఈమె?' అనుకుందామె ఆలోచిస్తూ.

రత్న వెంట ఆ యువతి డ్రాయింగ్ రూమ్‌లోనికి ప్రవేశించింది. సుగుణ యెదురుగా నున్న సోఫాలో కూర్చుంది.

సుగుణకు అసహనంగా ఉంది.

'ఎవరు మీరు?' అన్నట్లు విసుగ్గా ఆ యువతి వంక చూసిందామె.

ఆ యువతి మెల్లగా తన తలపై నున్న ముసుగును తొలగించింది. ఆ యువతి వంక నమ్మలేనట్లుగా చూసిం దామె.

"సంధ్యా! మీరా!" అందామె ఆశ్చర్యంగా నోరు వెళ్ళబెడుతూ.

చిన్నగా నవ్విందామె.

అదే సమయంలో ఆ గదిలోనికి అడుగుపెట్టింది పని మనిషి రత్నం. ఆమె చేతిలోని ట్రేలో రెండు ఆరంజ్ ప్లేవరు డ్రింక్స్‌తో నింపబడ్డ అందమైన పొడవాటి గాజు గ్లాసులున్నాయి.

సంధ్య పేరును వినడంతో నే ఆమె కళ్ళు విచిత్రంగా మెరిశాయి. డ్రింక్ గ్లాసులను టేబిల్ పై సర్దుతూ ఆ యువతివంక చూసిందామె.

'సందేహం లేదు ఆమే ఈమె!' అనుకుందామె ఖాళీ ట్రేను తీసుకొని గది బయటకు నడుస్తూ.

తనను యీ యింటికి పనిమనిషిగా పంపే ముందు ఇన్‌స్పెక్టర్ జయంత్ తనతో చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి ఆమెకు.

'జైలులో యెప్పుడూ ఒంటరిగానే గడిపేదట సుగుణ! ఎవరితోనూ కలిసేది కాదట! ఎవరితోనూ మాట్లాడేది కాదట!

కాని ఒకరోజు ఒక అపరిచిత యువతితో టిఫిన్ చేస్తూ చాలా సేపు మాట్లాడిందట!

కొద్దిరోజులలో ఆ యువతి విడుదల చేయబడింది. ఆమె విడుదలయిన రెండు రోజులలోనే సుగుణ కేసు కోర్టుకు అప్పీల్ చేయబడింది.

అంటే, సుగుణ కేసు కోర్టుకు అప్పీల్ చేయించడంలో ఖచ్చితంగా ఆ యువతి పాత్ర ఉండి ఉండాలి....!

నేను లాయర్ గణపతిరావును కలుసుకున్నాను. మొదట బుకాయించినా, తరువాత నిజం ఒప్పుకున్నాడు.

సుగుణ కేసును వాదించమని తనను యెవరో ఒక యువతి ఎప్రోచ్ అయిందని చెప్పాడతను.

జైలు రికార్డ్సులో నమోదయిన ఆ యువతి పేరు సంధ్య!

షా!

సుగుణను నిర్దోషిగా నిరూపించడానికి, ఈ ఆస్తి ఆమెకు దక్కేట్టు చేయడానికి ఆడబడుతున్న ఈ అంత ర్నాటకంలోని ముఖ్య పాత్రధారి అయిన ఈ సంధ్య

అనే యువతి....యీ నాటకం ద్వారా యేదో ఆశిస్తోంది!

ఈ నాటకానికి సూత్రధారి. సుగుణా? సంధ్యా? లేక మరొకరా? అన్నది తేలాలంటే సంధ్యనూ, సుగుణనూ ఒక కంట కనిపెట్టాలి. వారి ప్రతి చర్యా, వారు మాట్లాడుకొనే ప్రతి మాటా మనకు తెలిసితీరాలి!

అంటే మనం కోటలో పాగా వేయాలి!"

తమ ప్రయత్నం వట్టిపోనందుకు, పట్టలేనంత సంతోషంగా ఉంది ఆమెకు. గుండెల్లో ఉబుకుతున్న ఉత్సాహాన్ని అదిమిపెట్టి మెల్లగా తన గదిలోనికి నడిచిందామె.

తగు చలాకీతనంతో, వచ్చిన రెండు రోజులలోనే సుగుణ మనసును ఆకట్టుకుందామె. తన కెవరూ లేరని చెప్పటంచేత ఆ భవంతిలోనే చిన్న గదిని రత్నం ఉండటానికి కేటాయించింది సుగుణ.

ఆ గదిలోకి ప్రవేశించి తలుపులు మూసి, లోపలినుండి గడియ పెట్టింది. ఆ గదిలో ఓ మూల నున్న చిన్న రేకు పెట్టెను పైకి తీసింది. పెట్టె మూతను తెరిచింది. అందులో నున్న సామగ్రి వంక తృప్తిగా చూసింది.

ఆ పెట్టెలో చిన్న టేప్ రికార్డర్ వంటి సాధనం ఉంది. దానికున్న రెండు సన్నని వైర్లు ఒక హెడ్ ఫోన్కు కనెక్టు చేయబడి ఉన్నాయి. రికార్డర్ స్విచ్ను ఆన్ చేసిందామె. ఆ రికార్డర్లోని పెద్ద స్పూల్ మెల్లగా తిరగసాగింది.

అక్కడ ...డ్రాయింగ్ రూమ్లో ఫ్లవర్ వేజ్ మధ్య ఆమె ముందే అమర్చి ఉంచిన హియరింగ్ బగ్ ద్వారా....సుగుణ, సంధ్యలు మాట్లాడుకుంటున్న ప్రతి

మాట హెడ్‌ఫోన్స్ గుండా ఆమె చెవులకు చేరు తున్నాయి. ఆ దేక్షణంలో ఆ మాటలన్నీ స్పూల్‌లో రికార్డు కాసాగాయి.

"బేరం ఈ రోజో, రేపో సెటిల్ అవుతుంది సంధ్యా! ఆ సొమ్ము చేతికి రాగానే, మీకు యిచ్చిన మాట ప్రకారం ఆ పదిలక్షలు మీకు అందజేస్తాను.

కాని...." అంటూ సందిగ్ధంగా ఆగింది సుగుణ.

"కాని....!" అదే మాటను రిపీట్ చేస్తూ, నొసలు చిట్లించి, ప్రశ్నార్థకంగా చూసింది సంధ్య.

"ఆ పదిలక్షలు మీ చేతికి రావాలంటే నా కోసం మరో పని చేయాల్సి ఉంటుంది."

"ఏమిటది?" అసహనంగా అడిగింది సంధ్య.

"నాకు ఒక వ్యక్తి వివరాలు కావాలి. అతడిప్పుడు యెక్కడున్నాడు? యేం చేస్తున్నాడు? యిన్నాళ్ళూ యెక్కడ యెలా గడిపాడు?—ఆ వివరాలను మీరు నాకు సంపాదించి పెట్టాలి!"

"ఎవరా వ్యక్తి....?" అసహనంగా అడిగింది సంధ్య.

ఒకసారి తల వాల్చి మెల్లగా...."ఆంటోనీ!" అంది సుగుణ.

"నిక్కీ! యూ మీన్ దట్ నికల్సన్!" అంటూ పక పకా నవ్వసాగింది సంధ్య.

ఆశ్చర్యంగా ఆమెవంక చూసింది సుగుణ. తన ప్రియుడు ఆంటోనీ పూర్తి పేరు ఆంటోనీ నికల్సన్ అని ఆమెకు తెలుసు. కాని, ఆంటోనీ నికల్సన్‌ను 'నిక్కీ' అని పిలవగలిగేంతటి చనువు ఆంటోనీ వద్ద సంధ్యకు యెలా యేర్పడింది?—అదీ ఆమె ఆశ్చర్యానికి కారణం.

'ఏమిటి వారిద్దరి మధ్య నున్న సంబంధం? తనకూ, ఆంటోనీకి మధ్య నున్న సంబంధమేనా?' ఆ పైన ఆలోచించలేక అసహనంగా తల విదిలించిందామె.

"ఏం? పాత ప్రియునిమీద మనసు పోతూందా సుగుణా?" చిన్నగా నవ్వుతూ అంది సంధ్య.

ఒకసారి చురుగ్గా, చిరాకుగా ఆమెవంక చూసింది సుగుణ. "కాదు!" అంది దృఢంగా.

'మరి యెందుకన్నట్లు?' ప్రశ్నార్థకంగా కనుబొమ్మలను ఎగురవేసింది సంధ్య.

"మాచే హత్య కావింపబడిన నా భర్త గోపాలరావులా వేషం వేసుకున్న మరో వ్యక్తిని కోర్టు హాల్లో ప్రత్యక్షం చేయించారు. నా భర్త యింకా సజీవుడేనని కోర్టును నమ్మించారు. నన్ను నిర్దోషిగా విడుదల చేయించారు.

ఎవరో అనామకుని శవాన్ని చూపి, రైలు ప్రమాదంలో నా భర్త గోపాలరావు ప్రమాదవశాత్తు మరణించినట్లు సాక్ష్యధారాలను సృష్టించారు. నా భర్త ఆస్తి నాకు సంక్రమించేందుకు సహకరించారు.

అంతా మీరనుకున్నట్లుగానే సవ్యంగా జరిగింది. కాని ..."—అంటూ అర్ధోక్తిలో ఆపింది సుగుణ.

"కాని, యింకేమొచ్చింది?" అంది సంధ్య అసహనంగా.

చిన్నగా నవ్వింది సుగుణ.

"ఇన్ని జాగ్రత్తలు తీసుకున్న మీరు ఒకే ఒక్క విషయాన్ని నిర్లక్ష్యం చేశారు సంధ్యా!

నిజానికి నా భర్త ముఖాన్ని దిండుతో అదిమి, ఊపి

రాకుండా చేసి, హత్య చేసింది నేను కాదు. ఆంటోనీ. నేను కేవలం నా భర్త కాళ్ళూ, చేతులూ కదపకుండా గట్టిగా పట్టుకున్నానంతే!

ఈ రోజు కోర్టు నన్ను నిర్దోషిగా తీర్పునిచ్చి విడుదల చేసినా, అసలు హంతకుడు ఆంటోనీ బ్రతికున్నంత వరకూ ఈ కేసు పూర్తిగా మాసిపోనట్లేగా!”

ఆమె మాటలకు పకపకా నవ్వింది సంధ్య.

“ఆ మాత్రం మేం ఊహించలేదంటావా సుగుణా? ఆంటోనీ గూర్చి నీకే చింతా వద్దు!”

అర్థం కానట్టు చూసింది సుగుణ మరోసారి సన్నగా నవ్వింది సంధ్య.

“నీ భర్త గోపాలరావులా కోర్టు హాల్లో ప్రత్యక్షమయింది ఎవరనుకుంటున్నావ్?

“నీ మాజీ ప్రియుడు ఆంటోని!

రైలుపట్టాలపై మాంసపు ముద్దలా కనుగొనబడిన ఆ శవం. నీ భర్త గోపాలరావుదేనని పోలీసులను సైతం నమ్మించిన ఆ శవం ..ఎవరిదో అనామకుడిది కాదు!.... ఆంటోనీది!”

నమ్మలేనట్లు చూసింది సుగుణ! ఆ గదిలో గాలి కూడా ఒక్క క్షణం పాటు స్తంభించి నట్లనిపించింది ఆమెకు.

హెడ్ ఫోన్స్ ద్వారా వారి మాటలను ఆలకిస్తున్న రత్నం గొంతులోని తడి ఆరిపోయింది.

అందంగా అమాయకంగా కనిపించే ఈ యువతులలో యింతటి రాక్షసత్వం దాగివుందంటే___నమ్మ బుద్ధి కావటంలేదు ఆమెకు.

కాని నమ్మకుండా ఎలా ఉండగలదు?

కేవలం డబ్బుకోసం తాళికట్టిన భర్తనూ, కోరుకున్న ప్రియుడ్ని దారుణంగా చంపిన యిద్దరు యువతులు.... ఆ ప్రక్క గదిలోనే హాయిగా నవ్వుకుంటూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

వారిని చూస్తూ వారి మాటలను వింటూ కూడా ఎలా నమ్మకుండా ఉండగలదు ఆమె!

## 11

రాత్రి పన్నెండు గంటలు కావస్తోంది. కృష్ణపక్షమి రోజులు కావటంచేత చీకటి చిక్కగా అలుముకుంది.

డ్రయివ్ చేస్తున్న కారును స్లో చేసింది సుగుణ. కారు హెడ్‌లైట్ల కాంతిలో పచ్చగా మెరుస్తోంది రోడ్డు ప్రక్కగా ఆర్ అండ్ బి వారు పాతిన మైలు రాయి. దానిపై నల్లని రంగులో పెయింట్ చేయబడ్డ పదిహేను అన్న సంఖ్య కొట్టవచ్చినట్లు కన్పిస్తూంది.

ఆ మైలురాయి ప్రక్కనుండి ఒక మట్టిబాట కన్పిస్తోంది. కారును మెల్లగా టర్న్ చేసి ఆ మట్టిబాటపైకి పోనిచ్చిందామె.

ఆ బాట కిరువైపులా జీబురుగా పెరిగిన చెట్లు ఆ ప్రదేశాన్ని మరింత చీకటి చేస్తున్నాయి. ఏదో పక్షి వికృతంగా అరుచుకుంటూ కారు పైగుండా ఎగురుకుంటూ పోయింది.

సీటు పైనున్న తోలుపెట్టెవంక చూసిందామె. అందులో చంపాలాల్ కు ఆస్తిని అమ్మగా వచ్చిన పది లక్షల కరెన్సీ నీట్ గా పేర్చబడి వుంది.

సహజంగా ఎంతో ధైర్యవంతురాలయిన సుగుణకు కూడా, ఆ చీకటిలో అంత సొమ్ముతో, ఒంటరిగా ప్రయాణం సాగించటం కాస్త భయాన్ని కల్గించ

సాగింది.

పమిటచెంగు చాటున, బొడ్లో దోపుకున్న రివాల్వర్ ను ఒక్కసారి తడిమి చూసుకుంటోందామె. చల్లని ఆ రివాల్వర్ చల్లగా చేతికి తగిలేసరికి ఆమెలో భయం కాస్త తగ్గింది.

ఆమె ఏకాగ్రతతో డ్రయివ్ చేస్తోంది. సుమారు రెండు కిలోమీటర్ల దూరం ఆ బాటలో ప్రయాణించి ఉంటుందామె. రోడ్డు కిరువైపులా దట్టమయిన తీడి తోపు ప్రారంభమయింది. ఆ తోపు వంక సాలోచనగా చూసిందామె.

అదే సమయంలో....

ఆ తోపులోని ఓ మూల....పారతో నేలను త్రవ్వుతున్నాడొక వ్యక్తి. చెమటతో అతని షర్టు పూర్తిగా తడిసి ఉంది. ఆయాసంతో బరువుగా ఊపిరి తీస్తున్నాడతడు. అయినా త్రవ్వటం ఆపటం లేదు. నిర్విరామంగా పారతో మట్టిని తీసి ప్రక్కకు వేస్తూనే ఉన్నాడు.

'మరి కొద్ది నిముషాల్లో పదిలక్షల రూపాయలు తన స్వంతం కాబోతున్నాయన్న ఆనందం' అతనికి ఎక్కడలేని ఉత్సాహాన్ని కలుగజేస్తోంది.

మరి కొద్ది నిముషాలలో అతడు త్రవ్వటం పూర్తి చేశాడు. గోతిలోనుండి బయటకువచ్చి నిలబడ్డాడు. ఒక్కసారి తను తవ్విన గోతి వంక సంతృప్తిగా చూసుకున్నాడు.

అరడుగుల పొడవు, మూడడుగుల వెడల్పు, నాలుగడుగుల లోతులతో, ఎరను మింగడానికి సిద్ధంగా నోరు తెరచుకొని కూర్చున్న కొండచిలువలా వుంది ఆ గొయ్యి.

ఒక వికృత హాసంతో అతని పెదవులు మెల్లగా విచ్చుకున్నాయి చేతికి అంటిన మట్టిని దులుపుకుంటూ మెల్లగా ఆ తోపులోనికి నడిచాడతడు.

అక్కడ....

డ్రయివ్ చేస్తున్న కారును టక్కున ఆపింది సుగుణ. ఎదురుగా రోడ్డు ప్రక్కనున్న చెట్టుక్రింద నిలబడి ఉంది ఒక యువతి.

ఆమె మెల్లగా రోడ్డుపైకి వచ్చింది. ఇప్పుడు కారు హెడ్ లైట్స్ కాంతిలో ఆమె స్పష్టంగా కన్పిస్తూంది.

ఆమె....సంధ్య!

కారు డోరు తెరచుకొని సుగుణ క్రిందకు దిగింది వారిద్దరూ ఒకరినొకరు సాభిప్రాయంగా చూసుకున్నారు. అంతే!

కారులోనున్న లెదర్ సూట్ కేసును సంధ్యకు అందించిందామె. ఒక్కసారి ఆ పెట్టెమూత తెరచి చూసుకొంది సంధ్య. తరువాత ఇద్దరూ సాదరంగా షేక్ హాండ్స్ యిచ్చుకొని విడిపోయారు.

కనీసం ఒక్కమాట కూడా మాట్లాడుకోలేదు వారు. నిజానికి మాట్లాడుకోవడానికి ఏమీ లేదు కూడానూ!

ఆ క్షణంతో వారిద్దరి మధ్యానున్న ఒప్పందం పూర్తయింది. ఆ క్షణంనుండీ ఆమె ఎవరో ఈమెకు తెలియదు. ఈమె ఎవరో ఆమెకు తెలియదు. వారు ఒకరి గురించి మరొకరు పూర్తిగా మరచిపోవాలి!

అదీ వారి క్రొత్త ఒప్పందం! తమ ఒప్పందాన్ని వారు ఆ క్షణం నుండే సిన్సియర్ గా పాటించారు.

సూట్ కేసును చేతో పట్టుకొని, మెల్లగా నడుచుకుంటూ ఆ తోపులోనికి వెళ్ళిపోయింది సంధ్య. ఆమె

కనుమరుగయ్యేంత వరకూ చూసి, మెల్లగా కారువైపుకు నడిచింది సుగుణ.

కారును సమీపించి, కారు డోర్‌పై చేయి వేసింది. అంతలో ఏదో చల్లగా ఆమె మెడకు తగిలింది. ఉలిక్కిపడి చూసిందామె.

ఎదురుగా చేతిలో రివాల్వర్‌తో చిరునవ్వులు చిందిస్తూ నిలుచున్న యువతి వంక నమ్మలేనట్లు చూసింది.

"నీవా!" అందామె ఆశ్చర్యంగా.

అక్కడ....

ఎదురుగా నడుచుకుంటూ వస్తున్న అతనివంక ఉత్సాహంగా చూసింది సంధ్య. అతని చూపులు ఆమె చేతిలోని సూట్‌కేసుపై పడ్డాయి. ఆనందంతో అతని ముఖం విప్పారింది.

"వుయ్ గాటిట్ బాస్! వుయ్ గాటిట్!"—ఒక్క పరుగున అతన్ని సమీపించి, ఆనందంతో అతన్ని అల్లుకు పోయిందామె.

ఒక చేతో ఆమె చేతిలోని సూట్‌కేసును అందుకొని మరో చేతిని ఆమె నడుం చుట్టూ వెనవేసి, హత్తుకొని ఆమెను మెల్లగా నడిపించసాగాడతడు.

గాలిలో తేలిపోతున్నట్లుగా వుంది ఆమెకు. తాము అనుభవింపబోయే అరిస్టోక్రాటిక్ లైఫ్ గూర్చి కలలు కంటూ, అతని గుండెలపై తలవాల్చి, అన్నీ మరచి మైమరపుతో అడుగులు వేస్తూంది ఆమె.

ఆ మైమరపులో తామెక్కడకు వచ్చిందికూడా గమనించలేదామె. మెత్తని ఇసుకలో పాదాలు కూరుకు పోయే సరికి ఉలిక్కిపడిందామె.

ఎదురుగా ఆరడుగుల గొయ్యి!

అదే క్షణంలో విసురుగా ఆమెను గోతిలోనికి తోశాడతడు. గోతిలో వెల్లకిలా పడిన ఆమె వంక చూస్తూ క్రూరంగా నవ్వాడతడు. అతని చేతిలోని రివాల్వర్ ఆమె వంక ఆకలిగా చూస్తోంది.

రివాల్వర్‌ను చూస్తూనే రక్తం ఇంకిపోయినట్లుగా తెల్లగా పాలిపోయింది ఆమె ముఖం. భయంతో ఆమె పెదిమలు వణుకుతున్నాయి.

"సారీ సంధ్యా!

నిన్ను చంపక తప్పటంలేదు.

ఈ నాటకంలో తెరమీద కన్పించిన పాత్రవు నీవు. తెర వెనుక సూత్రధారిని నేను!

కాని, ఆ నిజం బయటపడకుండా ఉండాలంటే- ఆ నిజాన్ని తెలిసిన నీవు. ఆ నిజంతో పాటు శాశ్వతంగా సమాధి కాక తప్పదు!"

అంటూ చేతిని ముందుకు సాచాడు అతడు. రివాల్వర్ ట్రిగర్ పై అతని చూపుడు వేలు బిగుసుకుంటోంది.

అక్కడ....

"నీవా రత్నం!" అందామె ఆశ్చర్యంగా.

"నే....ఇన్‌స్పెక్టర్ రత్నమాలా! సుగుణా!" అంది రత్నం చిన్నగా నవ్వుతూ.

కరెంట్ షాక్ కొట్టినట్లనిపించింది ఆమెకు. ఆ నిజాన్ని జీర్ణం చేసుకొనేలోగానే రత్నమాల చెప్పటం ప్రారంభించింది.

"జరిగినదంతా మాకు తెలుసు సుగుణా! ఆ నిజాల్ని గ్రహించటానికే.... నేను మీ దగ్గర పనిమనిషిగా చేరినది.

ఆ రోజు మీరూ, సంధ్యా మాట్లాడుకున్న ప్రతి

అక్షరమూ రికార్డు చేయబడింది. నా యూ కాస్ట్ ఎస్కేప్ ఫ్రం ద కోర్టు ఆఫ్ లా.

కావాలనుకుంటే మిమ్మల్నిద్దరినీ ఆ క్షణమే అరెస్టు చేసి ఉండేవారం. కాని ఈ నాటకాన్ని ఆడిస్తున్న అసలు సూత్రధారి కోసం యిన్నాళ్ళూ ఆగాల్సి వచ్చింది!"

తన చుట్టూ ఉన్న ప్రపంచం ఒక్కసారిగా గిర్రున తిరుగుతున్నట్లు అనిపించింది సుగుణకు. మళ్ళీ తన బ్రతుకు జైలుపాలేనన్న నిజాన్ని తట్టుకోలేక, అక్కడే కుప్పకూలి పోయిందామె.

అక్కడ....

"ముకుందరావ్!" పిచ్చిదానిలా గట్టిగా అరిచింది సంధ్య. "నన్ను చంపి నీవు తప్పించుకోలేవు ముకుంద రావ్! నీవు ఊహిస్తున్నట్లుగా ఆ నిజం నాతో పాటు సమాధి కాదు. నీవు సంకెళ్ళు వేయించి ఉరికంబానికి ఎక్కిస్తుంది."

మ్లానమైన ముఖంతో ఆమెవంక బెదురుగా చూశా డతడు'

హేళనగా నవ్విందామె.

"ఆ రోజు రాత్రి....

గోపాలరావు రూపంలో నున్న ఆంటోనీని రైలు పట్టాలవద్ద నీవు హత్య చేసి, ఆ శవాన్ని చితుకగొట్టి, పట్టాలకు అడ్డంగా పడేయటాన్ని రహస్యంగా ఫోటోలు తీశాను నేను.

అవి.... నా ఫ్రెండ్ దగ్గర భద్రంగా ఉన్నాయి. రెండురోజులు గనుక నేను వరుసగా ఆమెను కలియ కుంటే, ఆ ఫోటోలను పోలీసులకు అందజేయమని చెప్పి

ఉంచాను నేను.

నీ వెంత దుర్మార్గుడివో నాకు తెలుసు ముకుందరావ్! అవసరం తీరాక అంటోనీని అమానుషంగా హత్య చేసిన నీవు, ఆ రహస్యం తెలిసిన నన్ను మాత్రం విడిచిపెడతా వన్న నమ్మకం ఏమిటి?

అందుకే నీ బ్రతుకును ప్రోచెప్పే ట్రంపు కార్డును నా దగ్గరుంచుకున్నాను. మర్యాదగా మన ఎగ్రిమెంటు ప్రకారం నా అయిదు లక్షలనూ నాకు పంచియివ్వు. లేదంటే...."—అంటూ అర్ధోక్తిలో ఆపి చిన్నగా నవ్విందామె.

ఆమె మాటలకు నల్లగా మాడిపోయింది అతని ముఖం. "యూ బ్లడీ బిచ్!" అనుకుంటూ కసిగా పళ్ళు కొరుక్కున్నాడతడు.

అదే క్షణంలో రెండు శక్తివంతమైన సెర్చిలైట్ల కాంతి వారిమీదకు ప్రసరించింది.

"డ్రాప్ ద రివాల్వర్ ముకుందరావ్! నౌ యూ కాన్ట్ ఎస్కేప్!"—ఖంగుమని వినిపించిన కంఠధ్వని వంక కంగారుగా చూశారు వారు.

పది అడుగుల దూరంలో నున్న పొదల చాటునుండి మెల్లగా అడుగులు వేసుకొంటూ తమని సమీపిస్తోన్న ఇన్ స్పెక్టర్ జయంత్ వంక తెల్లబోతూ చూశారు వారు. ఇన్ స్పెక్టర్ చేతిలో కొట్టవచ్చినట్లు కన్పిస్తోన్న టేప్ రికార్డర్ను చూసేసరికి అతని నరనాడులూ కృంగిపోయాయి.

తప్పించుకొని పారిపోదామన్న ఆలోచన ఏమయినా వారిలో మిగిలి ఉంటే....అది కాస్తా....

రైఫిల్స్ను బారు చేసుకుని పొదలను ముట్టుకుంటూ

తనను చుట్టుముడుతున్న పోలీసుల్ని చూసేసరికి అంతరించిపోయింది.

అతని ప్రమేయం లేకుండానే ముకుందరావ్ చేతిలోని రివాల్వర్ నేలకు జారిపోయింది.

చేష్టలు దక్కి వెర్రిదానిలా ఆ గోతిలోనే శూన్యంలోకి చూస్తూ నిలుచుండిపోయింది సంధ్య.

నిశ్శబ్దాన్ని చీలుస్తూ జయంత్ కంఠం కంచులా మ్రోగింది.

"నేను మొదటి నుండీ ఈ నాటకం వెనుక యెవరో ఒక సూత్రధారి ఉన్నాడని అనుమానిస్తూనే వచ్చాను.

ఆ రోజు.... కోర్టులో....

సుగుణ పేరున తన యావదాస్తినీ ఆమె భర్త వీలునామా వ్రాసినట్లు, ఆమె భర్త మరణించినంత వరకూ ఆమెకు తెలియదని—మీరు సాక్ష్యం యిచ్చినప్పుడే మిమ్మల్ని అనుమానించాను.

రైలు పట్టాలపై శవం లభించిన ముందురోజు రాత్రి గోపాలరావుగారు మీకు ఫోన్ చేశారని, మిమ్మల్ని కలిసి విల్లుమార్చమన్నారని, పాత విల్లు నకలును ఆయనకు మీరందజేశారనీ—మీరు నాతో చెప్పినప్పుడు ఆ అనుమానం మరింత బలపడింది.

రైలుపట్టాలపై ప్రమాదంలో గోపాలరావు మరణించినట్లుగా నన్ను నమ్మించడానికి ప్రయత్నించారు మీరు. ఏమిటి మీకు ఇందులో లాభిస్తున్నదని ఆలోచించాను నేను. అనుమానం మీపై స్థిరపడినా మిమ్మల్ని దోషిగా నిరూపించడానికి సాక్ష్యాధారాలు కావాలిగా!

అందుకే ఇంతకాలం వేచి వున్నాను."

—ఆపై ఇన్‌స్పెక్టర్ చెబుతున్న మాటలేవీ అతనికి

వినిపించలేదు.

అతనికి తెలిసిపోయింది. అంతటితో తమ నాటకానికి తెర పడబోతుందని.

'నేరస్థుడు యెంత తెలివైన వాడైనా యెప్పుడో, ఒకప్పుడు చట్టానికి దొరక్కపోడు ముకుందరావ్!' సంకెళ్ళతో అతని చేతులను బంధిస్తూ అన్నాడు ఇన్‌స్పెక్టర్ జయంత్.

—: అయిపోయింది :—

# అంతర్జాతీయ నేరస్థులు

## వి.యస్.పి. తెన్నేటి

వాషింగ్ టన్.

నార్త్ బ్లాక్....ఎమిలీ ఎపార్టుమెంట్స్.

ఎర్రని జర్కిన్ ధరించిన ఆరడుగుల ఆజానుబాహుడు మూడో అంతస్థులో వున్న నూటఎనభై ఐదో ఎపార్టుమెంట్ ముందు నిలబడి కాలింగ్ బజర్ మీద చెయ్యి వేస్తూ తలుపుమీద వున్న నేమ్ ప్లేట్ వైపు చూపు సారించాడు.

'విలియమ్ ఎడ్వర్డ్స్....' అక్షరాలు మెరుస్తున్నట్లున్నాయి.

కాలింగ్ బెల్ మోతకి.... ....లోపలనుంచి యెవరో వస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది. తలమీద వున్న టోపీని సర్దుకొని ఊపిరి బిగపట్టి నిల్చున్నాడు.

క్లిక్ మంటూ తలుపు తెరుచుకుంది.

ఎదురుగా లావుగా పొట్టిగా వున్న బట్టతల మనిషిని చూడగానే 'గుడ్ ఈవినింగ్ సర్' అన్నాడు జర్కిన్

వాలా.

అతను నొసలు చిట్లించి చూశాడు.

"విలియమ్ ఎడ్వర్డ్స్ వున్నాడా?" అడిగాడు జర్కిన్ వాలా.

"లేరు—" కటువుగా ధ్వనించింది అతని కంఠం.

"మేడమ్....?"

"లేరు—" అంటూ తలుపు మూసెయ్యబోతూ వుండగా—

"నేను టెలిఫోన్ డిపార్టుమెంట్ నుంచి వచ్చాను— మీ ఫోన్ సరిగ్గా....పని చెయ్యలేదని, కాల్స్ డిస్టర్బ్ అవుతున్నాయని కంప్లయింట్ ఇచ్చారు—" అన్నాడు వెంటనే.

"నిన్ననే వచ్చి రిపెయిర్ చేశారుగా?" అన్నాడు బట్టతల వ్యక్తి.

"అదే నేనూ ఆశ్చర్యపోయాను. మళ్ళీ ఈ రోజు కూడ కంప్లయింట్ చేశారు...." అన్నాడు అజాను బాహుడైన ఆ ఎర్రజర్కిన్ యువకుడు.

"ఐ సీ—ఐతే వచ్చి చూడండి—" అన్నాడతను లోపలకి తప్పుకుంటూ.

'అతని పేరు జాన్ పింటో అయ్యుండాలి. విలియమ్ ఎడ్వర్డ్స్ లేనప్పుడు అతని భార్య మోనికా ఎడ్వర్డ్స్‌ని కాపలా కాస్తున్న వ్యక్తి....' మనసులోనే అనుకుంటూ లోపలకి నడిచాడు ఆ యువకుడు.

టెలిఫోన్ కోసం చూస్తున్నట్లుగా నే చూస్తూ ఇల్లంతా పరీక్షగా గమనించాడు. లోపల గదిలోకి తీసుకెళ్ళి టెలిఫోన్ వైపు చూపించాడు ఆ బట్టతల వ్యక్తి....

టెలిఫోన్ దగ్గరకొచ్చి-తినవీపుమీదున్న చిన్న తోలు

కుంచి తీసి, అందులోంచి చిన్న స్క్రూడ్రయివర్ లాంటి ఇతర పనిముట్లు తీసి—పక్కన పెట్టాడు.

టెలిఫోన్ని అందుకుని....డిజిటల్ నెంబర్లు నొక్కి చూశాడు.

దౌడుతీస్తున్న గుర్రాల తైలవర్ణచిత్రం వుంది.

“హలో—హలో—” అంటూ కాస్సేపు పరీక్ష చేస్తున్నట్లు నటించి, బట్టతలవైపు తిరిగి “అంతా బాగానే వుంది. చిన్న చప్పుడు వస్తోందంతే—” అన్నాడు. స్క్రూడ్రైవర్తో ఫోన్ తెరిచి, ఏదో రిపెయిర్ చేసినట్లు నటించి....మళ్ళీ ఫోన్ యథాప్రకారం పెట్టేశాడు.

అతనివైపు తిరిగి మంచినీళ్ళు కావాలని అడిగాడు. అతను లోపలకు వెళ్ళగానే ఇటూ అటూ చూసి, తన జేబులో సిద్ధంగా వున్న మినీయేచర్ మైక్రోఫోన్ని అతి వేగంగా గోడకున్న దౌడుతీస్తున్న గుర్రాల చిత్రంమీద ఎంతో నేర్పుగా—ఒక మూల ఫిక్స్ చేసేశాడు. అది కూడా—గోడమీద వేలాడుతూ, ఆ చిత్రం అంచు మీదకి ప్రాకిన మనీప్లాంట్ మాటున వుండిపోయింది. మరో రెండు నిముషాల తర్వాత ఆ బట్టతల వ్యక్తి వచ్చి ఇచ్చిన మంచినీళ్ళు తాగి, అక్కడనుంచి బైటపడ్డాడు.

ఎమిలీ ఎపార్టుమెంట్స్కి పదడుగుల దూరం వరకు నడిచిన తర్వాత కింగ్ సర్కిల్ దగ్గర టాక్సీ యెక్కి ‘హోటల్ షెర్రీ’కి చేరుకున్నాడు. ఆ హోటల్లో తన రూంకి చేరుకుని—నిలువుటద్దంలో తన రూపాన్ని చూసుకుని చిరునవ్వు నవ్వుకున్నాడు. ఎర్రజర్కిన్, తలమీదున్న టోపీ తీసేసి....మంచంమీద కూర్చుంటూ, జేబులోంచి కెంట్ సిగరెట్ ప్యాకెట్, చిన్న అగ్గిపెట్టె అశా

రంలో వున్న మైక్రో రిసీవర్ ఫోన్ బైటికి తీసాడు.

ఇప్పుడతనికి ఎమిలీ ఎపార్టుమెంట్స్‌లో విలియమ్ ఎడ్వర్డ్స్ ఇంట్లో చీమ చిటుక్కుమన్నా వినిపిస్తుంది.

ప్రతి పదినిముషాలకి ఓసారి తన చేతిలో వున్న మైక్రోఫోన్ ఆన్ చేసి వింటున్నాడు. ఓసారి గట్టిగా యువతి 'విలియమ్' అని అరిచిన అరుపు వినిపించింది. ఏదైనా ముఖ్యమైన విషయం వినిపిస్తుందేమోనని ఆతృతగా నిరీక్షిస్తున్నాడా యువకుడు.

అంతకంటే ఏం చెయ్యాలన్న మార్గం తోచలేదు తనకి ...

మూడు రోజుల క్రితం భారతదేశపు రాజధాని నగరం న్యూఢిల్లీలో సి.బి.ఐ. చీఫ్ బ్రహ్మాజీరావు తనతో చెప్పిన విషయాలు పదేపదే అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

# 2

“మిస్టర్ కిషోర్! పన్నెండు సంవత్సరాలుగా మృత్యువుతో చెలగాటాలాడుతూ ఎందరో నరరూప రాక్షసుల ఆటలు కట్టించి చట్టానికి అప్పగించిన భారతదేశపు ప్రతిష్ఠాత్మకమైన గూఢచారి రామరాజు — ఏజెంట్ నెం సెవెన్ — అతి దారుణంగా హత్య చేయబడ్డాడు!” అని సి.బి.ఐ. బ్రహ్మాజీ రావు గాద్గదికంగా చెప్పినప్పుడు నిర్ఘాంతపోయాడు కిషోర్.

“ఏమిటి సర్! రామరాజు హత్యచేయబడ్డాడా? ఆరితేరిన నేరస్థుల పాలిట సింహస్వప్నం కాకలు తీరిన మొనగాళ్లనే తలదన్నిన మొనగాడు— రాజుని చంపగలిగిన వాళ్లెవరు సార్?” అన్నాడు కిషోర్ నమ్మలేనట్లు.

"కాస్మోక్రాట్స్ సొసైటీ!" ఖంగుమంది సి.బి.ఐ. చీఫ్ కంఠం.

పిడుగుపడినట్లు అదిరిపడ్డాడు కిషోర్.

"ఆ సంస్థ గురించి నీకేం తెలుసు? తిరిగి ప్రశ్నించాడు బ్రహ్మాజీ రావు."

జ్ఞాపకాల పొరల్ని చీల్చుకొని వచ్చాయి కిషోర్ మాటలు—

"ఎప్పుడో 1937 లో అనుకుంటాను ...అంటే నేను పుట్టక పూర్వం.... యూరప్ లో ఏడుగురు అటి తేరిన అంత ర్జాతీయ నేరస్థులు కలిసి స్థాపించిన సంస్థ పేరు కాస్మో క్రాట్స్ సొసైటీ అని నాకు గుర్తు—" అన్నాడు కిషోర్.

"కరెక్ట్—ఇంకా?"

"ఏడు సంవత్సరాలపాటు దక్షిణ రొడీషియా, స్పెయిన్ ప్రాంతాలలో విచ్చలవిడిగా దోపిడీలు, హత్యలు చేసి ప్రపంచ గూఢచారి దళాలనే భయ భ్రాంతుల్ని చేసారని, ఆ తర్వాత ఇంటర్ పోల్ ఏజెంట్స్ రంగప్రవేశం చెయ్యటంతో 1945 ఆగస్టు నెలలో పారిస్ లో రహస్య సమావేశానికి హాజరైన ఆ ఏడుగురు ముఠా నాయకుల్ని అరెస్టు చేసి, కొన్నాళ్ళ తర్వాత ఉరి తీయటం జరిగింది! ఆ తర్వాత మళ్ళీ 979 వరకు ఆ ముఠా పేరు ఎక్కడా వినిపించలేదు!

కానీ సెవెంటీనైన్ లో న్యూయార్క్ లో యెవరో కొంతమంది ఆ సంస్థను మళ్ళీ ప్రారంభిస్తూ యేదో ఆకాశ రామన్న కరపత్రం అన్ని దేశాలకి పంపించారని విన్నాను. అంతే. అంతకంటే నాకు మరేటువంటి సమా చారం తెలీదు!" అన్నాడు కిషోర్.

సి.బి.ఐ. చీఫ్ సాలోచనగా తలపంకించి, ఒక ఎర్రని

ఫైలు తీసి కిషోర్ ముందుకు తోసాడు.

"గత సంవత్సరం జూలై మాసంలో నార్త్ కొరియా దేశపు రాజధాని నగరం ప్యోంగ్ యాంగ్ లో ఒక 'ఎటామిక్ రీసెర్చ్ సెంటర్'లో రహస్య విభాగంలో భద్రపరచిన సీక్రెట్ డాక్యుమెంట్స్‌ని అపహరించి 'కాస్మోక్రాట్స్ సొసైటీ' అనే అక్షరాలున్న చిన్న కార్డుని అక్కడ వదిలిపెట్టడంతో సంచలనం ఆరంభ మయ్యింది.

మరో వారం రోజుల తర్వాత టర్కీ దేశపు రాజ ధాని అంకారాలో 'పీపుల్స్ సేవింగ్స్ కార్పొరేషన్' అధినేత జాకీరూజ్ వెల్టుని దారుణంగా హత్యచేసి ఇరవై ఏడు మిలియన్ డాలర్స్ కరెన్సీని అపహరించినట్లు అమెరికన్ సి.ఐ.బి. గూఢచారి సంస్థ వెల్లడిచేసింది. అక్కడ కూడా ఆ సొసైటీ కార్డు లభించడంతో అల్ల కల్లోలం చెలరేగింది! వివిధ దేశాల గూఢచారి దళాలన్నీ రంగంలోకి దిగాయి. రష్యన్ కె. జి. బి. గూఢచారి విభాగం వెల్లడిచేసిన విషయాలు యావత్ ప్రపంచాన్ని విస్మయంలో ముంచెత్తాయి" అన్నాడు బ్రహ్మాజీరావు.

"ఏమిటా విషయాలు?" ఆత్రంగా అడిగాడు కిషోర్.

"కాస్మోక్రాట్స్ సొసైటీలో ప్రస్తుతం ఏడున్నర లక్షలమంది సభ్యులున్నారనీ, ఆసంస్థ ప్రపంచవ్యాప్తంగా శాఖోపశాఖలుగా అన్ని దేశాలలోనూ తమ రహస్య విభాగాలు నెలకొల్పుకున్నదనీ, ఈ సంస్థకు దేశంలోని ప్రముఖ వ్యక్తుల మద్దతుకూడా వుందనీ తెలియజేస్తోంది!"

"మైగాడ్!" తన చెవులని తానే నమ్మలేనట్లు అన్నాడు కిషోర్.

"ఔను కిషోర్! ఎన్నో సంవత్సరాలుగా అండర్ గ్రౌండ్ ప్రపంచంలో అగ్రశ్రేణి నేరస్థుల ముఠాలుగా కీర్తిగణించిన మాఫియా, ఫీజర్స్, లియోనార్స్, యు.సి.క్ష సి. లాంటి క్రిమినల్ ఆర్గనైజేషన్స్‌నే ఆశ్చర్యాందోళనల్లో ముంచెత్తేస్తూ యిలో 'కాస్మోక్రాట్స్ సొసైటీ' రోజురోజుకీ రూపుదిద్దుకుంటోంది. యు.ఎన్.ఓ. (యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్) తన అత్యవసర సమావేశంలో వివిధ దేశాల గూఢచారి దళాలకి విజ్ఞప్తి చేసింది—'కాస్మోక్రాట్స్ సొసైటీ'ని సమూలాగ్రంగా నాశనం చెయ్యటానికి ప్రతిఒక్కరూ ముందంజ వెయ్యకపోతే మరో దశాబ్దంలోగా ఈ అంతర్జాతీయ నేరస్థుల ముఠా ప్రపంచాధిపత్యం సాధించగలిగినా ఆశ్చర్యం లేదని!" అన్నాడు సి.బి.ఐ. చీఫ్ బ్రహ్మాజీరావు ఆందోళనగా.

కిషోర్ మెడమీద వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

"వీల్లేదు బాస్! అలా జరగటానికి వీల్లేదు!" ఆవేశంగా అన్నాడు.

"అదే పట్టుదలతో మన గ్రేడ్ వన్ గూఢచారి రామరాజు గత నెల పన్నెండో తారీఖున వాషింగ్‌టన్ వెళ్ళాడు. అక్కడి కెళ్ళిన వారం రోజుల్లోనే యెంతో ఆసక్తికరమైన విషయాలను కనుగొన్నాడు. వాషింగ్‌టన్‌లో ఈ ముఠా మత్తుపదార్థాల సరఫరాని ప్రధానాంశంగా పెట్టుకొని, ఉన్నత పదవుల్లో వున్న రాజకీయ నాయకుల్ని హస్తగతం చేసుకోవాలని తీవ్రంగా ప్రయత్నిస్తోందని తెలియజేసాడు.

ఆ తర్వాత మరో వారం రోజుల తర్వాత మరికొన్ని

ఆశ్చర్యకరమైన రహస్యాలను కోడ్‌లో పంపించాడు! మరో నెలా పదిరోజుల్లో వాషింగ్‌టన్‌లోని కాస్మో క్రాట్స్ సొసైటీ విభాగాన్ని అంతం చెయ్యగలడనే ఆశాభావం కలిగింది! అంతలోనే — రామరాజుని వాషింగ్‌టన్‌లోని ఒక హోటల్ గదిలో నిర్దాక్షిణ్యంగా హత్య చేసి, అతని శరీరాన్ని ముక్కలుగా కోసి—ఆ తర్వాత తీసిన ఫోటోని రకరకాల భంగిమల్లో ప్రింట్ చెయ్యించి మనకి పంపించారు! చూడు కిషోర్! ఈ ఫైల్లో రామరాజు సేకరించి పంపించిన రహస్యాలు అతను చచ్చిపోయిన తర్వాత తీసిన ఫోటోలు వున్నాయి!" అన్నాడు బ్రహ్మాజీరావు.

అప్పుడు చూశాడు కిషోర్ ఆ నరరూప రాక్షసుల దురాగతానికి బలైపోయిన రామరాజు ఫోటోలని....! అతను పంపించిన సమాచారం ద్వారా రామరాజు వాషింగ్‌టన్‌లోని 'హోటల్ షెర్రీ'లో బస చేశాడని, ఆ ముఠా ఆచూకీ పూర్తిగా తెలియలేదని, కానీ, ఆ ముఠాతో సంబంధబాంధవ్యాలున్న 'విలియమ్ ఎడ్వర్డ్స్' అనే వ్యక్తి ద్వారా కొంత సమాచారం తెలియవచ్చుననీ రాశాడు.

అతను రాసిన ఒక ఉత్తరం కిషోర్‌కి కుతూహలం కలిగించింది. తను మనసారా ప్రేమించి పెళ్ళి చేసుకున్న మోనికా అనే అమ్మాయికి ఎవరితోనో అక్రమ సంబంధ ముందనే అనుమానంతో జాన్ పింటో అనే ఒక మనిషిని తన భార్యకే కాపలాగా ఉంచటం కొన్ని వింత వింత అనుమానాలు రేకె త్తిస్తున్నాయని, తన అంచనా నిజం అయితే కాస్మోక్రాట్స్ సొసైటీ ఆచూకీ మరో వారం రోజుల్లో తెలిసిపోతుందని రాశాడు. అదే ఆఖరి

మెసేజ్. ఆ తర్వాత రెండ్రోజులకి అతను చంపబడ్డాడు!

"కాబట్టి కిషోర్! కాస్మొక్రాట్స్ సొసైటీ అంతు చూడటానికి, రామరాజుని చంపిన రాక్షసుల్ని అంతం చెయ్యటానికి నిన్ను వాషింగ్‌టన్ పంపించాలని నిశ్చయించటం జరిగింది. ఈ విషయంలో హోం మినిస్టర్ గారి నుంచి కూడా ఆర్డర్స్ లభించాయి!" అని చెప్పినప్పుడు ఆయనవైపు పట్టుదల నిండిన కళ్ళతో చూస్తూ—

"నా ప్రాణం పోయినా సరే....కాస్మొక్రాట్స్ సొసైటీని కూకటి వ్రేళ్ళతో సహా పెకిలించి పారెయ్యటానికి నా కొన వూపిరి వున్నంతవరకు పోరాడతాను" అని ప్రతిజ్ఞ చేశాడు.

"నీ మీద నాకు పూర్తి నమ్మకం వుంది కిషోర్! కానీ కాస్మొక్రాట్స్ సొసైటీని తక్కువగా అంచనా వెయ్యకు! నీ ఒళ్ళంతా జల్లెడ చెయ్యగల ఆరితేరిన ప్రొఫెషనల్ కిల్లర్స్ వున్నారా ముఠాలో!" అని హెచ్చరించాడు బ్రహ్మాజీరావు.

# 3

హోటల్ షెర్రీలో తన రూంలో మంచంమీద వెల్లకిలా పడుకొని గతాన్ని సింహావలోకనం చేసుకుంటున్న కిషోర్, ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. అరిచేతిలో అగ్గిపెట్టె ఆకారంలో వున్న మైక్రో ట్రాన్స్‌మిటర్ లోంచి ఏదో చప్పుడు వినిపించింది.

"క్రీంగ్ " బజర్ మోత.

విలియమ్ ఎడ్వర్డ్స్ యింట్లో కాలింగ్ బజర్ ....

చెవులు రిక్కించి వింటున్నాడు కిషోర్ ....

చాలా శక్తివంతమయిన మైక్రోఫోన్ అది అడు గుల చప్పుడు కూడా స్పష్టంగా వినిపిస్తోంది. క్లిక్ మంటూ తలుపు తెరుచుకున్న చప్పుడు.

"అదెక్కడుంది....?" ఒక నిముషం తర్వాత విని పించిన కంచుకంఠం అది.

"బెడ్ రూమ్‌లో వున్నారు సర్....చాలా కోపంగా వున్నారు—" ఆ గొంతు గుర్తుపట్ట గలిగాడు కిషోర్. అది జాన్ పింటో అనబడే ఆ బట్టతల మనిషి గొంతు. వాక్యం చివరలో కొద్దిగా కీచుగా పలికినట్టు వినిపించడం వలన వెంటనే గ్రహించగలిగాడు.

ఆ రెండో గొంతెవరిది? విలియమ్ ఎడ్వర్డ్స్ అయ్యుంటారా?

వ్యంగ్యంగా నవ్వు వినిపించింది.

"కోపం దేనికి? వీడియోలో సినిమాలు చూస్తూ.... స్టీరియో మ్యూజిక్ వింటూ, కావలసిన పుస్తకాలు చదువుకుంటూ హాయిగా వుండొచ్చుగా—" అన్నా డతను.

"ఎలా కుదురుతుంది డార్లింగ్? ఇంట్లోంచి బైటికి కదలకుండా నెలల తరబడి ఖైదీలా ఈ నాలుగు గోడల మధ్య పడుండాలంటే నాకు వీలుకాదు విలియమ్...." కోపంగా వినిపించింది స్త్రీ కంఠస్వరం. అది ఖచ్చి తంగా మోనికా ఎడ్వర్డ్స్ గొంతే అయ్యుండాలి

"మిస్టర్ పింటో నువ్వు వెళ్ళొచ్చు....సాయంత్రం ఆరుగంటలకల్లా ఇక్కడుండాలి నేను బైటికెళ్ళాలి! మళ్ళీ నేను తిరిగొచ్చేసరికి అర్ధరాత్రి దాటిపోవచ్చు..." అన్నాడు విలియమ్స్.

"అంటే....ఎప్పుడూ నాకో మనిషి కాపలా వుండా

లన్న మాట!" కోపంగా అంటోంది మోనికా.

"డార్లింగ్ .... నే నెందుకా విధంగా చేస్తున్నానో అర్థం చేసుకో! పింటో—ఆమె మాటలేం పట్టించుకోవ—సాయంత్రం మామూలుగా వచ్చేయ్!" అన్నాడు విలియమ్.

"ప్లీజు—ఏయ్—మిస్టర్ ఆగు...." ఆందోళనగా అంటోంది మోనికా.... కానీ పింటో వినిపించుకున్నట్లు లేదు.

ఆమె మరింత కోపంగా అంటోంది—"ఇడియట్ .... నేను ఎవరితోనయినా ఫోన్లో మాట్లాడుతున్నా పక్కనే వుంటాడు. ఇంటి కెవరయినా వస్తే వాడే తలుపు తెరిచి మాట్లాడి పంపించేస్తున్నాడు! ఏమిటిది విలియమ్స్?"

"నీకు తెలీదు మోనికా....మన చుట్టూ ఒక విష వలయం బిగుసుకుంది....! 'సోలార్ ఎక్స్ప్లోజివ్స్' సంస్థ మీద యిప్పుడు యెంతోమంది అంతర్జాతీయ నేరస్థుల కన్ను పడింది! మాఫియా, కాస్మోక్రాట్స్ సొసైటీ లాంటి ముఠాలు నా ప్రతి కదలికను గమనిస్తున్నాయి. త్వరలో నన్ను ప్లానింగ్ విభాగానికి మార్చే ఉద్దేశం వుందని తెలిసి ....నా నుంచి రహస్యాలన్నీ సేకరించాలని వాళ్ళ ప్రయత్నం—" అంటున్నాడు విలియమ్ ఎడ్వర్డ్స్.

కిషోర్ ఊపిరిపీల్చటం సయితం మర్చిపోయినట్లు వింటున్నాడు.

"డామిట్! ఏదో కాకమ్మ కథ చెబ్తూనే వున్నావ్. ఏమయ్యిందివిలియమ్ నీకు? నన్నొదిలి ఒక్క రోజయినా వుండలేని వాడివి....మూడు నాలుగు రోజుల వరకూ ఇంటికి రావటంలేదు, కనీసం ఫోన్ చెయ్యటం లేదు!

వాడెవడో రాస్కెల్ ని నాకు కాపలా....! మాఫియాకి నన్ను కదలనివ్వకపోవటానికి సంబంధం యేమిటో నాకేమీ అర్థం కావటం లేదు—" అంది మోనికా.

"నువ్వు నోరు మూసుకుని లోపలికి వెళ్ళు—నీకు అర్థం కాకపోతే దేశానికేం నష్టంలేదు—" అన్నాడు విలియమ్ కోపంగా.

"కానీ నాకు నష్టమే. నన్ను ప్రేమించి పెళ్ళాడిన మనిషి నన్ను జైల్లో బంధించినట్లు బంధిస్తే—యెవడో రోగ్ ని నాకు కాపలా వుంచితే....కొంత కాలానికి నాకు పిచ్చెక్కుతుంది విలియమ్ ...!" ఏడుస్తున్నట్లుంది ఆమె గొంతు.

"ఎక్కనీ—పిచ్చెక్కితే గొడవే లేదు—కానీ నువ్వు గుమ్మం దాటి బైటికి వెళ్ళటం మాత్రం కుదరదు!—"

"ఓహ్ విలియమ్—"

"మరొక్క మాట మాట్లాడకు. ఫో యిక్కడ నుంచి—" కసిరాడు విలియమ్.

భోరుమంది మోనికా. ఉద్వేగంగా ఇంట్లోకి పారిపోతున్న అలికిడి స్పష్టంగా వినిపిస్తోంది మైక్రో ట్రాన్స్ మిటర్ లోంచి.

కాసేపు నిశ్శబ్దం....

ఫోన్ డయల్ చేస్తున్న చప్పుడు....

"హలో....నేను విలియమ్ ఎడ్వర్డ్సుని మాట్లాడుతున్నాను—"

అవతలివైపు మాటలు స్పష్టంగా వినిపించటంలేదు. కానీ యేదో గొణుగుతున్నట్లుగా కర్ కర్ మంటోంది.

"అది నా తప్పు కాదు. ముందుగా నువ్వే ఆలోచించుకని రావలసింది — సమయం మించిపోతోంది— సాయంత్రం ఆరు గంటల తర్వాత వస్తాను—యెంత రాత్రయినా మనం కలుసుకుంటాము—అంతే—" ఫోన్ పెట్టేసిన చప్పుడు.

మళ్ళీ నిశ్శబ్దం....

చాలా సేపు!

కిషోర్ మస్తిష్కంలో ఆలోచనల హోరు! ఇప్పుడేం చెయ్యాలి? విలియమ్ యింటి కెళ్ళటమా? రహస్యంగా అతనింట్లోకి ప్రవేశించి—అసలేం జరుగుతుందో తెలుసుకుంటే?—

కానీ కిషోర్ కి అది సరయిన ఆలోచన కాదనిపించింది.

సరయిన ఆలోచన రావటానికి అతనికి ఇరవై నిముషాలు పట్టింది. ఆ ఆలోచన రాగానే, ఒక నిశ్చయానికొచ్చి లేచి నిల్చున్నాడు....

## 4

'సోలార్ ఎక్స్ప్లోజివ్స్' వాషింగ్టన్ నగరం పొలిమేరల్లో వుంది.

టాక్సీలో అక్కడికి చేరుకున్నాడు కిషోర్. సెక్యూరిటీ మనుషులు గేటుదగ్గర కాపలా వుండటం గమనించి లోపలికి వెళ్ళటం కష్టం అని నిశ్చయించుకున్నాడు.

క్షణాల్లో అతడి మెదడులో ఆలోచనలు రూపు దిద్దుకున్నాయి. సెక్యూరిటీ కాబిన్ లోకి వెళ్ళి అక్కడ కూర్చున్న లావుపాటి వ్యక్తికి వినమ్రంగా నమస్కరించి, టామ్ అనే వ్యక్తిని కలుసుకోవాలని అడిగాడు.

"ఆ పేరుగల వాళ్ళెవరూ లేరే—" అన్నాడు

సెక్యూరిటీ ఇన్‌స్పెక్టర్.

"వాడి అసలు పేరు థామస్ క్రిస్టొఫర్ జేమ్స్ ఫ్రాస్ట్—అనుకుంటాను. అది వాడి అమ్మా నాన్నా పెట్టిన పేరు. వాడిన్ని ఏమంటారో నాకు సరిగ్గా తెలీదు" అన్నాడు.

"జేమ్స్ మాథ్యూస్ వున్నాడు ..."

"ఆఁ ఆఁ—మాథ్యూస్ .... విధవ .... నాతో ఎప్పుడూ అబద్ధాలే చెబుతుంటాడు—" అన్నాడు కిషోర్ నవ్వుతూ.

సెక్యూరిటీ ఇన్‌స్పెక్టర్ అదోలా చూసి, "జేమ్స్ మీ కేమౌతాడు?" అన్నాడు.

"ఏదయితే మీ కెందుకు? జేమ్స్ భార్య కంపెనీ యజమానిగారి బంధువని చెప్పండి! పరుగు పరుగున వస్తాడు—" అన్నాడు కిషోర్.

"ఇంతకీ రీటాకి మీ రేమవుతారు?" మరో సన్నటి సెక్యూరిటీ అధికారి అడిగాడు.

రీటా అనే అమ్మాయికి జేమ్స్ మాథ్యూస్ అనే భర్త ఒకడు వున్నాడనే విషయం అప్పుడే తెలుసుకున్నాడు కిషోర్.

ఎవడయితేనేం? విలియమ్‌తో పాటు పని చేస్తున్న వాడయితే చాలు—అది కిషోర్ ప్రయత్నం.

"రీటానే అడగండి చెబుతుంది" కోపంగా అన్నాడు కిషోర్.

"ఓ.కే. కూర్చోండి.... జేమ్స్‌ని పిలుస్తాను" అని, ఇంటర్ ఫోన్‌లో వర్తమానం పంపించగా, పది నిముషాల్లో సన్నగా, పొడుగ్గా, ఎర్రగా వున్న ఒక కుర్రాడు వచ్చాడు. అతనే జేమ్స్ మాథ్యూస్ అయ్యుంటా

డని గ్రహించిన కిషోర్ ఒక్కసారిగా లేచి, పరుగున వెళ్ళి ఆ యువకుడ్ని గాఢంగా కౌగలించుకుని—"రీటా కోసం నేనూ, మా ఆవిడా, మొత్తం ఫామిలీ అంతా దిగాంరా వాషింగ్‌టన్‌లో — నీకో భయంకరమైన నిజాన్ని చెప్పాలి—" అన్నాడు కిషోర్.

అతనికేమీ అర్థం కాలేదు. కంగారుపడిపోయాడు.

కానీ కిషోర్ యెంతో చనువుగా చెయ్యిపట్టి హైటికి లాక్కుపోయాడు.

"నేను స్కాట్‌లాండ్ యార్డ్ స్పెషల్ డిటెక్టివ్‌ని. మీతో రహస్యంగా మాట్లాడాలి" అన్నాడు.

జేమ్స్ పర్మిషన్ తీసుకుని, కిషోర్‌తో వచ్చేశాడు.

సమీపంలో వున్న ఒక రెస్టారెంట్‌లో ఖాళీగా వున్న ఒక టేబిల్ దగ్గర కూర్చున్నారిద్దరూ. కిషోర్ అతనికి సిగరెట్ ఆఫర్ చేసి, బ్లాక్ కాఫీకి ఆర్డర్ చేశాడు.

"విలియమ్ ఎడ్వర్డ్స్ చాలా భయంకరమైన ప్రమాదంలో చిక్కుకోబోతున్నాడు—" అన్నాడు కిషోర్.

అతను ఉలిక్కిపడ్డాడు—"వాడికి ప్రమాదమా? వాడే ప్రమాదకరంగా తయారయ్యాడు!" అన్నాడు జేమ్స్.

తనకి కావలసిందదే.

"అంటే?" అన్నాడు కిషోర్. అతను కనుచివర్ల నుంచి రెస్టారెంట్ అంతటినీ గమనిస్తున్నాడు. ఒకరో ఇద్దరో దూరం దూరంగా కూర్చున్నారు. ఎవరో ఒక అందమైన అమ్మాయి లోపలికొచ్చి, ఓ కుర్చీదగ్గర కూర్చుని సాండ్‌విచ్ ఆర్డర్ చేసింది. ఒక వృద్ధుడు

దగ్గుతూ వచ్చి మరో మూల చతికిలబడ్డాడు. అంతే—ఎవరూ గమనించటంలేదు.

"రెండున్నర నెలలుగా చాలా మార్పు కనిపిస్తోంది విలియమ్‌లో. పూర్వంలా సరదాగా నవ్వుతూ పలకరించటం మానేశాడు. ఎప్పుడూ కోపంగా వుంటాడు. ఏదో ఆలోచిస్తున్నట్లు ఎటో శూన్యంలోకి చూస్తూ కూర్చుంటాడు. వాడు సిగరెట్స్ కూడా చాలా ఎక్కువగా కాల్చటం—చాలా పెద్ద మార్పు. అప్పుడే అనుమానం వచ్చింది—ఏమైనా ప్రమాదంలో చిక్కుకున్నాడేమోనని—" అన్నాడు జేమ్స్.

"యూ ఆర్ రైట్. అంతేనా? ఇంకా ఏమయినా కొత్త కొత్త అలవాట్లు చేసుకున్నాడా?"

"బోలెడన్ని—అందరూ గ్రహించలేరు—నేను విలియమ్‌కి మంచి స్నేహితుడ్ని కాబట్టి ఆ మార్పు గమనించాను! విలియమ్స్‌కి ఈ మధ్య గర్ల్ ఫ్రెండ్స్ బాగా ఎక్కువయ్యారు. భార్యతో కలసి సినిమాలకి వెళ్ళటం కూడా మానేసినట్టున్నాడు—" అన్నాడు జేమ్స్, అప్పుడే వచ్చిన బ్లాక్ కాఫీ కప్పు అందుకుంటూ.

"తన భర్తని ఎవరో చంపేస్తానని మోనికాని బెదిరించారట. అప్పటినుంచి అలా తయారయ్యాడు. ఆ విషయం పరిశోధన చెయ్యటం కోసమే వచ్చాను. విలియంకి చెప్పకండి. మోనికా చెప్పొద్దని చెప్పింది!" అన్నాడు కిషోర్ కాఫీతాగుతూ.

జేమ్స్ చిరునవ్వు నవ్వుతూ—"ఈ సంఘంలో యెవరూ రహస్యాలు ఎవరికీ చెప్పరు—ఆమె క్షేమంగా వుండటం కోసం, నేను ఈ రహస్యం ఆమె భర్తకి చెప్పనని హామీ యిస్తున్నాను. ఇంతటికీ నన్నెందుకు కలిశారు?"

అన్నాడు.

"విలియమ్‌లో వచ్చిన మార్పు తెలుసుకుందామని— అంతే—" అన్నాడు కిషోర్, సిగరెట్ తీసి వెలిగించుకుంటూ.

## 5

జేమ్స్‌ని పంపించేసి, ఒంటరిగా ఆ రెస్టారెంట్‌లో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు కిషోర్.

ఆ క్షణంలో ఒక మెరుపుతీగలాంటి అమ్మాయి "హలో!" అంటూ వచ్చి ఎదురుగా కూర్చుంది.

కళ్ళకి, పెదవులకి దిద్దుకున్న ఎరుపు మెరుపులు మరింత అందం ఆమెకు చేకూరింది.

"ఒంటరిగా వున్నారుగా? కంపెనీ కావాలేమోనని వచ్చాను— నేనూ ఒంటరి చిలకనే...." అంది ఆమె అదోలా నవ్వుతూ.

అర్థం పరమార్థం లేకుండా ఓ అందాలరాశి, అపరిచితురాలు తన దగ్గరకొచ్చి పలకరించే అవకాశం లేదనిపించింది కిషోర్‌కి. ఆ పరమార్థం తెలుసుకోవాలంటే, "వెరీగుడ్! నేనూ ఇలాంటి అవకాశం కోసమే అన్వేషిస్తున్నాను...." అనాలి.

అందుకే, అలాగే అన్నాడు.

తత్ఫలితంగా— 'మెర్రీ హోటల్'లో తన గదిలోకి ఆమెను తీసుకువెళ్ళవలసి వచ్చింది.

శృంగారమే తన లక్ష్యంగా ఓ అరగంటసేపు కిషోర్‌ని కవ్వించి, అతని కెంతో చేరువయ్యింది.

"ఇంతకీ నీ పేరు చెప్పనే లేదు...." అడిగాడు కిషోర్.

అతన్ని లతలా పెనవేసుకుంటూ, "పేరెందుకు

డార్లింగ్ ...." అంటూ కిషోర్ కి కనిపించకుండా, ఎప్పుడు తీసిందో, అంత సేపు ఎక్కడ దాచిందో అతని డొక్కలో డెరింగర్ ని అన్చింది.

చల్లగా తగిలేసరికి ఆదిరిపడి, ఒక్కడుగు వెనక్కి వేశాడు కిషోర్. అరిచేతిలో ఇమిడిపోయేంత మినీ రివాల్వర్ (డెరింగర్) అది.

"ఏమిటిది? సరసానికి వచ్చి, దౌర్జన్యానికి దిగుతున్నావ్?" అన్నాడు కిషోర్.

ఆమె సూటిగా అతనివంక చూస్తూ—"ఎవరు నువ్వు?" అంది.

"వాషింగ్టన్ సిటీ గురించి వ్యాసం రాయటానికి వచ్చిన జర్నలిస్టుని—" తడుముకోకుండా అన్నాడు.

"భారతీయుడివా?" అనడిగింది.

"కాదు. మలేషియన్ ని—"

"సోలార్ ఎక్స్ప్లోజివ్స్ తో నీకేం పని....?"

"నా బంధువుని కలుసుకోడానికి వెళ్ళాను—"

ఫక్కుమని నవ్వింది ఆమె—"అబద్ధాలాడి తప్పించుకోగలనని అనుకోకు....విలియం ఎడ్వర్డ్స్ గురించి తెలుసుకోవాలని నువ్వెప్పుడయితే ప్రయత్నం ప్రారంభించావో ఆ మరుక్షణమే నీకు మృత్యువుతో ఒప్పందం అయిపోయిందన్న మాట! కాబట్టి నిన్ను " అంటూ డెరింగర్ అతనివైపుకి ఎత్తింది సూటిగా.

"విలియం ఎడ్వర్డ్స్ గురించి తెలుసుకోకూడని రహస్యం ఏదైనా వుందా?"

"అదంతా నీ కనవసరం—" అందామె.

"ఎలాగా నన్ను చంపెయ్యబోతున్నావుగా. విలియంకి కాస్మొక్రాట్స్ సొసైటీతో సంబంధం వుందనే

రహస్యం చెప్పేయ్—మన మాటలు మైక్రోఫోన్స్ ద్వారా వాషింగ్టన్ పోలీస్ కంట్రోల్ రూంకి వినిపిస్తూనే వున్నాయి—" అన్నాడు కిషోర్.

కలవరపాటుని కప్పిపుచ్చుకోలేక...."బ్లడీ హెల్! మైక్రోఫోన్స్ ఏమిటి?" అంది.

"అదిగో ఆ గోడకి మైక్రో " అంటూ చెయ్యి అటు చాచాడు కిషోర్. ఆమె తల తిప్పి కంగారుగా ఆ దిశగా చూడటం—చిరుతపులిలా ఆమెమీదకి లంఘించటం, ఆమె కెవ్వుమని అరవబోతుండగా ఒక చేత్తో ఆమె నోరుని, మరో చేత్తో ఆమె చేతిలోని ఆయుధాన్ని కదలనివ్వకుండా నొక్కిపట్టుకోవటం—క్షణాల్లో జరిగిపోయింది.

"బేబీ! చాలా ఆలస్యమైపోయింది!" అంటూ ఆమె నోటిమీంచి చెయ్యి తీసేస్తూ, అరిచేతిని కత్తిలా బిగించి, మృదువైన ఆమె మెడ నరాలమీద, ప్రొఫెషనల్ పద్ధతిలో ఒక దెబ్బ వేశాడు!

కొమ్ములు తిరిగిన గూఢచారుల్ని, రెజ్లింగ్ హీరోలని చిత్తుచేసే దెబ్బ అది. తోటకూర కాడలా వ్రేలాడిపోయిందామె.

బ్రీఫ్‌కేస్‌లోంచి నైలాన్ తాడు. టేప్ తీసి, ఆమెను 'ప్లవ్‌ఔట్' పైప్‌కి కదలకుండా కట్టేసి, ఆమె నోటికి టేప్‌ని ప్లస్ మార్కులా అతికించాడు.

కనీసం ఒక గంటవరకు ఆమెకు స్పృహరావటం అసాధ్యం. కానీ ఏందుకైనా మంచిదని, జేబులోంచి కుంకుడు గింజ పరిమాణంలో వున్న బంగారం రంగు కాప్స్యూల్ తీసి, ఒకచేత్తో తన ముక్కు గట్టిగా మూసుకుని, ఆ కాప్స్యూల్‌ని ఆమె ముక్కు దగ్గర పెట్టి

గట్టిగా నొక్కాడు. టప్ మని పగిలింది.

అందులోంచి వెలువడిన ఘాటైన వాసన పీల్చటం జరిగితే కనీసం పది పన్నెండు గంటల వరకు స్పృహ రాదు. ఆ ఘాటుకి ఆమె ఉక్కిరిబిక్కిరై ఒక్కక్షణం మెడ కదిలించి, ప్రక్కకి వాల్చేసింది.

బాత్ రూంలోంచి బైటికొచ్చేసాడు కిషోర్, తలుపు దగ్గర కేసి, గడియ బిగించేస్తూ.

## 6

ఎమిలీ ఎపార్టుమెంట్స్ కి పదడుగుల దూరంలో వున్న ఐస్ క్రీం పార్లర్ దగ్గర రిస్టువాచి చూసుకుంటున్నాడు కిషోర్.

ఆరు గంటలు కావస్తోంది.

విలియమ్ ఎడ్వర్డ్స్ చెప్పిన ప్రకారంగా జాన్ పింటో ఆరుగంటలకి వచ్చెయ్యాలి. విలియమ్ వెళ్ళిపోవాలి.

సిగరెట్ వెలిగించి పూర్తిగా కాల్చిపారేసేలోగా ఎర్రరంగు మోటార్ బైక్ మీద ఎపార్టుమెంట్స్ లోకి వచ్చేశాడు పింటో.

మరో పదినిముషాలకి విలియమ్ బైటికిరావటం, పోర్టికోలో ఆగివున్న ప్లిమత్ కారుని అధిరోహించడం, ఆ కారు క్షణాల్లో రోడ్ మీదికి కళ్ళముందునుంచి దూసుకు పోవడం గమనించాడు కిషోర్.

ఇక ఆలస్యం చెయ్యదల్చుకోలేదు.

వెంటనే ఎపార్టుమెంట్స్ లోని మూడో అంతస్తుకి లిఫ్ట్ మీద చేరుకుని, 185 నెంబర్ ఫ్లాట్ ముందు ఆగాడు.

తలమీద ఈసారి ఎర్రటోపీ లేదు. సఫారీ సూట్ ధరించి, కూలింగ్ గ్లాస్ పెట్టుకుని వున్నాడు కిషోర్.

హెయిర్ స్టయిల్ నుదుటిమీద అర్ధ చంద్రాకారంలో పడేలా మార్చుకుని, మీసాలు టూత్ బ్రష్ ఆకారంలో తగిలించుకోవటంతో అతన్ని టెలిఫోన్ డిపార్టుమెంట్ మనిషిగా గుర్తించలేదు పింటో.

కాలింగ్ బజర్ నొక్కాడు. వేళ్లు తడుముకుని చూసుకున్నాడు. పాయింట్ త్రీటూ కోల్టు కోబ్రా పిస్టల్ సురక్షితంగా వుంది ఎడమపాకెట్‌లో.

తలుపు తెరుచుకోగానే ఎటాక్ చెయ్యాలి. అదీ కిషోర్ ప్లాన్.

కానీ, తలుపు తెరుచుకోగానే నిర్ఘాంతపోయాడు.

ఎదురుగా బంగారం రంగు శిరోజాలతో, నీలికళ్ళ సుందరాంగిని చూడగానే ఆమె మోనికా ఎడ్వర్డ్సు అయ్యుంటుందని అనుమానించాడు కిషోర్.

ఆమె మొహంలో కంగారు....

"ఎవరు నువ్వు, విలియమ్ లేడు. ఎవరూ లేరు..." అంటూ బైటికి వచ్చి తలుపు వేసెయ్యటానికి ప్రయత్నించింది.

"బైటికి వెళుతున్నారా?"

"ఔను—"

"నేను మీతో మాట్లాడడానికే వచ్చాను—" అన్నాడు కిషోర్.

"ఇప్పుడు వీలుకాదు—" అందామె.

"పింటోనేం చేశారు? చంపేశారా?" అడిగాడు.

కొరడా దెబ్బ తగిలినట్లు అదిరిపడుతూ—"పింటో రాలేదు—అసలు పింటో ఎవడు?" అందామె కంగారు పడుతూ.

చిరునవ్వు నవ్వాడు కిషోర్....

"మనం ఇక్కడ నిలబడి మాట్లాడటం శ్రేయస్కరం కాదు— నేను మీ శ్రేయోభిలాషిని. రెండు నెలలుగా మీ భర్త మీతో విచిత్రంగా ప్రవర్తించడానికి కారణం ఏమిటో నాకు తెలుసు—" అన్నాడు.

ఆమె అతనివైపు అనుమానంగా చూసింది.

"మీరేం కంగారుపడకండి. లోపలికెళ్ళి మాట్లాడుకుందాం—"

"పింటోకి స్పృహ వస్తే—" భయంగా అంది మోనికా.

"వాడి ప్రాణం తీస్తాను. డోంట్ వర్రీ-" అన్నాడు కిషోర్.

ఆమె లోనికి కదిలింది.

లోపల గది గుమ్మం దగ్గర పింటో నేలమీద బోర్లా పడి వున్నాడు.

"అతని తలమీద ఫ్లవర్ వాజ్‌తో కొట్టాను—" అంది మోనికా.

"కొట్టటం అతను చూశాడా?"

"లేదు. వెనకనుంచి కొట్టాను—"

"వెరీగుడ్. అతన్ని మీరు కొట్టలేదు నేనే కొట్టాను" అంటూ పింటో దగ్గరకెళ్ళి చూశాడు కిషోర్. కాస్సేపట్లో స్పృహ రావచ్చు. అందుకే అతని మెడమీద చెయ్యివేసి ఆతికీలకపైన నరాన్ని కలుక్కుమనిపించాడు. అమ్మాహ్.... అని మూల్గుతూ మెడపైకెత్తి వాల్చేశాడు.

"కనీసం గంటవరకు లేవడు!" అన్నాడు కిషోర్ లేచి నిల్చుంటూ.

"ఇంతకీ ఎవరు నువ్వు?" అడిగింది మోనికా.

"మీ చుట్టూ బిగుసుకున్న అంతర్జాతీయ నేరస్థుల ముఠా ఉచ్చుని తెగ్గొట్టడానికి నియమింపబడిన గూఢచారిని. అంతకంటే వివరాలు అడక్కండి! నే నడిగే ప్రశ్నలకి సంకోచించకుండా జవాబు చెప్పగలిగితే, మిమ్మల్ని మీరు రక్షించుకున్నవారౌతారు! అలాగే మాకూ యెంతో సహాయం చేసినవారౌతారు....!" అన్నాడు కిషోర్.

కొంతమంది కంఠస్వరాల్లో ఒక రకమయిన హిప్నాటిక్ శక్తి వుంటుంది. వాళ్ళమీద ఎదుటి వ్యక్తికి చాలా సులభంగా నమ్మకం ఏర్పడిపోతుంది. మనసు విప్పి మాట్లాడాలనే భావన కలుగుతుంది.

కిషోర్ గొంతులో ఆ ప్రత్యేకత వుంది.

"అడగండి!" అంది మోనికా.

"మీ భర్తలో మీకేదో మార్పు కనిపిస్తోంది కదూ?"

"ఔను."

"ఎంత కాలంగా?"

"రెండు నెలలు దాటుతోంది ..."

"మీరు గమనించిన మార్పు యేమిటో కాస్త వివరంగా చెప్పగలరా?"

ఆమె గొంతు సవరించుకుని చెప్పనారంభించింది.

"విలియమ్ నన్ను యెంతగానో ప్రేమిస్తాడు. నేను కొద్దిగా కోపం తెచ్చుకుంటే చాలు, నన్ను పసిపిల్లని చేసి బుజ్జగిస్తాడు. నా మనసు నొచ్చుకునేలా మాట్లాడటం అతనికి యేమాత్రం అలవాటులేదు. అటువంటి విలియమ్ నన్ను అనుమానిస్తున్నట్లు ఎవడినో కాపలాగా పెట్టి—నన్ను యెక్కడికీ వెళ్ళనివ్వకుండా బంధించి....

అసలెందుకిలా ప్రవర్తిస్తున్నాడో—" ఎంతో బాధగా అంటోంది మోనికా.

"మిమ్మల్ని శారీరకంగా కలుసుకున్నప్పుడు కూడా అతని ప్రవర్తనలో మార్పు గమనించగలిగారా?" అడిగాడు కిషోర్.

"ఐయాం సారీ! గత రెండు నెలలుగా అతను నాతో శారీరకంగా గడిపే తీరిక కూడా లేకుండా తిరుగుతున్నాడు. 'సోలార్ ఎక్స్‌ప్లోజివ్స్' ప్లానింగ్ విభాగం త్వరలో విలియమ్‌కి అప్పగిస్తారట అందుకే యింత బిజీగా రాత్రీ పగలూ " అంటోంది మోనికా.

"మీ మాటలని బట్టి నాకో అనుమానం కలుగుతోంది...." అన్నాడు కిషోర్ సాలోచనగా.

"ఏమిటది" అడిగింది ఆమె కుతూహలంగా.

"గత రెండు నెలలుగా మీతో పాటూ వుంటున్న విలియమ్ మీ భర్త కాదేమోనని...."

"వాట్!...." కరెంటు షాక్ తగిలినట్లు అదిరిపడింది మోనికా.

"మీ భర్తని కిడ్నాప్ చేసి అతని స్థానంలో ఎవరో డూప్ వుంటున్నాడేమో—"

"మై గాడ్! నాకు భయం వేస్తోంది! మీరు చెబుతూ వుంటే నాకు యిప్పుడు అనిపిస్తోంది....నా విలియమ్‌లో ఇంత భయంకరమైన మార్పులు రావటం అసాధ్యం! నన్ను రెండు మూడు రోజులు చూడకపోతే వుండలేని విలియమ్. నన్ను గాల్లోకెత్తి గిరగిరా తిప్పి సరసాలాడుతూ—యస్! మీరు చెప్పింది నూటికినూరు పాళ్ళు నిజం అనిపిస్తోంది! వీడు విలియమ్ కాదు!" ఉద్రేకం, ఉత్సాహం, ఆందోళన ఒక్కసారి పెల్లుబికినట్లు అంది

ఆమె.

“నిరాకరణగా చెప్పటానికి యేదైనా ఆధారం కని పిస్తోందా?” అడిగాడు కిషోర్.

“ఔను....అతని కోసం నేను యెంతో ప్రేమగా చేసిపెట్టిన వంటకాలని అతను పొగడకపోవడమే— చేపలకూరంటే చెవికోసుకునే విలియమ్.... మొన్న చేపలతో ప్రత్యేకంగా చేసిన వంటకాలని చిన్న కాంప్లిమెంట్ లేకుండా... నో నో — సందేహంలేదు — వీడు విలియమ్ కాడు! అంటే—ఇంతకాలంగా....ఓ గాడ్— నా విలియమ్ ఎక్కడున్నాడు? ఏమైపోయాడు?” ఆమె కంఠం గాద్గదికంగా మారిపోయింది. భయాందోళనలు ఆమెను క్రుంగదీస్తున్నాయి.

“మేడమ్. ఈ పరిస్థితుల్లో మీరు నాతో సహకరిస్తే మీ సమస్య అతి త్వరలో పరిష్కరించగలను. మీరు ఏమీ తెలీనట్లు మామూలుగానే వుంటారు. అతన్ని అనుమానించినట్లు యెక్కడా బైటపడకూడదు! మీ భర్త ఎక్కడున్నా క్షేమంగా వుండాలంటే—వీడు డూప్ అనే రహస్యం తెలిసినట్లు మీరు యెక్కడా కని పించకూడదు! మరో అరగంటలో పింటోకి స్పృహ రావచ్చు! మీరో నాటకం ఆడాలి....” అన్నాడు కిషోర్.

మంత్రించిన బొమ్మలా అతన్ని చూస్తూ—“విలియమ్ కోసం నేనేమైనా చేస్తాను!” అంది పట్టుదలగా.

“నేను వెళ్ళిపోయిన తర్వాత మీరు మీ భర్తకి ఫోన్ చేసి—అదే. విలియమ్‌కి ఫోన్ చేసి........ఎవడో ఇంట్లోకి ప్రవేశించి మిమ్మల్ని, పింటోని కొట్టి స్పృహ తప్పించి, ఇల్లంతా దేనికోసమో గాలించాడని చెప్పండి

చాలు! అతను కంగారుపడతాడు....దీనివలన రెండు ప్రయోజనాలు—పింటోని మీరే కొట్టినట్లు తెలియదు! అతనికి సంబంధించిన రహస్యాలేమైనా తెలిసాయేమోనని కంగారుపడటంగానీ, ఇంట్లో దేనికోసమో గాలించటం గానీ చేస్తాడు. అతన్ని శ్రద్ధగా గమనించండి చాలు—” అన్నాడు కిషోర్.

“కానీ నాకెందుకో భయంవేస్తోంది.....” అంది మోనికా.

“భయపడవలసిన స్టేజ్ కాదిది! బరితెగించవలసిన స్టేజ్” అన్నాడు కిషోర్ లేచి నిల్చుంటూ.

ఆమె కూడా లేచినిల్చుని, “మీరు చెప్పినట్లే చేస్తాను. మీరు రావటం ఆలస్యమయ్యింటే ఈ రోజు మనం కలుసుకునే వాళ్ళమే కాదు. చాలా థాంక్స్” అంది.

“అప్పుడే ఏమయ్యింది? అంతా సవ్యంగా ముగించాక అభినందనలు. మరో విషయం. అతని గదిలో యెవరో దేనికోసమో వెదికినట్లుగా సామాన్లన్నీ చిందరవందర చెయ్యటం మాత్రం మర్చిపోకండి...” అన్నాడు చిరునవ్వుతో.

జేబులోంచి పిస్టల్ తియ్యవలసిన పరిస్థితి రాకుండా అనుకోకుండా చాలా సులభంగా మోనికాని కలుసుకో గలిగినందుకు సంతోషిస్తూ, ఎమిలీ ఎపార్టుమెంట్స్‌లోంచి బైటపడ్డాడు కిషోర్.

## 7

అనుకున్న ప్రకారంగానే మోనికా చేసిన ఫోన్ తన ప్రభావం చూపించింది.

ఎమిలీ ఎపార్టుమెంట్స్ ఎదురుగా వున్న ఒక షాప్

కార్నర్ షాపుకి సమీపంలో వున్న ఎలక్ట్రిక్ స్తంభం దగ్గర సిగరెట్ పొగని తాపీగా వదులుతూ నిల్చున్న కిషోర్, ఇరవై నిముషాలు తిరక్కుండా—ప్లిమత్ కారు వచ్చి ఆ ఎపార్టుమెంట్స్ ముందు ఆగటం, అందులోంచి విలియమ్ ఎడ్వర్డ్సు బైటికి అడుగుపెట్టడం గమనించి, జేబులో వున్న ట్రాన్స్‌మీటర్ వాల్యూమ్‌ని మరి కాస్త పెంచి శ్రద్ధగా వినసాగాడు.

తలుపు తెరుచుకున్న చప్పుడు — "విలియమ్" అని ఆందోళనగా అరుస్తూ మోనికా, భయాందోళనలతో చెబుతున్న మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

ఎంతో చక్కగా నటించింది ఆమె.

ఎవడో ఆగంతకుడు తనని, పింటోని స్పృహ తప్పించాడని, తనకి భయం వేస్తోందని నిస్సహాయురాలిలా ఏడుస్తూ మోనికా చెబుతోంటే, విలియమ్ ఆమెను ఊరడిస్తున్నాడు.

అయినా ఆ మాటలు కిషోర్‌కి ఉత్సాహం కలిగించటంలేదు.

పింటో గొంతుకూడా వినిపించడంతో అతనికి స్పృహ వచ్చిందని అర్థం చేసుకున్నాడు. విలియం ఒకటి రెండు ప్రశ్నలు వేశాడు. తన తలమీద యెవరో కొట్టారని, వెంటనే స్పృహ తప్పిపోయిందని. అంతకంటే తనకేమీ తెలియదని పింటో చెబుతూ వుంటే. విలియం కోపంగా అతన్ని తిట్టిపోసాడు.

సుమారు ఇరవై నిముషాలవరకు ఎటువంటి ఇంట్రెస్టు కలగకపోయినా, ఎప్పుడైతే విలియం మళ్ళీ ఆ ఎపార్టుమెంట్స్‌నుంచి బైటికొచ్చాడో — అప్పుడు హుషారు పుట్టుకొచ్చింది కిషోర్‌లో.

కనుచూపు మేరంలో ఆగివున్న టాక్సీ దగ్గరకి రెండంగల్లో చేరుకుని, ఎక్కి కూర్చున్నాడు కిషోర్. వేగంగా పోనివ్వమన్నాడు.

డ్రయివర్ ఎంతో సుకుమారంగా టాక్సీ నడిపిస్తున్నట్లు అనిపించటంతో, అతన్ని పక్కకి తప్పుకోమని, తను అందుకున్నాడు స్టీరింగ్ ని.

రెండు రెపరెపలాడే కరెన్సీ నోట్లు డ్రయివర్ చేతిలో పెట్టగానే, అతనిలో కంగారు అదృశ్యమైపోయింది. ప్రసన్నవదనంతో ప్రేక్షకుడిలా కూర్చుండిపోయాడు.

కిషోర్-ప్లిమత్ ని చాకచక్యంగా వెంబడిస్తున్నాడు. విలియంకి ఏమాత్రం అనుమానం వచ్చినా పథకం అంతా ఆవిరై పోతుందని అతనికి తెలుసు.

మెక్సికన్ హైవే— ఆరు రోడ్లు కలిసే జంక్షన్!

అక్కడ ట్రాఫిక్ బాగా రద్దీగా వుండడంతో ఆటోమాటిక్ ట్రాఫిక్ సిగ్నల్స్ మూలంగా కార్లు, స్కూటర్లు, టాక్సీలు, అన్ని వాహనాలు స్తంభించి పోయాయి.

కిషోర్ ఎంతో జాగ్రత్తగా గమనిస్తోన్నాడు విలియమ్ కారుని. తన టాక్సీకి అతని కారుకి మధ్యన పదిపన్నెండు వాహనాలు అడ్డున్నాయి. ఒకే ఒక్క నిముషం సిగ్నల్ ఆపరేట్ కావటం, శరవేగంతో వాహనాలు ఒకో దిశగా దూసుకుపోవటం అతనెంతో ఏకాగ్రతతో గమనిస్తున్నాడు. ఏ మాత్రం ఆలస్యం చేసినా, సరిగ్గా తన టాక్సీ కదిలే సమయానికి ఎర్ర సిగ్నల్ ప్రత్యక్షం కావచ్చు. చచ్చినట్లు ఆగిపోవాలి. ఒకవేళ విలియమ్ ని మిస్సయితే. ?

కిషోర్ ఆలోచిస్తూ వుండగానే గ్రీన్ సిగ్నల్ కని

పించింది. రివ్వుమని కుడివైపు రెండో రోడ్డులోకి మాయమవ పోతున్న విలియమ్ కారు అతని దృష్టి పథం నుంచి తప్పించుకుపోలేదు....! రివ్వున ముందుకి పోనిచ్చాడు....

కానీ.... సరిగ్గా తన టాక్సీకిముందు ఆగివున్న వాహనం టర్నింగ్ దగ్గరకి రాగానే రెడ్ సిగ్నల్ కనిపించటంతో—బ్రేక్ వెయ్యక తప్పలేదు.

డామిట్!....

మరో రెండు నిముషాలు ఆగక తప్పలేదు. తన దురదృష్టాన్ని నిందించుకొంటూ ఓపిగ్గా నిరీక్షించి, మళ్ళీ గ్రీన్ సిగ్నల్ ప్రత్యక్షం అయ్యాక—టాక్సీని విలియమ్ కారు వెళ్ళిన రోడ్డువైపుకి వాయువేగంతో ఉరకించాడు.

కనుచూపు మేరలో ఎక్కడా విలియమ్ ప్లిమత్ కారు కనిపించలేదు. ఆ రోడ్డులోంచి యెటూ పోవడానికి మలుపులు లేవు. సరాసరి ముందుకే పోనిచ్చాడు. చాలా పొడుగాటి రోడ్డు....

ఆ రోడ్డు చివరకి రాగానే సందిగ్ధావస్థలో చిక్కుకుపోయి ఒక్క క్షణం ఆగాడు కిషోర్!

కుడివైపుకో రోడ్డు—

ఎడమవైపుకో రోడ్డు—

విలియమ్ ఎటు వెళ్ళుంటాడు?

తన అదృష్టాన్ని పరీక్షించుకోవటం తప్ప మరో మార్గం కనిపించలేదు. ఒక్క క్షణం ఆలోచించి, వెంటనే ఎడంవైపు రోడ్డులోకి మలుపు తిరిగాడు.

అతని కళ్ళు ఆతృతగా నలుదిశలా కలియజూస్తున్నాయి.

రోడ్డు కిరువైపులా ఆకాశాన్నంటుతున్న భవంతులు....

టాక్సీ స్పీడు తగ్గించి, రెండువైపులా చూస్తూ— ముందుకి దూసుకుపోతున్నాడు....

సరిగ్గా ఆదే క్షణంలో, అతని చూపు ఓ భవంతి పోర్టికోలో ఆగివున్న ఆరడజను కార్ల మధ్యలో పార్క్ చెయ్యబడివున్న ప్లిమత్ కారుమీద పడటం, అతని జేబులోని ట్రాన్స్‌మిటర్ 'కూక్ కూక్' మని అలికిడి చెయ్యటం, తన గుండె వేగంగా కొట్టుకుంటున్న చప్పుడు తనకే వినిపించటం, టాక్సీ బ్రేక్ మీద పట్టు బిగుసుకోవటం ఏకకాలంలో జరిగిపోయాయి!

విలియమ్ ఇదే భవనంలోకి వెళ్ళుంటాడనేది నిర్వివాదాంశం;

జేబులోని ట్రాన్స్‌మిటర్ లోంచి మాటలు వినిపిస్తున్నాయి.

ప్రక్కనే బెల్లంకొట్టిన రాయిలా కూర్చున్న టాక్సీ డ్రయివర్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

జేబులోంచి అగ్గిపెట్టె పరిమాణంలో వున్న ట్రాన్స్‌మిటర్ తీసి చెవిదగ్గర పెట్టుకున్నాడు కిషోర్.

"ఏమిటిది?...." ఆందోళనగా వినిపిస్తోంది మోనికా ఎడ్వర్డ్స్ కంఠస్వరం.

వెంటనే పకపక నవ్వు వినిపించింది.

"మైడియర్ మోనికా! చేతిలో మృత్యుదేవతలా మెరుస్తున్న రివాల్వర్‌ని చూస్తూ—ఏమిటి అని అడుగుతున్న నీ అమాయకత్వానికి జాలి వేస్తోంది!...." వ్యంగ్యంగా వినిపిస్తున్న ఆ కంఠస్వరాన్ని గుర్తుపట్టగలిగిన కిషోర్ గుండె దడదడ లాడింది.

"అదే అడుగుతున్నాను. ఏమిటీ దౌర్జన్యం?" కోపంగా

అడుగుతోంది మోనికా.

"ఎవడు వాడు?...." అన్నాడు ఆ వ్యక్తి కర్కశంగా.

అది జాన్ పింటో గొంతు!

"ఎవరి గురించి నువ్వడిగేది?" అంది మోనికా.

"టూ స్మార్ట్! చాలా అద్భుతంగా నటిస్తున్నావ్! నిన్ను ఆదుకుంటానని ప్రగల్భాలు పలికిన ఇడియట్! నీ మొగుడు కాదని యెవరో డూప్ అని తెలియజెప్పిన స్కౌండ్రల్! నా తలమీద కొట్టింది నువ్వు కాదని, తనే నని అబద్ధం చెప్పమని చెప్పిన రాస్కెల్! నీకు యేమీ తెలీదని, ఎవడో ఆగంతకుడొచ్చి దౌర్జన్యం చేశాడని— విలియమ్‌కి ఫోన్ చెయ్యమని సలహా ఇచ్చిన బాస్టర్డ్! నీ చుట్టూ బిగుసుకున్న ఉచ్చును విడగొట్టి నిన్ను ఆదుకుంటానని అభయం ఇచ్చిన ఆ రహస్య గూఢచారి?....ఎవడు వాడు?" అన్నాడు పింటో.

కరెంటు షాక్ తగిలినట్లు అదిరిపడ్డాడు కిషోర్. ఎలా? ఇదెలా సాధ్యం? మోనికా ఫ్లవర్ వాజ్‌తో కొట్టిన దెబ్బకి అతనికి స్పృహ పోలేదా? లేకపోతే మాత్రం.... తను ఆమె గదిలోకి వెళ్ళగానే అతని మెడమీద కీలకమైన నరాన్ని ఎంతో నేర్పుగా మెలిపెట్టి అతనికి స్పృహ తప్పించాడే! మరి?....

"ఊఁ జవాబు చెప్పు.... లేదా ఈ రివాల్వర్‌లోని బులెట్లు నీ ప్రాణాలు తియ్యకుండా కేవలం నీ భుజాల్లోనూ, పిక్కల్లోనూ నిద్రపోతాయి! కమాన్.... స్పీకప్...." గద్దించాడు పింటో.

"నువ్వే చెప్పావుగా అతనెవరో రహస్య గూఢచారి అని...." అంది మోనికా.

"ఏ దేశం గూఢచారి?"

"నాకు తెలీదు___"

చెళ్ళుమని చెంప మోగించిన శబ్దం!

"డోంట్ బ్లఫ్! నువ్విలాంటిదేదో చేస్తావనే విలియమ్ నన్ను నీకు బాడీగార్డుగా నియమించాడు. నన్ను తక్కువగా అంచనా వెయ్యకు! నాకు స్పృహ తప్పించి మీరిద్దరూ మాట్లాడుకున్న ప్రతి మాట___అదిగో ఆ టెలిఫోను పక్కనే వున్న గుర్రం బొమ్మలో అమర్చబడిన టేప్ రికార్డర్ లో రికార్డు అయ్యింది! నీకూ వాడికీ ఏమిటి సంబంధం? వాడితో పరిచయం లేకపోతే వాడిక్కడికెలా వచ్చాడు? స్కాట్ లాండ్ యార్డు సీక్రెట్ ఏజంటా? సి.ఐ.ఏ. మనిషా? ఇంటర్ పోల్ గూఢచారా? ఇండియన్ స్పై అయ్యుంటాడా?___మర్యాదగా చెప్పు మోనికా...." ఎంతో ప్రశాంత గంభీర స్వరంలో అడుగుతున్నాడు పింటో.

మైగాడ్ యెంత సులభంగా దొరికిపోయాడు తను? సి.బి.ఐ. చీఫ్ చెప్పిన మాటలు....

"కాస్మోక్రాట్స్ సొసైటీని అంత తక్కువగా అంచనా వెయ్యకు! నీ ఒళ్ళంతా జల్లెడ చెయ్యగల ఆరితేరిన ప్రొఫెషనల్ కిల్లర్స్ వున్నారా ముఠాలో!"

అన్న బ్రహ్మాజీరావు మాటలు కిషోర్ చెవుల్లో రీసౌండయ్యాయి!

"నాకేం తెలీదు....ఇక్కడ మంచి తప్పించుకుపోవాలని నేనే నీ తలమీద కొట్టి బైటికి వెళ్ళబోతుండగా అతనెవరో వచ్చి___నాకు ధైర్యం చెప్పాడు___" అంది మోనికా.

"నిన్ను వాడు రక్షిస్తాడని కలలు కంటున్నావా?"

వ్యంగ్యంగా అన్నాడు పింటో.

మోనికా ఒక్కసారిగా భోరుమంది—"నా విలియమ్ ఏమయ్యాడు? అతన్నేం చేశారు మీరంతా? అతను మీకేం అపకారం చేశాడు? నన్నెందుకిలా చిత్రహింస పెడుతున్నారు?" అంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

క్రౌర్యం నిండిన నవ్వొకటి నవ్వాడు పింటో—

"నాలుగు గోడల మధ్య నాలుగు రోజులు నోరెత్తకుండా పడివుంటే—నీ మొగుడూ నీకు దక్కేవాడు! ఈ నరకం నీకు తప్పేది! కానీ ఇంత జరిగాక ఇంక మీరిద్దరూ ప్రాణాలతో మిగలటం ప్రమాదం!" అంటున్నాడు.

"నో!" అరిచింది మోనికా.

"చూద్దాం! నీ అదృష్టం ఎలా వుందో! నిన్ను రక్షిస్తానన్న ఆపద్బాంధవుడు యెంత దూరం వెళ్తాడో! ఈ రాత్రికి వాడు చచ్చాడనే శుభవార్త నీకు వినిపిస్తే—నువ్వు బ్రతికుంటావ్! నాలుగు రోజులు ఓపికపట్టి బుద్ధిగా కూర్చుంటే నీ మొగుడు నీకు దక్కుతాడు! ఏదైనా.... అవకతవక జరిగితే—నీ చాప్టర్ ఇక్కడ, నీ మొగుడు చాప్టర్ అక్కడ పరిసమాప్తి..!" అన్నాడు జాన్ పింటో.

ఆ మాటలు విన్నతర్వాత గానీ కిషోర్ మనసు శాంతించలేదు.

ఆ తర్వాత మోనికాని ఓ గదిలోకి తోసి, తలుపులు బిగించినట్లు అర్థం చేసుకోగలిగాడు — నిశ్శబ్దం!—

ట్రాన్స్‌మిటర్‌ని జేబులోకి పోనిచ్చి—'డన్‌హిల్' వెలిగించి పక్కనే కదలకుండా కూర్చున్న డ్రయివర్ వైపు చిరునవ్వుతో చూసి—"డోంట్ వర్రీ! జాగ్రత్తగా యెదురుచూస్తూ వుండు....ఇక్కడే...." అని

చెప్పి. వాలెట్ లోంచి మరో రెండు నోట్లు తీసి అతని చేతిలో పెట్టి భుజం తట్టి, క్రిందకి దిగాడు కిషోర్.

చక చక యెదురుగా వున్న భవంతివైపు అడుగు లేశాడు.

అప్పటికే చీకటి తెరలు కమ్ముకుని, నియాన్ లైట్ల కాంతి ఆ ప్రాంతాన్ని డామినేట్ చేస్తోంది.

విశాలమైన బంగళా అది. రెండే అంతస్తుల మేడ. కొన్ని వందల సంవత్సరాల క్రితంనాటి కట్టడమే అయినా, అధునాతనంగా రంగులు వేసి మెరుగులు దిద్దినట్లు తెలుస్తోంది.

బైట ఎవరయినా కాపలా వాళ్ళుంటారేమోనని పరికించి చూశాడు.

ముఖద్వారం దగ్గర ఎటెన్షన్‌లో నిలబడి వున్నాడో నీలంరంగు దుస్తులు ధరించిన కాత్రీ.

మంత్రించిన విగ్రహంలా నిల్చున్నాడతను.

విలియమ్ యెక్కడి కెళ్ళుంటాడు? భవనం వెనుక వైపుకి దారి వుంది. అక్కడంతా పొడుగాటి వృక్షాలున్నాయి గడ్డి అడ్డ-డ్డగా పెరిగిపోయి వుంది. అటువైపు వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు కిషోర్.

ఆ దిశగా నడిచాడు. పదడుగులు కూడా వెయ్యక ముందే అతని చెవులు అడుగుల చప్పుడ్ని పసిగట్టాయి. చటుక్కున సమీపంలోనే వున్న చెట్లవైపు పరుగులాంటి నడకతో చేరుకున్నాడు, భుజంమీద తుపాకీతో ఇద్దరు వ్యక్తులు అవే నీలం రంగు దుస్తులతో వస్తూ కనిపించారు.

వాళ్ళంతా కాపలావాళ్ళయ్యుండరు. గేటు దగ్గర ఎవరూ లేక పోవటంతో ఆ నిర్ణయాని కొచ్చాడు కిషోర్.

కానీ ఖచ్చితంగా ఈ భవనంలో సెక్యూరిటీ మనుషులున్నారనేది అర్థమయ్యింది.

వాళ్ళు ఇద్దరూ కిషోర్ ని దాటి ముందు కెళ్ళిపోగానే, చెట్లు చాటు చేసుకుంటూ చక చక ముందుకి నడిచాడు.

వెనుకవైపుకి చేరుకోగానే అతని కాళ్ళకి బ్రేకులు పడ్డాయి.

స్విమ్మింగ్ పూల్ వుందక్కడ. ఆ పూల్ ని అనుకుని వున్న గార్డెన్ లో పది కుర్చీల్లో ఆసీనులై వున్నారు కొంతమంది. బికినీలు ధరించిన అరడజనుమంది ఒంపు సొంపుల వయ్యారిభామలు స్విమ్మింగ్ పూల్ లో గిరికీలు కొడుతూ కేరింతలు కొడుతున్నారు.

ఆ పదిమందిలో విలియమ్ వున్నారేమోనని ఆత్రంగా వెదికాయి కిషోర్ కళ్ళు. ఊహూఁ.... లేడు!

చాలాసేపు చీకట్లో చెట్లగుబురులో నక్కి దాక్కుని ఏం చెయ్యాలో ఆలోచిస్తూ వుండిపోయాడు.

ఎంత ఆలోచించినా, ఆ భవనంలోకి ఓ అపరిచితుడు ప్రవేశించడానికి ఒకే మార్గం కనిపించింది.

అటుగా వస్తున్న వ్యక్తిమీదకి లాఘవంగా దుమికి స్పృహ పోగొట్టి, అతని దుస్తులు ధరించి. పర్యవసానాలన్నిటికీ తెగించి, లోపలకి ప్రవేశించటం ఒక్కటే .

అతని ఆలోచన క్రియారూపం దాల్చటానికెంతో సేపు పట్టలేదు.

# 8

"డియర్ ఫ్రెండ్స్! మనం ఎంతో పకడ్బందీగా పథకం వేసి 'సోలార్ ఎక్స్ప్లోజివ్స్'లో విలియం ఎడ్వర్డ్స్ స్థానంలోకి మన మనిషిని ప్రవేశపెట్టి ఆ సంస్థ

ప్లానింగ్ విభాగంలోని పదహారు భాగాల ఫార్ములా డాక్యుమెంట్సుని హస్తగతం చేసుకునే ఎసైన్ మెంట్ చేపట్టటం ఏమిటి—అప్పుడే ఇండియన్ సి.బి.ఐ. రంగ ప్రవేశం చేసి మన రహస్యాలన్నీ తెలుసుకోవటం ఏమిటి? వాడిని చంపేసి పదిరోజులు కూడా కాలేదు! అప్పుడే మరో గూఢచారి రంగంలోకి దిగాడు....” అన్నాడు సన్నగా పొడుగ్గా వున్న బెన్సన్.

“అతను సి.బి.ఐ. ఏజెంట్ కాదనిపిస్తోంది సర్—” అన్నాడొకడు.

ఆ గదిలో ఒక రౌండ్ టేబిల్ చుట్టూ సుమారు పది మంది ఆసీనులై జరుపుతున్న రహస్య సమావేశం అది....

“యూ ఆర్ రైట్—బహుశా ఇంటర్ పోల్ స్పై అయ్యుంటాడు—” అన్నాడు బెన్సన్,

“అతను ఎవడయినా దేవాంశవుడిలా వున్నాడు. తన అందచందాలతో ఎంతటి మొనగాడినైనా వలలో వేసుకుని, తన డెరింగర్ తో ఫినిష్ చెయ్యగల మాస్టర్ లేడీ కిల్లర్ రీటా బారినుంచి తప్పించుకుని—ఆమెను అదృశ్యం చేశాడంటే—” అంటున్నాడు మరో వ్యక్తి.

అదే క్షణంలో ఆ హాల్లోకి అడుగు పెట్టిన యిద్దరు వ్యక్తుల్లో ఒకడు “రీటా అదృశ్యం కాలేదు బాస్—యిదిగో—” తన పక్కనే వున్న అందాలరాశిని చూపించాడు.

“ఏమయ్యింది రీటా?” అడిగాడు బెన్సన్.

“వాడు స్పృహ తప్పించి తన ఎపార్టుమెంట్ లో బాత్ రూంలో కట్టేశాడు. పీటర్, ఫ్రాంక్ లు ఆ రాస్కెల్ శవాన్ని మోసుకుపోదామని వచ్చి నన్ను

బాత్ రూంలో మూసి విడిపించారు—" అందామె.

"డాం షేం. చెప్పటానికి సిగ్గు లేదూ? యింతకీ యెవడు వాడు? ఆ వివరాలేమయినా తెలుసుకో గలిగావా?"

"అత నెవరో గానీ ఖచ్చితంగా భారతీయుడే. అతని వేలికున్న ఉంగరంమీద హనుమంతుడి బొమ్మ వుంది—" అంది.

"ఓ. హిందూ?" అన్నాడు బెన్సన్ తేలిగ్గా.

"చాలా తెలివైనవా లా వున్నాడు బాస్. కరాటే కుంగ్ ఫూ లాంటి మార్షల్ ఆర్ట్సులో కూడా ప్రవేశం వుండొచ్చు. కండలు తిరిగిన అతని పెర్సనాలిటీని చూసి, నా కర్తవ్యం మర్చిపోయి కొన్ని నిముషాలు నిజంగానే అతని మోహంలో పడిపోయాను—" అందామె సిగ్గుతో తలవంచుకుంటూ.

"ఇంతకీ రాబర్టు యెక్కడ—?" అన్నాడు బెన్సన్.

"హియర్ బాస్!" అన్నాడు పొడుగ్గా దృఢంగా వున్న ఒక వ్యక్తి లోపలికి వస్తూ.

"రాబర్ట్....నీవు అనిష్టంగా నియమించిన ఆ పింటో యేం చేస్తున్నాడు? నిద్రపోతున్నాడా?" అన్నాడు బెన్సన్.

"లేదు బాస్—చాలా ఇంట్రెస్టింగ్ మెసేజ్ సేకరించాడు—"

"ఏమిటది?" అడిగాడు బెన్సన్ ఆతృతగా.

"ఆ గదిలో కదలకుండా ఖైదీలా వుండడానికి ఇష్టం లేక మోనికా వాడికి స్పృహ తప్పించింది, తప్పించుకో బోతూవుంటే ఆ గూఢచారి ఎవడో ఆమెను కలిసి

అభయం ఇచ్చాడట — అంతేకాదు— నేను అసలైన విలియమ్‌ని కానని, అతని డూప్‌నని తన అనుమానం వ్యక్తం చేసాడట" అన్నాడు రాబర్టు ఓ కుర్చీలో కూర్చుంటూ.

"అంటే నువ్వు విలియమ్‌లా నటించడంలో విఫలం అయ్యావనేగా అర్థం?" కోపంగా అన్నాడు బెన్సన్.

"లేదు బాస్. తనతో ఎంతో చనువుగా వుండే విలియమ్‌లో ఏదో మార్పు వచ్చిందని మాత్రమే ఆమె బాధపడుతున్న సమయంలో—ఆ రాస్కెల్ వచ్చి—ఈ అనుమానానికి బీజం నాటాడు-" అన్నాడు రాబర్టు.

"వాట్ నాన్సెన్స్. అసలామెకు ఆ అనుమానమే రాకుండా నువ్వు ఆమెతో చనువుగా ప్రవర్తించవలసింది!" అన్నాడు మరో వ్యక్తి—అప్పుడే లోపలికొస్తూ. అందరూ అటు చూసారు.

"కమాన్ మిస్టర్ న్యూటన్! అనుకున్న సమయానికంటే ఐదునిముషాలు ముందుగానే వచ్చావ్....! ఈ రోజు ఒక ఫైనల్ నిర్ణయానికి రాకపోతే కథ అడ్డంతిరిగే ప్రమాదం వుంది!" అన్నాడు బెన్సన్.

"ఇంకా ఎంతమంది రావాలి?" అన్నాడు న్యూటన్ నవ్వుతూ.

"ఆరుమంది!" అన్నాడు బెన్సన్.

"వెరీగుడ్. మన సొసైటీ సీనియర్స్ అందరూ కలుసుకోబోతున్నాం అన్నమాట!" అన్నాడు న్యూటన్ అదే చిరునవ్వుతో.

మరో పదినిముషాలలోగా మిగిలిన ఆరుమంది వచ్చేసారు. ఆ హాల్లో వున్న అన్ని కుర్చీల్లో సుమారు ఇరవైమంది కూర్చున్నారు ఇప్పుడు.

"డియర్ ఫ్రెండ్స్.... ఈ సంవత్సరంలో మనం తలపెట్టిన కార్యక్రమాల్లో ఇప్పటివరకూ అన్నీ విజయవంతం అయ్యాయి. కానీ ఈ ఆఖరి ఆపరేషన్ ఇలా మలుపు తిరగటం చాలా దురదృష్టకరం. ఇండియన్ ఏజెంట్స్‌కి తెలివితేటలు ఎక్కువ. సి.ఐ.ఏ. ఏజెంట్స్‌లా తొందరపడి అడుగులు వెయ్యరు.

అటువంటి సి.బి.ఐ.కి మనం ఆదిలోనే సరైన గుణపాఠం చెప్పకపోతే—ముందు ముందు మన 'కాస్మోక్రాట్స్ సొసైటీకే ముప్పు. ఆ ఏజెంట్ పేరేమిటి—ఆఁ—ఎవడో రామ్‌రాజ్....కదూ? వాడొక్కడే చాలా సమాచారం సేకరించి మనకెంతో ప్రమాదం తెచ్చిపెట్టాడు.

వాడు చచ్చిపోవడంతో సి.బి.ఐ. నిద్రపోదు. అంతకంటే సమర్థుడైన ఏజెంట్‌ని మనమీదికి ఉసిగొల్పుతుందని ఆనాడే ఊహించాను. ఇప్పుడు రంగంలోకి దిగినది నిజంగా సి.బి.ఐ. ఏజెంటే ఐతే—. ఈసారి వాడి చావు ప్రపంచ గూఢచారి దళాలకే సింహస్వప్నం కావాలి! అర్థమయ్యిందా?" అన్నాడు బెన్సన్.

"యస్ బాస్!" ఓ పది కంఠస్వరాలు ఒకేసారి బదులిచ్చాయి.

"ఇప్పుడు అసలు విషయానికొద్దాం — విలియమ్ భార్యకి తన భర్త నకిలీ అనే అనుమానం కలగటం చాలా ప్రమాదకరమైన మలుపు—! ఈ వ్యవహారంలో రాబర్ట్ సమర్థవంతంగా నటించలేక పోవటమే ఈ అనర్థాలకి కారణం అని నా అభిప్రాయం—" అన్నాడు బెన్సన్.

"లేదు బాస్—" అన్నాడు ఒక లావుపాటి వ్యక్తి లేచి నిల్చుంటూ.

"యస్. చెప్పు మిస్టర్ లాడ్-" అన్నాడు బెన్సన్.

"ఆ స్థానంలో ఎవరున్నా అంతకన్నా సమర్థవంతంగా నటించడం అసాధ్యం. ఎందుకంటే మోనికా విలియం ఒకరినొకరు ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు. వారిద్దరూ ఎంతో అనుకూలమైన దాంపత్య జీవితం అనుభవించారని తెలుస్తోంది. అటువంటి పరిస్థితిలో ఆమెతో శృంగారంలో సన్నిహితం అయితే ఆమె తన భర్తలోని మార్పుని పసిగట్టటం ఇంకా సులభం అయిపోతుంది—! అలా అని ఆమెకు దూరంగా వుంటే ఆమె అసంతృప్తి లోంచే అనుమానం పుట్టుకొస్తుంది!" అన్నాడు లాడ్ అనే వ్యక్తి.

"యస్—లాడ్ చెప్పింది కరెక్టు—" ఐదారుమంది అతని అభిప్రాయంతో ఏకీభవించారు.

"సోలార్ ఎక్స్ప్లోజివ్స్లాంటి పటిష్టమైన సంస్థలో రెండు నెలలుగా పనిచేస్తూంటే, అతను విలియం కాదని ఎవరూ గ్రహించకలేకపోయారంటే—రాబర్టు నటనని అభినందించి తీరాల్సిందే—" అన్నాడు మరో వ్యక్తి.

ఒక్క క్షణం నిశ్శబ్దం—

"ఓ.కే. మీరు చెప్పిన అభిప్రాయం—బావుంది. మరో వారం పదిరోజుల్లో విలియంని ప్లానింగ్ విభాగానికి పోస్టు చేస్తారు. అక్కడ చేరిన రెండు మూడు రోజుల్లో...." అంటున్న బెన్సన్ తక్కున ఆగిపోయాడు. అతని ఎదురుగా వున్న ఎర్రలైటు జిగ్ జిగ్ మని వెలిగింది.

సభ్యులందరి మొహాల్లో ఆందోళన అలుముకుంది.

చివాలున లేచి నిల్చున్నాడు బెన్సన్. చకచక పక్క గదిలోకి పరుగువేగంతో నడిచాడు.

ఎమర్జన్సీ లైటు వెలిగిందంటే ఏదో జరగకూడనిదే

జరిగిందన్న మాట—

రెండు నిముషాల్లో ఆ గదిలోకి సుమారు పాతికమంది సాయుధ మనుషులు ప్రవేశించి అందరినీ చుట్టుముట్టి ఎటెన్షన్‌లో నిలబడి వున్నారు

హడావుడిగా వచ్చాడు బెన్సన్ లోపలనుంచి—

"డియర్ ఫ్రెండ్స్. మీలో యెవరి దగ్గరో ఎలెక్ట్రానిక్ ట్రాన్స్‌మీటర్ వుందని మన కంప్యూటర్ పానల్ రిపోర్టు చెప్తోంది—! అంటే — మనలో నే యెవరో...." అంటున్నాడు బెన్సన్.

అదేక్షణంలో ఆ గదిలో ఓ మూలనుంచి గుప్పు గుప్పుమని పొగరావటం ప్రారంభించింది—

"వాటీజ్ దట్?" అరిచాడు బెన్సన్.

సభ్యులందరూ ఒకరినొకరు తోసుకుంటూ చెల్లాచెదురయ్యారు.

"ఆగండి! ఎవరూ కదలడానికి వీల్లేదు!" ఆందోళనగా అరిచాడు బెన్సన్.

"గార్డ్స్! అందరినీ వెదకండి!" గర్జించాడు బెన్సన్.

అదేక్షణంలో పొగవస్తున్న ఆ మూల "ఫట్ ఫట్" మని చప్పుడు వచ్చింది. పొగ దట్టంగా అలుముకుంటోంది గదంతా.

అప్పుడే రౌండ్ టేబిల్ కింద నుంచి పొగరావటం ప్రారంభం అయ్యింది—

అంటే—ఆ హాల్లో డిసిప్లిన్ పూర్తిగా కరువయ్యింది.

ఎవరో తరుముకొస్తున్నట్లు అందరూ బెన్సన్ వున్న దిశగా పరుగులీసారు.

బెన్సన్ ఆందోళనగా తన పక్కనే వున్న లాడ్ వైపు చూసి—

"జాడ్! వాళ్ళని కంట్రోల్ చెయ్యి...." అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్లు.

జాడ్ చిరునవ్వు నవ్వి—"ప్రాణభయం ప్రారంభం అయితే — ఎవర్నీ యెవరూ కంట్రోల్ చెయ్యలేరు బెన్సన్!" అన్నాడు.

"ఎవరు నువ్వు — " కంగారుగా అనబోయాడు బెన్సన్, అతను జాడ్ కాదని గ్రహించి. కానీ అప్పటికే అతని డొక్కలో రివాల్వర్ గుచ్చుకోవటం—"లోపలకి పద!" అని జాడ్ ఆజ్ఞాపించటం జరిగిపోయింది.

ఇద్దరూ పక్కగదిలోకి నడిచారు.

ఆ గదిలోకి వెళ్తూ—జాడ్ చిన్న గోళీకాయల్లాంటి పదార్థాలని జేబులోంచి తీసి చేత్తో పట్టుకున్నాడు.

"నో!" అన్నాడు బెన్సన్ ఆందోళనగా.

కానీ అప్పటికే వాటిని హాల్లోకి బలంగా విసిరికొట్టి-తలుపు మూసేశాడు జాడ్.

## 9

"నువ్వు....జాడ్‌వి కావు—" అన్నాడు బెన్సన్.

"సందేహమా? నా పేరు మిస్టర్ కె! నీ భాషలో చెప్పాలంటే బ్లడీ ఇండియన్ ఏజెంట్!" అన్నాడు.

"యూ స్కౌండ్రల్. ప్రాణాలతో తప్పించుకు పోగలనని అనుకుంటున్నావా?" ఆవేశంగా అన్నాడు బెన్సన్.

"ఈ గదిలోని ప్రముఖులందరూ ప్రాణాలు వదిలాక, నేను బ్రతకాలో, చావాలో నిర్ణయించుకుంటాను—" అంటున్నాడు జాడ్ వేషంలో వున్న కిషోర్.

అతనికి తెలుసు ఆ హాల్లో వ్యక్తులెవరూ ఇంకా మరణించలేదని, మెల్లిగా ఒక్కొక్కరూ స్పృహతప్పి,

నేలమీదకి ఒరిగిపోతారని!

ఆ క్షణంలో అతను ఊహించని విధంగా బెన్సన్ మెరుపులా వెనుతిరిగి కిషోర్ మొహంమీద బలంగా గుద్దాడు. అతని చేతిలోని పాయింట్ త్రీటూ కోల్టు కోబ్రా ఎగిరి దూరంగా పడింది.

అరక్షణం ఆలస్యం అయితే బెన్సన్ చేతిలో ప్రత్యక్షం అయిన రివాల్వర్ నుంచి దూసుకొచ్చిన బుల్లెట్స్ కిషోర్ ఛాతీలో దిగబడేవి....

కానీ....ఎడమవైపుకి జారుకుని, ఒక్క పల్టీ కొట్టాడు కిషోర్! రెండు బుల్లెట్స్ గురి తప్పాయి. మూడో బుల్లెట్ గురితప్పేసరికి—కిషోర్ కనిపించలేదు. ఆ గదిలో కుర్చీలు, డ్రమ్ములు, పెద్ద పెద్ద టి.వి. బాక్స్‌లు, పైపులు వున్నాయి.

బెన్సన్ ఆయాసంతో రొప్పుతూ ఒక్కసారి చుట్టూ కలయజూసి - ఛంగుమని కంప్యూటర్ కీబోర్డువైపు దుమికాడు.

ఎక్కడనుంచి ఎగురుకుంటూ వచ్చిందో ఒక ఇనుప హాండిల్ ఫట్‌మని తగిలింది బెన్సన్ తలకి. కళ్ళముందు నక్షత్రాలు మెరిసాయి! కుప్పలా కూలిపోయాడు....

తలుపుకున్న ఇనుప హాండిల్ విరగ్గొట్టి విసిరికొట్టటంతో గురి తప్పకుండా తగిలిందది. కిషోర్ మెరుపులా వచ్చి - క్రిందపడిన తన కోబ్రాని, బెన్సన్ చేతిలోంచి జారిపడిన రివాల్వర్ ని అందుకుని....అదే వేగంతో సమావేశం జరిగిన గదివైపు అడుగు వేశాడు. లోపల అందరూ అతను ఊహించినట్లుగానే నేలమీదకి ఒరిగిపోయి వున్నారు—

వాళ్ళల్లో-విలియంగా నటించిన నకిలీ విలియం అయిన

రాబర్ట్ కూడా వున్నాడని గ్రహించి - తన ప్యాంట్ కున్న సీక్రెట్ పాకెట్ లోంచి మినీబాంబుల ప్యాకెట్ పైకి తీశాడు. ఒక్కటి చాలు, ఆ హోలుని తునా తునకలు చెయ్యటానికి. కానీ అసలయిన విలియం ఎక్కడ?

ఒక్క క్షణం ఆలోచించి—కంప్యూటర్ కీ బోర్డు దగ్గరకి వచ్చాడు. సౌండ్ ప్రూఫ్ గదులు. బయట ప్రపంచానికి తెలియకుండా ఏర్పరచుకున్న 'కాస్మోక్రాట్ సొసైటీ' రహస్య స్థావరం.

కీ బోర్డుమీద ఎమెర్జెన్సీ బటన్స్ అన్నీ ఎర్ర రంగులో వున్నాయి. మిగతా వన్నీ నీలం రంగులో వున్నాయి. వాటిమీది అక్షరాలు యేమీ అర్థం కాలేదు. ఇ, ఎం, సి, టి, క. ఎఫ్....ఇలా వున్నాయి.

ఇ....అనే బటన్ నొక్కగానే తెరమీద జిగేల్ మని ఓ దృశ్యం కనిపించింది. ఆ బంగళా యెదురుగా వున్న రోడ్డు—అక్కడ ఒక మూల ఆగివున్న టాక్సీ. అప్పు డరమయ్యింది కిషోర్ కి. ఆ వరుసలో బటన్స్ నొక్కితే విలియం యెక్క డున్నాడో తెలుస్తుం దేమో....

వరుసగా బటన్స్ నొక్కసాగాడు కిషోర్....

స్విమ్మింగ్ పూల్. అక్కడదే కోలాహలం. వాళ్ళ వరో కూర్చుని తాగుతున్నా రింకా. మరో దృశ్యం—ఓ గదిలో ఒక స్త్రీ ఈల వేస్తూ స్నానం చేస్తోంది... ఎవరామె? రీటా....

వెంటనే పక్కనే వున్న 'ఎస్. ఎఫ్' అనే ఎర్ర బటన్ నొక్కాడు కిషోర్.

కెవ్వుమని అరుస్తూ కింద పడిపోయింది ఆమె. ఆ గది నిండా మంటలు! వెరీగుడ్....ఎస్.ఎఫ్ అంటే 'స్మాష్-

ఫయర్'. అదే కోడ్ ఇంటర్‌పోల్ కూడా ఉపయోగిస్తారు. అంటే ఇప్పుడు తన చేతిలో వున్న కీ బోర్డులో ఏ చాంబర్‌నైనా స్మాష్ చెయ్యొచ్చు. పక్కన "డిస్ట్రాయ్" అని రాసివుంటేనే అది సాధ్యం.

మరో బటన్ నొక్కాడు. ఓ గదిలో పదిమంది వృద్ధ కాయులు కూర్చుని భోజనం చేస్తున్నారు.

ఏ మాత్రం ఆలోచించలేదు కిషోర్ ....

"ప్రపంచ రాజ్యాలన్నిటినీ హస్తగతం చేసుకోవాలని, భయంకర మారణహోమాలకి సన్నాహాలు చేస్తున్న అత్యంత ప్రమాదకరమైన 'కాస్మోక్రాట్స్ సొసైటీ' నీడ కనిపించినా సరే—సర్వనాశనం చెయ్యటం నీ యేకైక లక్ష్యంగా భావించాలి...." అని తనమీద కొండంత విశ్వాసంతో సి.బి.ఐ. చీఫ్ బ్రహ్మాజీరావు చెప్పిన మాటలు కిషోర్ చెవుల్లో మారుమోగాయి.

వెంటనే "ఎస్, ఎఫ్" ఎర్ర బటన్ నొక్కాడు కిషోర్.

హాహాకారాలతో విరుచుకుపడిపోతున్నారు ఆ వృద్ధ కాయులు!

మరో బటన్ నొక్కాడు....

కిషోర్ మొహంలో ఆనందోత్సాహాలు వెల్లివిరిసాయి....

ఓ గదిలో—మంచంమీద నిద్రపోతున్నాడు ఒక వ్యక్తి. అతనే విలియం ఎడ్వర్డ్స్. రెండు నెలలకు పైగా బయట ప్రపంచంతో సంబంధ బాంధవ్యాలు తెగిపోయి ఒక ఖైదీలా మిగిలిపోయిన ఎడ్వర్డ్స్.

అదే క్షణంలో కాళ్ళ దగ్గర బెన్సన్ కదులుతున్నట్లు అనిపించింది. జేబులోంచి రివాల్వర్ తీసి, బెన్సన్ కణతకి

గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కాడు.

నెత్తురు జలపాతంలా తన్నుకొచ్చింది.

వెంటనే పక్కగదివైపుకి అడుగులు వేశాడు.

సిద్ధంగా వున్న మినీ బాంబ్‌ని తీసి సేఫ్టీపిన్ లాగి, ఆ గదిలోకి విసిరికొట్టాడు. "ఢాం...." చెవులు చిల్లులు పడే శబ్దం....

ఆ గదిలో మంటలు చెలరేగాయి. స్పృహలోకి రాబోతున్న ఒకరిద్దరూ హాహాకారాలు చేస్తూ నేలకూలి పోయారు.

కంప్యూటర్ తెర మీద విలియం ఎడ్వర్డ్స్‌కి ఆ ధ్వనులు వినిపించాయి. అతనికే కాదు, ఆ మేడలో వున్న ప్రతి ఒక్కరికీ వినిపించేంత భయంకరమయిన విస్ఫోటం!

విలియం గది యెటువైపు వుంటుందో వూహించుకొంటూ నాలుగడుగులు వేశాడు. ఎడమవయిపుకి దారి కనిపించింది. అక్కడ ఓ గది తలుపు చప్పుడౌతోంది. జేబులోంచి కోబ్రాని తీసి తాళంవైపు గురి చూసి పేల్చాడు. తలుపులు తెరవగానే ఎదురుగా కనిపించాడు విలియం ఎడ్వర్డ్స్.

"ఎవరు మీరు?" అన్నాడతను.

"మీ శ్రేయోభిలాషిని. నన్ను మిస్టర్ క—అంటే చాలు! రండి—ఈ కాస్మోక్రాట్స్ సొసైటీ మహామహులు అంతా చచ్చారు—"

"వాట్—" ఆశ్చర్యపోయాడు విలియం.

కిషోర్ ఒక చిరునవ్వు నవ్వి—"ఇది ఒక బ్రాంచ్ మాత్రమే—వాషింగ్‌టన్‌లోని సంస్థ ఒకటే నాశనం

అయితే యేమౌతుంది? యింతకంటే భయంకరమయిన కాస్ట్రో కాట్ సొసైటీ శాఖలు—ప్రపంచం నలుమూలలా వున్నాయ్—" అన్నాడు.

"మీరు చెబుతున్నది నిజమేనా?! .." అన్నాడు ఎడ్వర్డ్స్.

"ఏ విషయం?"

"వాషింటన్ ముఠావారిని స్మాష్ చెయ్యటం—" అన్నాడు.

కిషోర్ అతని చెయ్యి పట్టుకుని ముందుకి లాక్కుపోయాడు. విలియం ఎడ్వర్డ్స్ నిర్ఘాంతపోయాడు ఆ రాక్షసుల శవాలను చూసి—ఆనందబాష్పాలతో కిషోర్ని కౌగలించుకుని—

"నువ్వెవరివో నాకు చెప్పక్కర్లేదు. ఏ దేశ గూఢచారివైనా—నువ్వొక అంతర్జాతీయ గూఢచారివి....నిన్ను కన్న దేశం ధన్యమయ్యింది!" అన్నాడు.

"మీ అభినందలు నాకు యిప్పుడు కాదు అందించాల్సింది. మీ ప్రియమైన శ్రీమతి మోనికాని కాపలా కాస్తున్న కుక్క నుంచి ఆమెను రక్షించగలిగితే—" అన్నాడు కిషోర్.

# 10

ఎమిలీ ఎపార్టుమెంట్స్—

మూడో అంతస్తు—

నూటఎనభైవదో ఎపార్టుమెంట్....

కాలింగ్ బజర్ మోగగానే, తలుపులు తెరిచాడు జాన్ పీటర్. ఎదురుగా నిలబడి వున్న విలియం ఎడ్వర్డ్సుని చూసి నివ్వెరపోయాడు. అతను రాబర్టు కాదని, మోనికా భర్త విలియం అని అతని మానిపోయిన గడ్డం

చెబుతోంది.

అతని గుండె ఆగినంత పనయ్యింది. గిరుక్కున వెను తిరిగాడు....

“హాండ్సప్ మిస్టర్ పింటో—” అరుపు వినిపించి అదిరిపడి వెనక్కి చూశాడు.

వాషింగ్టన్ పోలీస్....

పింటోని వెంటనే కస్టడీలోకి తీసుకున్నారు....

విలియం ఎడ్వర్డ్స్ ఇంక ఒక్క క్షణం అక్కడ వుండలేక పోయాడు.

“మోనికా!” అని అరుస్తూ—తలుపు దగ్గరకి పరుగెత్తాడు.

తలుపులు తెరుచుకుని ఆ గదిలోంచి బైటికొచ్చిన మోనికా భర్తని చూసి....పట్టరాని ఆనందంతో పరుగెత్తుకుంటూ వచ్చి అతన్ని పెనవేసుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది....

“విలియమ్! మీ ఇంట్లో దొడు తీస్తున్న తైలవర్ణం చిత్రానికి కనెక్టు చేసిన మైక్రోఫోన్ ద్వారా నా కంఠం వినిపిస్తుంది. నేను మరో నాలుగైదు గంటల్లో ఆ మైక్రోఫోన్‌కి అందనంత దూరంలో వుంటాను” అంటూ మిస్టర్ క....చెప్పిన మాటలు గుర్తుకు రాగానే—

విలియం ఎడ్వర్డ్స్ చూపు ఆ మైక్రోఫోన్ వైపు పాకింది.

—:అయిపోయింది:—

సీరియల్-

# విహారి కోయిల

## బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

"సారీ సుస్మితా అయాం వెరీ సారీ ... పశువులా ప్రవర్తించాను" అన్నాడు సిద్ధార్థ ఆమె ముఖంలోకి చూడలేక.

అయితే ఇతనికంతా గుర్తుందన్నమాట!

సుస్మిత పెదాలమీద, చిరునవ్వు మెరిసింది. సిద్ధార్థ ఆమెవైపు చూసివుంటే నిర్ఘాంతపోయి వుండేవాడు ఆమె నవ్వుకోవటం చూసి.

"మీరు మనిషిలాగే ప్రవర్తించారు" అన్నది కూల్‌గా.

"సుస్మితా, జరిగిందానికి నేను బాధపడుతున్నాను" అన్నాడు సిద్ధార్థ.

"నేను బాధపడటం లేదు."

"అంటే!?"

"అదంతే. జరిగిన తప్పులో నాక్కూడా సగం బాధ్యత వున్నది. రెండు చేతులు కలిస్తేనే కదా చప్పట్లు!"

"కాని, నే నేదో మైకంలో, ఒళ్ళు తెలియని పరిస్థితిలో....అలా ప్రవర్తించాను."

"నాకు తెలుసు. మనం తిన్న పళ్ళు ఈ విధంగా తమ ప్రతాపం చూపించాయి."

"ఏది ఏమైనా తప్పు జరిగిపోయింది. అందుకు నా నుంచి నీకు న్యాయం జరగాలి. నీకు న్యాయం చేయటానికి సిద్ధంగా వున్నాను."

"ఏం చేస్తారు?"

"నిన్ను పెళ్ళి చేసుకుంటాను."

కోటి వీణలు శృతిబద్ధంగా చెవుల్లో మోగుతున్న అనుభూతి చెందింది సుస్మిత.

"మీరు నన్ను పెళ్ళి చేసుకుంటారా!"

"అవును. నీకు జరిగిన అన్యాయాన్ని నేను చేసిన తప్పును సరిదిద్దుకోవటానికి అదే సరైన మార్గం!"

ఒక్క క్షణం మౌనంగా అతని ముఖంలోకి చూసింది సుస్మిత. "అంటే, నాకు అన్యాయం జరిగింది కాబట్టి నన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారు. అంటే కేవలం జాలితోను. సానుభూతితోను సిద్ధమవుతున్నారు. అంతే కదూ!?"

ఇబ్బందిగా చూశాడా మెతంక సిద్ధార్థ.

"నా ఉద్దేశ్యం...." ఏదో చెప్పబోయాడు. మాటలకి తడుముకోవలసి వచ్చింది.

"మీకు నా మీ దున్నది కేవలం సానుభూతి మాత్రమే! నా మీద మీకు మరెలాంటి అభిప్రాయం లేదు. అవును కదూ!?"

సిద్ధార్థ మౌనం వహించాడు.

'నిన్ను ప్రేమిస్తున్నాను. అందుకే నిన్ను కోరుకుంటు

న్నాను! అని అతడంటాడేమోనని ఒళ్ళంతా కళ్ళు చేసు కుని చూస్తోంది సుస్మిత.

కాని ఆ సమయానికి సిద్ధార్థ కళ్ళలో దివ్య మెదుల్తోంది. 'నీకు ద్రోహం చేస్తున్నాను దివ్యా! నన్ను క్షమించు' అనుకొంటున్నాడు మనసులో.

అతని మనసుని కాగితంమీద అక్షరాలు చదివినంత సునాయాసంగా చదివేసింది సుస్మిత. అతని మనసులో తను లేదని తెలిసిపోయింది అలా అనుకోగానే ఆమె కన్నె హృదయం బాధగా వేదనగా మూలిగింది.

"చూడండి సిద్ధార్థా! మనసులేని మనువును నేను కోరు కోవటం లేదు. జరిగిందేదో జరిగిపోయింది. దాన్ని ఇద్దరం మరచిపోదాం. కాని మిమ్మల్ని ఒక్క కోరిక కోర్తు న్నాను. మీ వలన నాకేదో అన్యాయం జరిగిపోయిం దన్న విషయం మీ మనసులోనికి రానివ్వకండి. జరిగింది మర్చిపోండి!" తేలిగ్గా నవ్వేస్తూ అన్నది సుస్మిత.

ఆమె నవ్వులో జీవం లేకపోవటం సిద్ధార్థ గుర్తిం చాడు. ఆమె ముఖంలోకి చూడటానికి ధైర్యం చాల్లే దతనికి.

సుస్మిత మళ్ళీ తనే అన్నది: "చూడండి సిద్ధార్థా! మన మిప్పుడున్నది జనసంచారం లేని కటిక ఎడారిలో. మనం బతికి బయటపడతామో లేదో ఆ భగవంతుడికే తెలి యాలి తప్ప, మనకి తెలీదు. అలాంటి విపత్కర పరిస్థి తుల్లో మనం పెళ్ళి గురించి మాట్లాడుకోవటం వింతగా లేదూ!? అంతే మనిషి యెంతటి ఆశావాదో నాకిప్పు డర్థమయింది. అశాశ్వతమైన మన జీవితాల్ని శాశ్వతమైన వివాహబంధంతో కట్టిపడెయ్యాలని పిచ్చిలెక్కలు వేస్తు న్నాము.... ....పడుకోండి, తెల్లారి మన ప్రయాణం

సాగించుదాం."

అప్పుడు నోరు విప్పాడు సిద్ధార్థ. "నువ్వు నడవగలిగితే మనం ఇప్పుడే ప్రయాణం చెయ్యటం మంచిది. తెల్లారితే యెండ వేడిమికి తట్టుకోలేం. దాహం, ఆకలి...."

సుస్మిత అతను ఆలోచనలో ఆగిపోవటం చూసి నవ్వుకొన్నది. "కరెక్టే! వెన్నెల పుచ్చపువ్వులా ఉన్నది. ఇప్పుడే మనం ప్రయాణం కొనసాగిస్తే తెల్లవారేసరికి యేదైనా జనసంచారమున్న ప్రాంతం చేరుకోగలమేమో! ప్రయత్నిద్దాం" అన్నది.

ఇద్దరు అప్పటికప్పుడు బయల్దేరారు.

* * *

ఓ గంట పాటు ఇద్దరు అలాగే ఇసకలో అడుగుతీసి అడుగు వేస్తూ నడిచారు.

వాళ్ళకి దూరంగా ఇసక గాల్లోకి రేగిన సూచన కనిపించింది.

'మళ్ళీ మరో ఇసక తుఫాను కాదుగదా' అనుకున్నాడు సిద్ధార్థ.

కాసేపట్లోనే అదేమిటో తెలిసిపోయింది వాళ్ళకు.

ఒకదాని వెంట మరొకటి నాలుగు ఒంటెలు కనిపించాయి. వాటిమీద మనుషులున్నారు.

ఆనందంగా అరిచింది సుస్మిత. "మనుషులు! ఫరవాలేదు, వాళ్ళు మనకి సాయపడతారు" అన్నది.

సిద్ధార్థ తల పంకించాడు.

"వేగంగా అటు నడువు. వాళ్ళు కనుమరుగైపోకుండానే మనం వాళ్ళనందుకోవాలి!" అన్నాడు.

ఇద్దరు ఇసకలో పడుతూ లేస్తూ ఒంటెలు పయని

స్తున్న వైపు నడకసాగారు.

ఒంటెలు బాగా దగ్గరయ్యాయి. దానిమీదున్న మనుషులు ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నారు.

సిద్ధార్థ ఎలుగెత్తి పిలుస్తూ చేతులెత్తి వాళ్ళవైపు సంకేతం పంపించాడు ఆగమని.

ఒంటెలు ఆగాయి. వాటిమీదున్న వ్యక్తులు సుస్మితను, సిద్ధార్థను విస్మయంగా చూశారు.

సిద్ధార్థ వాళ్ళను చూస్తూనే ఉలిక్కిపడ్డాడు. వాళ్ళు చాలా కర్కశంగా మొరటుగా వున్నారు.

సుస్మిత వాళ్ళను చూడగానే, ఉత్సాహమంతా నీరుకారిపోగా అలాగే నిల్చుండిపోయింది.

వాళ్ళేదో అడిగారు. ఆ భాష సిద్ధార్థకి అర్థంకాలేదు. హిందీలా ధ్వనించిందిగాని, హిందీ కాదు. ఎవరు మీరని అడుగుతున్నారని అర్థం చేసుకున్నాడు.

విమానం నుంచి పడిపోయామని అర్థం వచ్చేలా సైగలు చేస్తూ హిందీలో చెప్పాడు.

వాళ్ళకి అర్థమయినట్టే కనిపించింది. మళ్ళీ యేదో అడిగారు. ఎక్కడికి పోవాలని అడుగుతున్నట్టు గ్రహించాడు సిద్ధార్థ.

“మమ్మల్ని యేదయినా గ్రామానికి చేర్చండి” అన్నాడు సిద్ధార్థ అభినయించి చూపుతూ.

వాళ్ళు అంగీకరించారు.

ఓ వ్యక్తి సుస్మితని ఒంటెమీదికి చేదుకున్నాడు. మరో వ్యక్తి సిద్ధార్థని యెక్కించాడు, తన ఒంటె మీద.

వాళ్ళు తామనుమానించినట్టు క్రూరత్వమున్న మనుషులు కాదని సుస్మిత, సిద్ధార్థ గ్రహించారు.

అయితే వాళ్ళ అంచనా ఘోరంగా తప్పిందని వాళ్ళిద్దరికీ త్వరలోనే తెలిసివచ్చింది.

* * *

ముందుగా రెండు ఒంటెలు నడుస్తున్నాయి.

మూడో ఒంటెమీద సిద్ధార్థ, నాలుగో దానిమీద సుస్మిత కూచుని వున్నారు.

ఎందుకో సిద్ధార్థ వైపు చూసిన సుస్మిత ఒక్కసారిగా కెవ్వున అరిచింది.

"సిద్ధార్థా! కిందికి దూకెయ్యి" అని గొంతెత్తి చెప్పింది

సిద్ధార్థ చటుక్కున తన వెనుక కూచున్న వ్యక్తివంక చూశాడు. అతని చేతిలో తళుక్కుమని మెరిసిన పొడవాటి కత్తిని గుర్తించాడు సిద్ధార్థ.

అయితే భయపడి కిందికి దూకెయ్యలేదు సిద్ధార్థ. అతని చెయ్యిని చటుక్కున మెలిపెట్టి మరో చేత్తో ఆ కత్తిని లాక్కున్నాడు.

ఆ వ్యక్తి సిద్ధార్థ గుండెలమీద తన్నాడు.

ఆ వూపుకి యిద్దరు ఒంటెమీది నుంచి యిసకలో పడ్డారు.

ముందు ఆ వ్యక్తి, అతనిమీద సిద్ధార్థ పడ్డారు. ఆ అదురుకు సిద్ధార్థ చేతిలోని కత్తి యెగిరి యిసకలో పడింది.

ఈలోపల తన నడుమును బంధించబోతున్న వ్యక్తి చేతుల్నించి లాఘవంగా విడిపించుకుని కిందికి దూకేసింది సుస్మిత. వాళ్ళ పన్నాగమేమిటో ఆమె కర్థమయిపోయింది.

మెరుపు వేగంతో సిద్ధార్థకి సాయంగా అతనివైపు

పరుగెత్తింది. ఇసకలో పడిపోయిన కత్తిని చేతచిక్కించుకుంది.

ఈ లోపల ఆమెని ఒంటెమీద ఎక్కించుకున్న వ్యక్తి పరుగున వచ్చి ఆమెను వెనుకనుంచి వాటేసుకుని తన మీదకు లాక్కోబోయాడు.

అంతే! మహావేగంగా కత్తిని అతని పొట్టలో దించేసింది సుస్మిత. ఒక్కసారి కాదు నాలుగైదుసార్లు.

ఆ మనిషి పర్వతంలా నేలకూలాడు.

ఈ లోపల సిద్ధార్థ తనని చంపబోయిన వ్యక్తిని పొత్తికడుపులోను, తొడల మధ్య బలంగా తన్ని ఇసకలో పొర్లించాడు.

ఇంతలో ముందు వెళ్తున్న రెండు ఒంటెలు ఆగిపోయాయి. వాటిమీదున్న మనుషులిద్దరు చేతుల్లో పొడవాటి కత్తులు ధరించి వెనక్కి పరుగెత్తుకుని వచ్చారు.

వాళ్ళు దగ్గరికొచ్చేంతలో గుప్పెళ్ళతో ఇసక తీసుకుని సూటిగా వాళ్ళ కళ్ళలోకి చిమ్మింది సుస్మిత.

జరిగిందేమిటో వాళ్ళు గ్రహించేలోపల వాళ్ళిద్దర్ని కాళ్ళు అడ్డుపెట్టి నేలమీద పడగొట్టాడు సిద్ధార్థ. ఈ లోపల వాళ్ళ చేతుల్లోని కత్తులు లాగేసుకున్నారు సిద్ధార్థ, సుస్మిత.

అయితే సరిగ్గా అప్పుడే ఊహించని ఘోరం జరిగిపోయింది.

సిద్ధార్థ వల్ల పొత్తికడుపులో తన్నులు తిని చచ్చినట్టు పడివున్న వ్యక్తి మెరుపువేగంతో సిద్ధార్థను సమీపించి అతని వెన్నున కత్తి దింపబోయాడు.

సిద్ధార్థ తప్పించుకునే వ్యవధి లేదు!

సుస్మిత ముందుగా ప్రమాదాన్ని గుర్తించి ఆ వ్యక్తిని తన చేతిలోని కత్తితో అటకాయించింది. తన ప్రయత్నం విఫలమయిందన్న కోపంలో ఆ వ్యక్తి సుస్మిత గుండెల్లో బలంగా కత్తితో పొడిచేశాడు.

అంతా క్షణాల్లో జరిగిపోయింది.

సుస్మిత కెవ్వున అరిచి నేలకూలిపోయింది.

ఆమె ఆర్తనాదం వింటూనే సిద్ధార్థ వెనుదిరిగి ఆమె గుండెల్లో కత్తి దింపిన వ్యక్తిని పొడవాటి కత్తితో అందిన చోటల్లా నరికేశాడు.

ఈ లోపల కళ్ళలో ఇసక పడ్డంవల్ల నేలమీద పడిపోయిన యిద్దరు మనుషులు లేచి సిద్ధార్థమీద దాడి చేశారు.

రెండు చేతుల్లోను రెండు పటాకత్తులు ధరించి వున్న సిద్ధార్థ వాళ్ళిద్దరిమీదికి లంఘించాడు.

నిరాయుధులుగా వున్న ఆ వ్యక్తులిద్దరు తలలు మొండేల నుంచి వేరైపోగా హాహాకారాలు చెయ్యకుండానే నేలకూలిపోయారు.

ఒక్క అంగలో సుస్మితను చేరుకుని, నేలవాలిపోయిన ఆమె శరీరాన్ని తన ఒడిలోకి తీసుకుని "సుస్మితా, సుస్మితా...." అంటూ ఆక్రందన చేశాడు సిద్ధార్థ.

బరువుగా వాలిపోతున్న కనురెప్పల్ని అతి ప్రయత్నం మీద పైకెత్తి అతని వంక చూసింది సుస్మిత.

అప్పటికే ఆమె ప్రాణాలు కళ్ళలోకి వచ్చేశాయి. అయినా యే శక్తో యింకా ఆమెకు మాట్లాడగలిగే ఓపిక నిచ్చింది.

"ఏమండీ....మీరు క్షేమంగానే వున్నారు కదూ!?
వాళ్ళు నలుగురు చచ్చా....రా?" అడిగింది యెలాగో
కూడబలుక్కుంటూ.

"చచ్చారు సుస్మితా....మాట్లాడు సుస్మితా....ఎలా
వుంది....?" ఆమెను కావలించుకుని యేడ్చేస్తున్నాడు
సిద్ధార్థ.

"నేనిక బతకను....మీరు ప్రమాదం నుంచి తప్పించు
కున్నారు. అంతే చాలు....ఒంటెలు సిద్ధంగా వున్నాయి.
ఏదో ఒక ఒంటెమీద క్షేమంగా ఎడారి దాటెయ్యండి.
అందరూ వీళ్ళలాంటి దుష్టులే వుండరు....మీ కెవరో
ఒకరు సాయం చెయ్యకపోరు.... నేను.... వెళ్ళిపోతు
న్నాను...."

"అంత మాటనకు సుస్మితా....రెండుసార్లు నా
ప్రాణాల్ని కాపాడి నన్ను ఋణగ్రస్తుడ్ని చేసి, నువ్వెళ్ళి
పోతావా?... నే నీ భారం మోయలేను.........నన్ను
క్షమించు....నీ పట్ల చాలా అమానుష్యంగా ప్రవర్తిం
చాను...."

" ఎందుకలా మాట్లాడతారు? నేను ఎప్పట్నుంచో
చెప్పాలనుకున్న మాట యిప్పుడు.... ఈ చివరి క్షణాల్లో
చెప్తున్నాను. నేను మిమ్మల్ని మనసారా ప్రేమించాను'
ఆరాధించాను, మీ అర్ధాంగిని కావాలనుకున్నాను. కాని
యెప్పుడూ నా మనసు.... మీ....ముందుం....చ లేదు....
అనుకో....కుండా ఈ ఎడా....రిలో... మీ దాన్న
య్యాను ... నా స్త్రీ జన్మ....సార్థక....మయింది. నా
కంతకన్నా పెద్ద కోరిక లేదు....నన్నొక్కసారి కౌగ
లించు....కుని ముద్దు పెట్టుకోరూ!?...."

"సుస్మితా, సుస్మితా....ఐ లవ్ యూ....ఐ లవ్

యూ సుస్మితా...." ఆమెను అక్కున చేర్చుకుని ఆమె నుదుట పిచ్చిగా ముద్దులు పెడుతూ దుఃఖంతో వివశుడయి పోతూ అన్నాడు సిద్ధార్థ.

"చా....లు నా కెంతో....తృప్తిగా ..." ఆ తర్వాత ఆమె నోట మాట వెలువడలేదు.

ఒక్క క్షణం ఆమె ముఖంవైపు తేరిపార చూసి, బావురుమన్నాడు సిద్ధార్థ.

హృదయభారం తీరేవరకు అలా ఏడుస్తూనే వున్నాడు సిద్ధార్థ.

అతని చేతుల్లో చివరి ఊపిరి తీసుకున్న సుస్మిత ముఖంలో చెప్పలేని సంతృప్తి!

దాదాపు ఓ గంటవరకూ మామూలు స్థితికి రాలేక పోయాడు సిద్ధార్థ.

ఆ తర్వాత ఆమె శరీరంలో గుచ్చుకున్న కత్తిని బయటకు లాగేశాడు. ఆమె శరీరం క్రమంగా వేడిని కోల్పోయి కట్టెలా బిగుసుకుపోయింది.

అక్కడే మోకాళ్ళమీద కూచుని ఇసకని బాగా పెళ్ళగించి లోతుగా గొయ్యిని తయారుచేశాడు. ఆ గోతిలో సుస్మిత శరీరాన్ని వుంచి ఇసకతో కప్పేశాడు. ఆ పని చేస్తున్నంతసేపు అతని కళ్ళనుండి కన్నీరు అవిరళ ధారగా కారుతూనే వున్నది.

"నీ ప్రాణత్యాగంతో నా ప్రాణాన్ని నిలబెట్టి నన్ను కృతఘ్నుడిగా చేసేశావు సుస్మితా! నీకిదే నా శ్రద్ధాంజలి!" ఆమెను సమాధి చేసినంతవరకు అతను ఆమెను స్మరించుకుంటూనే వున్నాడు.

అప్పుడు సమయం తెల్లవారుఝామున నాలుగ్గంట అయ్యింది.

ఎదురుగా నాలుగు ఒంటెలు నిల్చునివున్నాయి యజమానుల ఆజ్ఞకోసం.

సిద్ధార్థ వాటిలో ఓ ఒంటెను ఎన్నుకున్నాడు. ఓక త్రిని వెంట వుంచుకున్నాడు. దాని మూపుమీదికి ఎగబ్రాకి యెక్కాడు.

జీవితంలో మొదటిసారిగా ఒంటెమీద ఆ ఎడారిలో ముందుకు ప్రయాణం సాగించాడు సిద్ధార్థ.

  

తెల్లవారింది.

ఎండ చురచుర పొడుచుకొచ్చింది.

సిద్ధార్థ ఒంటెమీద అలా ముందుకు సాగిపోతూనే వున్నాడు.

కనుచూపు మేరలో జనావాస ప్రాంతమేదీ అతనికి కనిపించలేదు.

ఓ పక్క సుస్మితను గురించిన ఆలోచనలు, ఆమె విషాదాంతం అతని గుండెను పట్టి నలిపివేస్తుంటే, మరోపక్క యెలాగైనా ఆ ఎడారి నుంచి బయటపడి యేదయినా సురక్షిత ప్రాంతం చేరుకోవాలని అతని మనసు ఆరాటపడుతోంది.

సూర్యుడు నడినెత్తిమీదికొచ్చాడు.

ఇసక కాలిపోయి వేడి ఆవిరి మొహానికి ఈడ్చికొడుతోంది. దాహం మొదలై దాని తీవ్రత అంతకంతకు పెరుగుతోంది.

మళ్ళీ నిన్నటి పరిస్థితి యెదురయ్యింది. గతరాత్రి ప్రాణం నిలుపుకోటానికి తిన్న పళ్ళవలన జరిగిన రాద్ధాంతం, ఆ తర్వాత సంభవించిన విపత్తు అతనికి గుర్తొస్తున్నాయి.

అకస్మాత్తుగా అతని కెక్కడినుంచో విమానం రొద వినిపించింది.

చెవులు రిక్కించి విన్నాడు సిద్ధార్థ.

అనుమానం లేదు. విమాన ప్రొపెల్లర్ శబ్దం స్పష్టంగా వినిపిస్తోందీసారి.

ఒక్కసారిగా అతనిలో నూతనోత్తేజం, ఆశ ఒక దానితో మరొకటి పోటీపడ్డాయి.

అది యే దేశానికి చెందిన విమానమైనా ఫరవాలేదు, తనని తప్పక రక్షిస్తారు.

ఆకాశంవయిపు కళ్ళు చిట్లించి చూశాడు సిద్ధార్థ.

విమానం చాలా యెత్తులో యెగురుతోంది. దాదాపు నాలుగు మైళ్ళ యెత్తులో నాలుగువందల నాట్స్‌కి తక్కువ కాని వేగంతో పయనిస్తోన్న ఆ విమానం తన ఉనికిని గుర్తించగలదనుకోవటం ఉత్త అత్యాశే అవుతుంది తప్ప, యేం ప్రయోజనముండదని గ్రహించి నిరాశపడ్డాడు సిద్ధార్థ.

చిన్న పక్షిలా కనిపించిన ఆ విమానం కొద్దిక్షణాల్లో కనుమరుగైపోయింది.

అవకాశం అందినట్టే అంది చేజారిపోవటం యెంత బాధాకరమయిన విషయమో అనుభవపూర్వకంగా తెలిసిందతనికి.

సమయం మధ్యాహ్నం రెండు గంటలు కావస్తోంది. ఎండ నిప్పులు చెరుగుతోంది.

సిద్ధార్థకి ఆకలి, దాహం కూడా అవుతున్నాయి. నిస్త్రాణ. నీరసం మేమూ ఉన్నామంటూ అతన్నాశ్రయించాయి.

ఎటు చూసినా.... ఇసుక.... ఇసుక.... ఇసుక... మహా

సముద్రంమీద ప్రయాణం చేసేవాడికి ఏ వైపు చూసినా నీరే కనిపించనట్టుగా ఆ యెడారిలో ఒంటరిగా ప్రయాణిస్తున్న సిద్ధార్థకి యెటు తలతిప్పి చూసినా ఎర్రగా కాలిపోతున్న ఇసక కనిపిస్తోంది. మధ్య మధ్య గాలి కెగిరి కళ్ళలో పడ్తోంది. ఎంతసేపని కళ్ళకి చేతులడ్డం పెట్టుకోగలడు?

* * *

చూస్తూండగానే చీకటి పడిపోయింది.

అంతవరకు వేడి గాడ్పులలో బీభత్సం సృష్టించిన వాతావరణం క్రమేపీ చల్లబడింది.

అనంతమైన ఎడారిలో సిద్ధార్థ అలా సాగిపోతూనే వున్నాడు.

చీకటిపడుతూనే ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తూ ప్రత్యక్షమయ్యాయి.

ఒంటె యేమాత్రం అలుపు సొలుపు లేకుండా అలా ప్రయాణం చేస్తూనే వుంది ఎడారిలో. దానికి ఎడారి ఓడ అనే పేరెందుకొచ్చిందో అర్థమయ్యింది సిద్ధార్థకి.

ఆకలి, దాహం అతన్ని పట్టి పీడుస్తున్నాయి. ఉదయం నుంచి యెడతెరిపి లేకుండా అలాగే ఒంటె మీద కూచుని ప్రయాణం చేస్తూండటంవల్ల అతని నడుములు నొప్పి పుడుతున్నాయి. ఎక్కడయినా విశ్రమించాలని వున్నా, అతను ఆగదలచుకోలేదు.

మరో అరగంట ప్రయాణం సాగింది.

నక్షత్రాల వెలుగులో దూరంగా ఇసక రేగటం గమనించాడు సిద్ధార్థ.

మళ్ళీ యేమైనా ఒంటెలు అటు వస్తున్నాయా?

ఒకే ఒక జంతువు దుమ్ము రేపుతూ అటే పరుగెత్తుకొస్తోంది.

పరీక్షగా చూసి త్రుళ్ళిపడ్డాడు సిద్ధార్థ. అతని చేయి పట్టాకత్తిమీద బిగుసుకుంది.

ఆ జంతువు ఒంటె కాదు. ఏదో...!? తనెప్పుడూ అలాంటి మృగాన్ని చూడలేదు.

చాలా భయంకరమైన జంతువది! ఎత్తుగా పొడవుగా సింహం ఆకారంలో వుంది. నోటినుంచి ఒకే ఒక దంతం చాలా సూదిగా బయటకు పొడుచుకు వచ్చి చూపరుల గుండెను దడపుట్టించేలా వుంది.

దాని కళ్ళు అగ్నిగోళాల్లా మెరుస్తోన్నాయి. దాని ఒంటినిండా దట్టమైన బొచ్చు ఆవరించుకుని వుంది, ఎలుగుబంటి శరీరం మీది బొచ్చులా. దాని నోటి చివరల నుంచి నురగ చొంగలా కార్తోంది.

దానికి తోక లేదు. కాళ్ళు నాలుగు బలంగా నేల మీద తేలిపోతున్నట్టుగా చెంగున గెంతుతూ వస్తోంది. దాని కాళ్ళు ఇసుకలో యెందుకు కూరుచుకుపోవటంలేదో అతని కర్థంకాలేదు.

అది క్రూరజంతువని చూడగానే తెలిసిపోతోంది. అది మాంసాహారో, శాఖాహారో అతడికి తెలియదు. దానివల్ల తన కేదయినా హాని కలగవచ్చునని మాత్రం అతని సిక్స్త్ సెన్స్ హెచ్చరిస్తోంది.

ఏమో, అది మనిషి మాంసం రుచి కలవాటు పడిన క్రూరజంతువేమో, యెవరు చెప్పగలరు?

సృష్టిలోని ప్రతి ప్రాణి ఆహారం కోసం మరో ప్రాణిపై ఆధారపడి బ్రతుకుతోంది. అది తనకి హాని

చిక్కని పక్షంలో తనపైకే యెందుకలా పరుగెత్తు కొస్తోంది!?

ఒంటె ఆ మృగాన్ని చూస్తూనే వింతగా శబ్దం చేసింది.... ముందు కాళ్ళమీద గాల్లోకి లేచింది.

అనుకోని ఈ చర్యకు సిద్ధార్థ నేలమీదకు జారిపడి పోయుండేవాడే! కాని, ఒంటె యెప్పుడయితే ముందు కాళ్ళను లేపిందో, దాని మెడను గట్టిగా కావలించుకుని దాని మూపుపై పడుకున్నట్టు ముందుకు వాలాడు.

ఆ జంతువు అల్లంత దూరం నుంచే ముందు కాళ్ళను నేలమీద తాటించి గాల్లోకి యెగిరింది.

దగ్గర్నుంచి స్పష్టంగా చూశాడు సిద్ధార్థ దాని ఆకారం!

సింహానికి రెండు రెట్లు పొడవుగా, మూడు రెట్లు యెత్తుగా చిన్న సైజు ఏనుగు పరిమాణంలో వుందా జంతువు. అంత బరువైన జంతువు కూడా సునాయాసంగా గాల్లోకి యెగరటం అతడికి చాలా విస్మయాన్ని, గగుర్పాటును కలిగించింది.

ఆ జంతువు గాల్లోకి యెగురుతూనే ఒంటె కంఠాన్ని పట్టుకొని తన వాడి దంతాన్ని సూటిగా దాని గొంతులో గుచ్చేసింది.

ఒంటె అమాంతం నేల కూలిపోయింది.

దాంతోబాటు సిద్ధార్థ కూడా నేలమీద పడి పోయాడు. అయితే ఇసకలో పడిపోతూనే స్ప్రింగులా పైకి లేచాడు.

ఒంటెను తీవ్రంగా గాయపరచిన ఆ దంతమృగం సిద్ధార్థను యేం లెక్కచేయని దానిలా ఒంటె రక్తాన్ని జుర్రుకుంటోంది,

ఒంటె గిల గిల తన్నుకుంటూనే వుందింకా. దాని ప్రాణలింకా శరీరాన్ని వదల్లేక పోతున్నాయి.

అంతవరకు తనకు వాహనంగా వుండి తనని ఎడారిలో మోసుకొంటూ వచ్చిన ఒంటెను ఆ దంత మృగం చంపటం, దారుణంగా దాని రక్తాన్ని ఆనందంగా జుర్రుకోవటం చూసిన సిద్ధార్థ పట్టాకత్తితో దాని నడుమ్మీద బలంగా మోదాడు.

అయితే ఖంగున శబ్దమయ్యిందే గాని దంత మృగం శరీరం ముక్కలు కాలేదు. ఆ దెబ్బకు సరిగ్గా రెండు ఖండాలుగా చీలిపోవలసిన దాని శరీరం చెక్కుచెదరకుండా వుండటం, కత్తి బండబారిపోయి వంగిపోవడం చూసిన సిద్ధార్థకి దిగ్భ్రాంతితో ఓ క్షణం మతిపోయింది.

దంతమృగం సామాన్యమైన జంతువు కాదని అతని కర్థమైపోయింది.

దెబ్బతిన్న దంతమృగం పెడబొబ్బ పెడుతూ సిద్ధార్థ మీదకి లంఘించింది.

సిద్ధార్థ ఎలర్ట్‌గా దాని దాడినుంచి తప్పించుకుని పక్కకు గెంతివుండకపోతే అది అతడి కంఠాన్ని వొడిసి పట్టుకుని దంతాన్ని అతని గొంతులో బలంగా దింపేసి వుండేది! సిద్ధార్థ రెండు చేతుల్తోను కత్తిని పట్టుకుని మరోసారి దంతమృగంమీద ప్రయోగించాడు.

ఆ దెబ్బ నుంచి వెంట్రుకవాసిలో తప్పించుకున్న ఆ మృగం ఈసారి గుర్రుపెట్టింది.

దాని ముందరి కాళ్ళు వెనుక కాళ్ళకన్నా పొడవుగా వుండటం అప్పుడు గుర్తించాడు సిద్ధార్థ. కాళ్ళ అడుగున బల్లపరుపుగా, ఇసకలో పరుగెత్తటాని కనువుగా దట్టమైన చర్మముంది. ఆ చర్మం పక్కల నుంచి వాడిగోళ్ళు

మెలితిరిగి చురకత్తుల్లా వున్నాయి.

ఒంటె నా జంతువు యెలా వొడిసిపట్టులోగలిగిందో అర్థమయ్యిందతడికి. ఆకలి, దాహం, నీరసం, నిస్సత్తువ అన్నీ ఆ క్షణంలో మరచిపోయాడు. తన ప్రత్యర్థి దాడి నుంచి తప్పించుకుని ఎదురుదెబ్బ తీయటానికి వ్యగ్ర సంకల్పంతో వున్నాడు.

దంతమృగం మరోసారి గాల్లోకి లేవటం, సిద్ధార్థ మీదికి ఛార్జి చేయటం అదే క్షణంలో సిద్ధార్థ దాని కళ్ళలోకి కత్తిని బలంగా దించెయ్యటం ఒకేసారి జరిగిపోయింది.

ఈసారి సిద్ధార్థ దెబ్బ ఊరికినే పోలేదు. దాని కన్ను నుంచి రక్తం ధారలు కట్టింది. దంత మృగం గుండె అవిసేలా ఘీంకరించింది. దాని అరుపుకు సిద్ధార్థ ఒళ్ళు జలదరించింది.

సిద్ధార్థ ఊహించని విధంగా వొక్కసారిగా దంత మృగం వెనుతిరిగి వాయువేగంతో పారిపోయి క్షణాల్లో కనుమరుగైపోయింది.

సిద్ధార్థ బలంగా ఊపిరి పీల్చి వదిలాడు.

ఆ దంత మృగం ముందు తానెంత? అది కన్ను పోగొట్టుకున్న కంగారులో మతి చెడినట్టు పారిపోయి వుండకపోతే యీ పాటికి దానికి ఆహారమైపోయుండేవాడు.

సిద్ధార్థ ఒంటెవంక దీనంగా చూశాడు.

అప్పటికే అది ఆఖరిశ్వాస వదిలేసింది. దంత మృగం దాని గొంతు మీద చేసిన గాయం భయంకరంగా కనిపిస్తోంది.

అంటే, ఆ మృగం మాంసంకన్న రక్తాన్నే ఆహారంగా పీల్చుతుంటుందన్న మాట. ఇదెక్కడి రక్తపిపాసి! బహుశా దానిక్కూడా ఈ ఎడారిలో నీరు దొరక్క రక్తాన్ని తాగి దాహం దీర్చుకుంటున్న దేమో....!?

అతడు కొద్ది క్షణాలు అలాగే ఇసకలో మోకాళ్ళమీద కూచుండిపోయాడు. అప్పటి అతని భంగిమ తన ఆప్త మిత్రుడి మరణానికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నట్లు వుంది.

* * *

చేతివాచీ చూసుకున్నాడు.

రాత్రి పదిగంటలు చూపిస్తోంది.

లేచి నిల్చున్నాడు సిద్ధార్థ. దంతవ్యాగంతో పోరాడుతూ తాత్కాలికంగా మరచిపోయిన ఆకలిదప్పులు తిరిగి అతన్నాశ్రయించాయి.

ఇప్పుడేం చెయ్యాలి? యెక్కడికి పోవాలి? ఇంతవరకు ఆ ఒంటె పుణ్యమా అని ఎంతో కొంతదూరం ప్రయాణించగలిగాడు. ఏదోక గమ్యం చేరగలననే ధైర్యంతో వున్నాడు.

ఇప్పుడా ఒంటె చనిపోయింది. తన గమ్యం అగమ్యంగా మారింది. ముందుకి పోగల శక్తి సన్నగిల్లింది. దాహంతో నిస్త్రాణగా వుంది. శరీరం తనతో సహకరించటం లేదు.

అయినా సరే, తను విశ్రమించకూడదు. ఈ ఎడారి నుంచి బయటపడటానికి, లేదా జనవాస ప్రాంతం వెతుక్కోటానికి ప్రాణం పోయేలోపల మానవ ప్రయత్నం చెయ్యాలి!

దృఢ సంకల్పంతో ముందు కదుగు వేశాడు. కుడిచేత కత్తిని ధరించి, నలువైపులా పరీక్షగా చూస్తూ కాషన్‌గా

నడుస్తున్నాడు.

చెప్పతిని పారిపోయిన దంతమృగం యేవోక మూల నుంచి తనమీద దాడి చేసితీరుంది. దాని వేగం, దాని వేటాదే తీరూ, దాని క్రూరత్వం మరవలేకపోతున్నాడు. ఎందుకో బెదిరి పారిపోయింది గాని, దాని ధాటికి తను నిలబడగలడా?

సిద్ధాంకి యెక్కడి నుంచో కమ్మటి అరమగ్గిన పళ్ళ వాసన నాసికాపుటాలకి సోకింది. బాగా తెలిసిన సువాసన.

ఒక్క క్షణం ఆగి చుట్టూ పరికించి చూశాడు. తనకి యెడమవైపుగా రెండు చెట్లు కనిపించాయి.

వాటిని చూడగానే అతడికి చటుక్కున స్ఫురించింది ఆ చెట్లేమిటో....!

అవి ఖర్జూరపు చెట్లు. అవి ఖర్జూరపు పళ్ళ సువాసన....

ప్రాణం లేచివచ్చినట్టనిపించింది. ఒక్క అంగలో ఆ చెట్లను చేరుకున్నాడు. చేతికి అందేటంత యెత్తులో వున్నాయి ఖర్జూర గుత్తులు.

వాటి నందుకున్నాడు. కడుపు నిండింది. ఆకలి కూడా కొంత ఉపశమించినట్టే అనిపించింది.

కడుపు నిండగానే సహజంగానే అలసి సొలసిన శరీరం, మనసు విశ్రాంతి కోరాయి.

అక్కడే ఖర్జూర చెట్టకింద కూలబడ్డాడు. అప్పటికే బాగా చల్లబడిన గాలి అతన్ని సేదతీర్చింది.

అ స్వస్థంగా అలాగే ఇసకలో ఒరిగిపోయాడు. కొద్ది క్షణాల్లోనే వొళ్ళెరుగకుండా గాఢంగా నిద్రపట్టేసింది.

● ● ●

సూర్యకిరణాలు సూటిగా ముఖాన సూదుల్లా గుచ్చుకోవటంతో ఉలిక్కిపడి లేచి కూచున్నాడు సిద్ధార్థ.

వాచీలో టైమ్ ఏడుగంటలు చూపిస్తోంది.

సిద్ధార్థ ఆదరాబాదరా లేచాడు. పక్కనే పట్టాకత్తి సిద్ధంగా వుంది. దాన్నందుకున్నాడు.

ఓసారి పరిసరాలు పరికించి చూశాడు. ఎక్కడా అలికిడి లేదు—భయంకరమైన ప్రశాంతత.

ఉండి ఉండి గాలి విపరీతంగా వీస్తోంది. ఇసక పైకి లేస్తోంది. జాడలు జాడలుగా రేగిన ఇసక చిత్రకారుడి అద్భుత చిత్రంలాగా, డిజైన్సులాగా కనిపిస్తోంది. అవన్నీ ఆనందించే స్థితిలో లేడు అతడు.

అప్పటికే మూడురోజులుగా స్నానంలేక తన శరీరం మీద తనకే రోత పుడుతోంది—గుడ్డలు అట్టకట్టుకు పోయి తోలు ముక్కల్లా శరీరాని కతుక్కుని పోయాయి.

తాత్కాలికంగా ఉపశమించిన దాహం మళ్ళీ నేనున్నానంటూ ప్రత్యక్షమయ్యింది.

అక్కణ్ణుంచి కదిలే ముందు మరికొన్ని ఖర్జూరపప్పళ్ళు తీసుకుతిని ముందుకు సాగాడు.

దాదాపు ఓ గంట నడిచినా పూర్తిగా ఓ మైలు కూడా నడవలేకపోయాడు. అలాగే నాలుగైదు గంటలు పట్టుదలగా నడిచాడు. ఆ ఇసుకలో.

అతనికి దూరంగా ఇసక రేగుతున్న దృశ్యం కనిపించింది. ఆ తర్వాత రెండు ఒంటెలు పక్క పక్కనే నడుస్తూ రావటం కనపడ్డవి. రెండు ఒంటెలమీదా ఇద్దరు వ్యక్తులున్నారు.

సిద్ధార్థకి ఆనందంతో నాట్యం చెయ్యాలనిపించింది.

ఫరవాలేదు. నిర్మానుష్యంగా వున్న ఎడారిలో మానవ మాత్రుడు కనిపించాడు. తనకేదో దారి చూపించక పోడు!

'భగవాన్, నువ్వెంత దయామయుడివి!' అని మనసు లోనే దేవుడికి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

ఒంటెలు సమీపించాయి.

వాటిమీద కూచున్న యిద్దర్నీ తనెప్పుడో ఎక్కడో చూసినట్లపించిం దతనికి.

ఎక్కడ చూశాడు? ఎప్పుడు?

గుర్తొచ్చీ రానట్టుంది.

ఒంటెలు ఆగాయి. వాళ్ళేదో ప్రశ్నిస్తున్నారు. కాని ఆ భాష సిద్ధార్థకి అర్థం కాలేదు గాని, అలాంటి మనుషుల్ని యెక్కడ చూశాడో వెంటనే గుర్తొచ్చింది....

వాళ్ళు చాలా కర్కశంగా, మొరటుగా నరరూప రాక్షసుల్లా వున్నారు వాళ్ళ భాష హిందీలా ధ్వనించిందే కాని హిందీ కాదు.

ఇలాంటి జాతి మనుషులే తనని, సుస్మితని, సాయం చేస్తామని ఒంటెలో యెక్కించుకుని వెన్నుపోటు పొడిచినది.

వాళ్ళు సిద్ధార్థ ఏమీ మాట్లాడక పోవటంతో మళ్ళీ ప్రశ్న రెట్టించారు.

విమానంలోంచి పడిపోయానని హిందీలో చెపుతూ అభినయించి చూపాడు అతడు.

వాళ్ళ కర్థమయింది.

మంచినీళ్ళు కావాలని అడిగాడు.

అందులో ఒకడు సొరకాయలాంటి సాధనంలో

దాచుకున్న నీటిని పైకి తీశాడు పొడవాటి సంచీలో నుంచి.

సిద్ధార్థకి ప్రాణం లేచివచ్చింది. వాళ్ళు దుర్మార్గులు కాదు. రూపంలో వాళ్ళలా వున్నా ఆ నరరూప రాక్షసుల్లాంటివాళ్ళు కాదు.

చేతిలో వున్న కత్తిని ఇసుకలో గుచ్చి రెండు చేతులు దగ్గరకు చేర్చుకుని నోటి దగ్గర దొప్పలా పట్టుకున్నాడు.

సరిగ్గా అప్పుడు పడింది రెండోవాడి దృష్టి ఆ పట్టా కత్తిమీద. కత్తి మొనకి దంతమృగం రక్తం అంటి నల్లగా మారింది.

“ఈ కత్తి నీ కెక్కడిది?” అని గద్దించి అడిగాడు ఆ వ్యక్తి.

గతుక్కుమన్నాడు సిద్ధార్థ. నీరు వంచబోతున్న వ్యక్తి చటుక్కున ఆగిపోయి తనూ ఆ కత్తి వంక చూశాడు.

ఏం చెప్పాలో వెంటనే స్ఫురించలేదు సిద్ధార్థకి. అయితే అతనూహించని విధంగా అందులో ఓ వ్యక్తి తన దగ్గరున్న అలాంటి పట్టాకత్తిని వేగంగా అతని మీదకి విసిరాడు.

సిద్ధార్థ మెరుపువేగంతో లాఘవంగా ఆ కత్తి వేటు నించి తప్పించుకుని ఇసుకలో గుచ్చిన కత్తినందుకున్నాడు.

రెండో వ్యక్తి చేతిలో మరో కత్తివుంది. అతను దాన్ని చేత ధరించి సిద్ధార్థ మీది కురికాడు ఒంటెమీదినుంచి.

సిద్ధార్థ అతని ప్రయత్నాన్ని కూడా వమ్ముచేశాడు. తన చేతిలోని కత్తితో అతని కత్తిని బలంగా కొట్టాడు.

అది ఎగిరి అంత దూరంలో పడింది.

ఈ లోపల మొదటి వ్యక్తి కూడా ఒంటెమీదినుంచి నేలమీద దూకాడు.

సిద్ధార్థ రెండో వ్యక్తిని తీవ్రంగా గాయపరిచాడు కత్తితో.

రెండో వ్యక్తి నేలకూలిపోతూ సిద్ధార్థ గుండెలమీద బలంగా తన్నాడు.

సిద్ధార్థ చేతిలోని కత్తి ఎగిరి అవతలపడింది. అతను వెల్లకిలా ఇసకలో పడిపోయాడు.

అదే అదనుగా మొదటివ్యక్తి కిందపడిపోయిన తన కత్తినందుకుని సిద్ధార్థ మీదికి వేగంగా విసిరాడు.

అది సిద్ధార్థ భుజాన్ని గాయపరచి ఇసకలో కూరుకు పోయింది.

బాధతో అరిచాడు సిద్ధార్థ. భుజంనించి జలజల రక్తం ప్రవిస్తోంది. తనని గాయపరచిన ఆ వ్యక్తి పొత్తికడుపుమీద డొక్కల్లోను బలంగా కాళ్ళతో తన్నాడు సిద్ధార్థ.

అతను లుంగ చుట్టుకుపోయి నేలమీద కూలబడ్డాడు. రెండు గుప్పిళ్ళతోను ఇసక తీసి అతని కళ్ళల్లో గుప్పించాడు సిద్ధార్థ. బాధతో కీచుగా అరిచాడతను.

ఈ లోపల రెండో వ్యక్తి పరుగున లేచాడు. ఇసకలో కూరుకుపోయిన కత్తిని అందుకున్నాడు.

అతన్ని ప్రతిఘటించటానికి సిద్ధంగా లేడు సిద్ధార్థ. అప్పటికే తీవ్రమైన రక్తస్రావంతో అతని కళ్ళు చీకట్లు కమ్మి దృశ్యాలు మసగ్గా కనిపిస్తున్నాయి. రెప్పలు మూతబడి పోతున్నాయి.

తనపని అంతటితో అయిపోయిందనుకున్నాడు సిద్ధార్థ.

అయితే తనని చంపటానికి కాలరుద్రుడిలా మీది కొచ్చిన ఆ వ్యక్తి అమాంతం ఎందుకు వెనక్కి విరుచుకు పడిపోయాడో సిద్ధార్థ గ్రహించే లోపలే అతనికి స్పృహ తప్పిపోయింది.

* * *

అతనికి మెలకువ వచ్చేసరికి ఎండ తీవ్రస్థాయిలో వుంది. అయితే తను దట్టమైన ఓ చెట్టునీడలో ఓ స్త్రీ సాన్నిధ్యంలో వున్నాడు.

ముఖం మీద నీళ్ళు చిలకరిస్తూ తనని స్పృహలోకి తీసుకురావటానికి శత విధాల ప్రయత్నించి సఫలీ కృతురాలైన ఆ అమ్మాయి సిద్ధార్థ ముఖంలోకి చల్లగా చూసి చిన్నగా నవ్వింది.

తను ఆమె ఒడిలో పడుకుని వున్నట్టు గ్రహించి చటుక్కున లేవబోయాడు సిద్ధార్థ. అయితే భుజందగ్గర గాయం చురుక్కుమన్నది. నీరసం, నిస్సత్తువ అతన్ని నిర్వీర్యుణ్ని చేశాయి.

మంచినీళ్ళు కావాలని సైగ చేశాడు.

ఆమె సొరకాయ బుర్రలోనించి నీటిని అతని నోట్లో పోసింది. ఒక చుక్క కూడా మిగలకుండా నీరంతా తాగేశాడు. సిద్ధార్థ ఆమెవంక కృతజ్ఞతగా చూశాడు.

ఆమె మళ్ళీ చిన్నగా నవ్వింది తెల్లటి మంచి ముత్యాల్లాంటి పలువరస తళుక్కుమని మెరిసింది.

ఆమెవంక పరీక్షగా చూశాడు సిద్ధార్థ. ఆమె మరీ అనాగరికంగా లేదు. వక్షస్థలం చుట్టూ పూసలతో డిజైన్ చేసిన రవిక వేసుకున్నది. నడుం దగ్గర్నుంచి కాళ్ళవరకు అలాంటి పూసలతో చుట్టుకున్న ఎర్రరంగు పరికిణీ వేసుకున్నది. మెడలో రకరకాల రంగుల్లో వున్న

పూసల పేరు వేసుకున్నది. రవికె నుంచి పరికిణీ వరకు నగ్నంగావున్న దేహం పాలరాయిలా తెల్లగా వుంది.

ఆమె జుట్టు ముడివేసుకోలేదు. ముంగురులు నుదుటి మీద అందంగా అల్లరిగా లాస్యం చేస్తున్నాయి. నుదుటి మీద బొట్టు మెరుస్తోంది. అది తిలకమో, మరే రకమైన కుంకుమో అతనికి తెలియలేదు.

మొత్తంమీద ఆమె అలంకరణ అతి సామాన్యంగానే వున్నా అత్యంతాకర్షణీయంగా, గౌరవ ప్రదంగానే వుంది.

ఆమెను చూడగానే సిద్దార్థకు ముచ్చట వేసింది. ఆమె ఒళ్ళోనించి లేవాలని మరోసారి ప్రయత్నించాడు.

చిన్నగా వారిస్తూ "లేవకండి" అన్నదామె యాసతో కూడిన హిందీలో.

సిద్దార్థ ఆశ్చర్యపోయి చూశాడు. అతనికి చాలా ఆనందమయ్యింది. ఫరవాలేదు. తన కర్థమయ్యే భాషలోనే మాట్లాడుతోందామె. ప్రాణం లేచివచ్చినట్టయ్యింది.

"వాళ్ళు.... వాళ్ళేమయ్యారు?" అనడిగాడు సిద్దార్థ హిందీలో.

ఆమె దూరంగా వేలు పెట్టి చూపించింది.

నేలమీద బోర్లాపడున్న రెండు శవాలు కనిపించాయి తనికి.

"వాళ్ళని నేనే చంపాను. లేకుంటే నిన్ను చంపేసి వుండేవాళ్ళు." అన్నదామె చాలా సర్వ సాధారణంగా.

"నీకు నా కృతజ్ఞతలు, నా ప్రాణం కాపాడావు." అన్నాడు సిద్దార్థ.

ఆమె మందహాసం చేసింది. ఆమె అలా నవ్వుతున్న

పుడు చాలా మనోహరంగా, స్నిగ్ధంగా కనిపించిందతనికి.

భుజం తడుముకున్నాడు. ఏవో ఆకులపసరు పచ్చగా భుజం మీద కనిపించింది. ఆశ్చర్యంగా ఆమె వైపు చూశాడు.

ఆమెపట్ల అతని కృతజ్ఞత మరింతగా పెరిగింది. తన భుజానికి తగిలిన గాయానికి ప్రకృతి వైద్యమేదో చేసిందామె. లేకుంటే రక్తస్రావంతో తన ప్రాణాలు ఎప్పుడో పోయుండేవి.

అంటే. అటు ఆ దుండగులనించి, ఇటు గాయంనించీ కూడా ఆమె తనని కాపాడింది.

"ఈ ఎడారిలోకి ఎలా వచ్చి పడ్డావు? వాళ్ళతో నీకెందుకు తగవొచ్చింది?" అడిగిందామె.

క్లుప్తంగా జరిగింది చెప్పాడు సిద్ధార్థ.

సుస్మిత మరణం గురించి విన్న ఆ అమ్మాయి బాగా చలించిపోయింది. కన్నీరు ఆమె చెక్కిళ్ళమీదుగా జారింది. ఎంతైనా ఆమెది స్త్రీ హృదయం!

"నువ్వలా చెయ్యటంలో తప్పులేదు. ఈ ఘోర్కా జాతి మనుషులు చాలా దుర్మార్గులు. చిన్న చిన్న గ్రామాలమీద పడి దోచుకోవటమే వీళ్ళవృత్తి. వీళ్ళ గురించి తెలిసిన వాళ్ళెవరూ వీళ్ళతో విరోధం పెట్టుకోరు." చెప్పిందామె.

"ఇంతకీ నువ్వెవరు? ఈ అనంతమైన ఎడారిలో నీ నివాసమెక్కడ? ఈ ఎడారి ఏ ప్రాంతానికి చెందినది? ఢిల్లీ ఇక్కడికెంత దూరంలో వుంది? ఇది భారతదేశ భూభాగానికి చెందిన ఎడారేనా?" ప్రశ్నలవర్షం కురిపించాడు.

ఆమె కిలకిల నవ్వింది.

"ఒక్కసారిగా ఇన్ని ప్రశ్నలు వేసేస్తే నేనెలా సమాధానం చెప్పగలను? ఇది భారతదేశానికి చెందిన ఎడారే. అంతకి మించిన వివరాలు నాకు తెలియదు. మా బాపూకి తెలుస్తుంది."

"బాపూ ఎవరు?"

"మా తండ్రి."

"ఓహో, నీ నివాసమెక్కడ?"

"ఇక్కడికి రెండు క్రోసుల దూరంలో వుంది."

"అక్కడ నీరుంటుందా?"

"నీటి చెలిమలుంటాయి. వాటి సాయంతోనే మేం కొన్ని పంటలు పండించుకుంటాం."

నీరుంటుందని తెలియగానే సిద్ధార్థకి చాలా ఆనందమై పోయింది. ముందు తృప్తిగా కడుపునిండా నీరుతాగాలి. ఇందాకా తాగిన నీరు అప్పుడే ఆవిరైపోయింది. మళ్ళీ దాహం వేస్తోంది. సమయానికి, ఆ వచ్చిన దుండగులు వెంట తెచ్చుకున్న నీటితో సేదతీరాడు.

ఏ వస్తువుకైనా విలువ అది దొరకనప్పుడే పెరుగుతుంది. తన జీవితంలో నీటిచుక్క కోసం పడరాని అగచాట్లు పడాల్సివస్తుందని సిద్ధార్థ ఎన్నడూ ఊహించలేదు.

ముందు ఆమె తండ్రిని కలుసుకోవాలి. అతని ద్వారా తను హైదరాబాదు తిరిగిపోయే దారి వెతుక్కోవాలి!

అతనికా సమయంలో తల్లి గుర్తొచ్చింది. తనింకా రాకపోవటానికి కారణం ఆమెకి తెలిసిపోయుంటుందా? తన కొడుకు శాశ్వతంగా దూరమైపోయాడని తెలిస్తే ఆ మాతృ హృదయం తట్టుకోగలదా?

దివ్య ఎలా వున్నదో? తన రాకకోసం వెయ్యికళ్ళతో

ఎదురుచూస్తుంటానని తను బయల్దేరిన రోజు మరీ మరీ చెప్పింది. ఈపాటికి నిజం ఆమెక్కూడా తెలిసిపోయుంటే....!?

ఆవేదనతో తల విదిలించాడు అతడు.

ఒక్కసారిగా ఆలోచనల్లోకి జారిపోయి తన ఉనికి నే విస్మరించిన అతనివైపు ఆశ్చర్యంగా చూసింది ఆ అమ్మాయి.

"ఏమిటి నువ్వేదో తీవ్రంగా ఆలోచిస్తూన్నట్టున్నావు....!?" అడిగింది.

"ఆఁ....అహా, ఏంలేదు....నీ పేరేమిటా అని—!?"

"నా పేరేమిటో ఆలోచిస్తే తెలుస్తుందా, నన్నడగాలి గాని!!"

"ఆఁ, అవును. నిన్నడగాలి. ఇంతకీ నీ పేరేమిటి?"

"కోయల్."

"కోయల్ అంటే!? ఓహ్ హిందీలో కోయల్ అంటే కోయిలకదూ!"

"కోయిలకాదు, నా పేరు కోయల్."

"అవును. మా తెలుగు భాషలో కోయిల అని పిలుస్తాం. నేను కూడా నిన్ను కోయిలా అనే పిలుస్తాను."

"అలాగే పిలువు, నా కభ్యంతరంలేదు" అన్నదామె, లేచి నిలబడుతూ.

"ఇక మా నివాసానికి వెళ్దాం. నన్ను ఆసరాగా పట్టుకో." అన్నది కోయిల.

నిద్దార్థ మొహమాటంగా నవ్వి. "ఫరవాలేదు, నేను నడవగలను." అన్నాడు.

కోయిల అంతదాకా ఓ పక్కగావుంచిన విల్లమ్ములు

చేతి ధరించింది. అప్పుడు స్ఫురించింది సిద్ధార్థకి—ఆమె ఘోర్ఖా జాతి బందిపోటుల్ని ఎలా సంహరించినదీ.

*    *    *

కుడిభుజం గాయంలో నొప్పిగా వున్నందువల్ల ఎడమ చేత్తో కత్తిపట్టుకుని ఆమెతో బాటు ముందుకు సాగాడు సిద్ధార్థ.

"ఆకలి వేస్తోందా?" అడిగిందామె.

అతడికి నిజంగానే చాలా ఆకలిగావుంది. కాని ఆ విషయం ఆమెతో చెప్పటానికి బిడియపడ్డాడు.

అయినా ఆమె అతని ఇబ్బంది గ్రహించకపోలేదు.

"ఇంటికి వెళ్ళగానే వేడి వేడి జొన్న సంకటి ఇస్తాను. చాలా శక్తివస్తుంది. హుషారుగా వుంటావు." అన్నదామె.

జొన్నసంకటి పేరు వినగానే సిద్ధార్థ ఆకలి ఎటో పారిపోయింది. పాపం, అదే అక్కడి ఎడారి ప్రజ జీవనాధారం. వాళ్ళకి ముఖ్య ఆహారం. ప్రాణం నిలుపుకోవటానికి తనూ అదే తినాలి, తప్పదు!

వాళ్ళు దాదాపు ఓ మైలు దూరం నడిచారో లేదో ఇంతలోనే ఎదురుచూడని ఉపద్రవం సంభవించింది.

ఎప్పుడు వెనగ్గావచ్చి నిలబడిందో తెలీదుగాని ముందరికాళ్ళను నేలకి ఆనించి గాల్లోకి లేచింది—ఓ కన్నులొట్టబోయిన దంతవ్యాఘ్రం. దాని టార్గెట్ సిద్ధార్థ.

అయితే ప్రమాదాన్ని ముందుగా గుర్తించినది కోయిలే. విల్లు సంధించటానికి ఏ మాత్రం వ్యవధిలేదు.

ఒక్క ఉదుటున అతనిని పక్కకి మెరుపు వేగంతో నెట్టేసింది కోయిల.

సిద్ధార్థ పిల్లిమొగ్గ వేసి అల్లంత దూరంలో పడటం,

దంతవ్యాఘ్రం గురితప్పి ఇసుకలో పడిపోవటం ఒకేసారి జరిగాయి.

సిద్ధార్థ దిగ్భ్రమనించి తేరుకునే లోపల దంతవ్యాఘ్రం మళ్ళీ గాల్లోకి ఎగిరింది—అతని మీద ఛార్జి చెయ్యటానికి.

కోయిల చాలా ఎలర్టుగా పని చేసింది. సిద్ధార్థ చేతి నుంచి పట్టాకత్తిని అందిపుచ్చుకుంది. దంతవ్యాఘ్రం వీపు పై భాగం యెంత కఠినశిలలా వుంటుందో దాని పొట్ట భాగం అంత సున్నితంగా వుంటుందని ఆమెకు తెలుసు.

సరిగ్గా వ్యాఘ్రం సిద్ధార్థమీద కురికే సమయానికి రెండు చేతుల్లోను కత్తిని ఫర్మ్‌గా పట్టుకొని గాల్లోకి నిటారుగా లేపింది!

అంతే! దంతవ్యాఘ్రం సరాసరి కత్తిమీద పడటం. దాని పొట్టలో దిగిన కత్తి నడుంమీద లోతుగా దిగబడిపోవటం, అది ప్రళయభీకరంగా గర్జించటం, నేల కూలటం ఏకకాలంలో జరిగాయి.

సిద్ధార్థ దిగ్భ్రాంతి నుంచి యింకా తేరుకోలేదు.

కోయిల అతన్ని లేవదీసి కూర్చోబెట్టింది.

“ఈ దంతవ్యాఘ్రం నావల్ల గాయపడి పారిపోయింది. పగబట్టి ఇంతలోనే నామీద దాడి చేసింది అకస్మాత్తుగా. మరోసారి నా ప్రాణం కాపాడిన నిన్నెలా అభినందించను? యేమిచ్చి ఋణం తీర్చుకోను?” అన్నాడు సిద్ధార్థ ఆమెవంక కృతజ్ఞత మెరిసే కళ్ళతో చూస్తూ.

ఆమె తేలిగ్గా నవ్వేసింది.

“ఆపదలతో అనుక్షణం ఆడుకుంటూ, ప్రమాదాలతో

ప్రతిక్షణం పెనవేసుకున్న బ్రతుకులు మావి. భయమన్నది మా దరిదాపులక్కూడా రాదు, రానివ్వం."

* * *

ఇద్దరు మళ్ళీ నడక సాగించారు.

పట్టాక తిని దంతమృగం శరీరం నుంచి లాగి, సిద్దార్థ కండించింది.

అప్పటికి సూర్యుడు పూర్తిగా కుంగిపోయాడు చీకటి నలుదిశలా పరచుకుంటున్నది.

"ఏదయినా చిన్న జంతువును వేటాడి తీసుకురమ్మని పంపాడు బాపూ. నే నా విషయమే విస్మరించాను" అన్నది కోయిల.

"ఇక్కడ ఆహారానికి పనికొచ్చే జంతువులున్నాయా? నా కింతవరకు కనిపించ లేదు."

"పగలంతా ఇసక వేడిగా వుంటుంది. దాక్కుక టానికి సరయిన మరుగుప్రదేశం దొరకదు—అందుకని ఏ చెట్టు తొర్రలోనో పగలు గడిపి చీకటిపడ్డాక ఆహారం కోసం వెతుక్కుంటూ బయటకు వస్తాయి — ఇప్పుడే సరయిన అదను. కాని మనకి టైమ్ లేదు, పద!"

మరో అరగంట ప్రయాణం తర్వాత కొండవాలు ప్రాంతము దగ్గరకు చేరుకున్నారు.

దూరం నుంచే యెర్రగా మంటలు కనిపించాయి వాళ్ళకి.

కోయిల ఆ దృశ్యం చూస్తూనే చిన్నగా అరిచింది. "ఏదో జరక్కూడనిది జరిగిపోయింది. నాతో బాటు పరుగెత్తు!...." అంటూ లేడిలా దూసుకుపోయింది కోయిల.

సరిగ్గా పది నిమిషాల్లో ఆ స్పాట్ కు చేరుకున్నా

రిద్దరు.

అప్పటికే అక్కడి ఇళ్ళన్నీ పరశురామ ప్రీతి అయి పోయాయి.

దూరంగా ఒంటెలమీద సాగిపోతున్న ఆకారాలు గుర్తించిన కోయిల ముఖం జేవురించింది.

"ఘూర్జర జాతి బందిపోట్లు. వీళ్ళ అంతు చూస్తాను" అంటూ బాణం వింటికి సంధించి ఆకర్ణాంతం లాగి వదిలింది కోయిల.

ఒకడు నేలకూలిపోయాడు.

ఆ తర్వాత మరో బాణం, యింకో బాణం....అలా అలా బందిపోట్లు నేలకూలేవరకు బాణాలు గుప్పిస్తూనే వుంది....ఆమె గురి ఒక్క సారి కూడా వ్యర్థం కాలేదు.

మొత్తం ఎనిమిదిమంది బందిపోట్లు! అందరూ ఒంటెల మీదినుంచి ఇసుకలో వొరిగిపోయారు.

అప్పటికిగాని శాంతించలేదు కోయిల.

అయితే మరో హృదయవిదారకమైన సంఘటన అంతక్రితమే జరిగిపోయిందని ఆమెకు తెలియదు.

ఓ పక్క కాలిపోతున్న కొంపల్ని రక్షించుకోవాలనే ప్రయత్నం చేస్తున్న వ్యక్తుల్లో కొందరు కోయిలని చుట్టుముట్టారు.

వాళ్ళు చెప్పిన వార్త వినగానే ఆమె చేతిలోని విల్లమ్ములు అప్రయత్నంగా జారి పడిపోయాయి.

"బాపూ!" అంటూ బిగ్గరగా అరిచింది.

కాని అప్పటికే కోయిల తండ్రి శరీరం మంటల్లో పూర్తిగా కాలి బూడిదై పోయింది. ఆతన్ని రక్షించాలని మంటల్లో దూకిన మరో యిద్దరు కూడా ఆహుతయి పోయారు.

తండ్రి చితాభస్మం పట్టుకొని ఘోరంగా శపథం చేసింది కోయిల. ఘోరక్రజాతి నంతా సమూలంగా నాశనం చేసి తండ్రి ఆత్మకు శాంతి చేకూరుస్తానని. అంత వరకు తను విశ్రమించనని ఒట్టు పెట్టుకుంది.

ఆ క్షణంలో ఆమె అపరకాళిలా వుంది. ఆమె కళ్ళ నుంచి నిప్పులు రాలుతున్నాయన్నట్టు ముఖమంతా ఎర్రగా పోయింది. నిలువెల్లా ఆవేశాగ్రహాలతో వొణికి కంపించిపోయింది.

ఆమెనా స్థితిలో చూసిన ఎంతటి ధీరుడైనా రవంత చలించకపోడు భయంతో.

సిద్ధార పరిసరాలను పరిశీలించి చూశాడు.

గడ్డితోను పెట్టుకొమ్మలతోను నిర్మించుకున్న పూరిళ్ళు అవి దాదాపు ఏభై వున్నాయి. ఒక్కటి కూడా మిగల కుండా దగ్ధమైపోయాయి.

ఘోరక్రజాతి బందిపోట్లు ఆ గూడెంవాసులు సంవత్సరమంతా కష్టపడి పండించుకున్న తిండి గింజల్ని సమూలంగా దోచుకున్నారు. వాటిని గోతాముల్లోకి ఎక్కించి ఒంటెల మూపుమీద వేసుకుని అడ్డొచ్చిన వాళ్ళనందర్నీ ఊచకోతగా నరికేసి వాళ్ళను భయభ్రాంతుల్ని చేశారు....

అంతటితో పోయినా బావుండేది. కత్తిమాసి తమ మీద కురికిన కోయిల పినతండ్రిని అమానుషంగా శరీర భాగాల్ని ఖండ ఖండాలుగా నరికేశారు.

అది చూసి ఆవేశపరుడయిన కోయిల తండ్రి మెరికలాంటి యువకులో బందిపోట్ల నెదుర్కోవటానికొచ్చాడు. పరిస్థితి విషమిస్తున్నదని గ్రహించిన బందిపోట్లు వాళ్ళ కొంపలికి నిప్పు పెట్టేశారు.

అంతే, ఒక్కసారిగా హాహాకారాలు మిన్నుముట్టాయి. ఎవరికివారే తమ భార్యాబిడ్డల్ని రక్షించుకునే తాపత్రయంలో పడి బందిపోట్ల సంగతి పట్టించుకోలేరు.

కోయిల తండ్రి మంటల్లో చిక్కుకున్న ఇద్దరు పసిపాపల్ని రక్షించటానికి కాలిపోతున్న ఇంట్లోకి దూసుకుపోయాడు. ఆ ఇద్దర్నీ రక్షించి బయటకు చేర్చాడు.

అయితే ఓ ముసలామె నిస్సహాయస్థితిలో అదే ఇంట్లో మంచంలో పడుండగా చూసి, మళ్ళీ ఎందరో వద్దని వారిస్తున్నా వినక లోపలికి వెళ్ళి బయటికి రాలేకపోయాడు. అతన్ని రక్షించాలని ఇద్దరు యువకులు ఆ ఇంట్లోకి దుస్సాహసంతో ప్రవేశించి కోయిల తండ్రితో పాటు మంటల్లో కాలిపోయారు.

తర్వాత లెక్క చూసుకోగా గూడెం వాసుల్లో సగానికి పైగా నే అగ్నికి ఆహుతైపోయినట్టు తెలిసింది. కోయిల అశ్రుకణాల్లో అక్కడికొచ్చింది

తనవాళ్ళవైపు చూసి, "వాళ్ళు ఎత్తుకుపోయిన గోతాముల్ని వెనక్కి తెచ్చుకోండి" అన్నది కోయిల గంభీరంగా.

తమ నాయకుడి కుమార్తె మాట వాళ్ళకు శిలాక్షరం! మరుక్షణం ఎనిమిది ఒంటెల్ని వాటి మీది సామానుతో వెనక్కి తీసుకొచ్చారు గూడెంవాసులు.

తర్వాత ఆమె తన మనుషులవంక సూటిగా చూసి, "మన కింతటి అన్యాయం చేసిన ఆ ఘోర్క జాతిని తుద ముట్టిద్దాం. మీలో ధైర్యవంతులుంటే నాతో రండి." అన్నది.

ఎవరూ కిక్కురుమనలేదు. ముందుకు రాలేదు.

కోయిల హతాశురాలయ్యింది.

“మీలో పౌరుషమున్న మొగాడే లేడా!? మన కష్టార్జితాన్ని ఇన్నాళ్ళు పందికొక్కుల్లా పడి తింటూ ఈ రోజు మన ప్రాణాల్ని, సరుకుల్ని హరించిన ఆ బంధి పోట్లమీద ప్రతీకారం తీర్చుకోవాలని లేదా? అవమానం, తీరని అవమానం!” అన్నది హుంకరిస్తూ.

ఓ నడివయసు మనిషి ముందుకొచ్చి, “అమ్మా, వాళ్ళు బలంలోను సంఖ్యలోను మనకన్న పదిరెట్లున్నారు. వాళ్ళనెదిరించి బతికి బట్టకట్టలేం. మనమేకాదు, ఈ ఎడారిలోని ఇరవై ఎనిమిది గూడేల వాసులు ఆ బంది పోట్ల అగడాలకి బలైపోతున్నవాళ్ళే అయితే ఎవరూ కిమ్మనకుండా వాళ్ళక్కావలసింది ఇచ్చి పంపటమేగాని వాళ్ళతో విరోధం పెట్టుకోరు...” అని ఇంకా ఏదో చెప్తుండగానే కోయిల మహోగ్రంగా అరిచింది.

“నోర్ముయ్యి. వాళ్ళకి బానిసలుగా, తొత్తులుగా బతికి నిలుపుకునే ప్రాణాలు తుచ్ఛమైనవి. మన గూడేలన్నీ ఏకతాటిమీద నిలిచి ఎదిరిస్తే ఏనాడో ఆ బంది పోట్లు సర్వనాశనమై పోయుండేవారు. మీలో చేవ చచ్చింది. పౌరుషం అడుగంటింది. ఆడాళ్ళ దగ్గర చూపించటానికి తప్ప మీ ప్రతాపాలు మరెందుకూ పనికి రావు.

సరే, వినండి... నేనొక్కతెనూ చాలు, ఆ జాతిని సమూలంగా నాశనం చెయ్యటానికి! నా శక్తియుక్తులతో ఆ జాతి సంతతినీ రూపుమాపి గాని తిరిగి ఈ గూడెంలో అడుగుపెట్టను. ఇప్పుడే బయల్దేరి వెళ్తున్నాను.” అన్నది కోయిల గంభీర స్వరంతో.

అప్పటికీ వాళ్లెవరూ పౌరుషం తెచ్చుకుని ఆమెకు బాసటగా నిలవటానికి ముందుకు రాలేదు.

అయితే ఇదంతా చూస్తున్న సిద్ధార్థకి కోయిల కృత నిశ్చయం. పట్టుదల. ఆమె వ్యక్తిత్వం బాగా నచ్చాయి. ఒక ఆడపిల్ల అంత ధైర్యంగా శత్రువుల నెదిరించి పోరాడటానికి బయల్దేరుతుంటే తమకేమీ పట్టనట్టు స్వార్థంతో వ్యవహరిస్తున్న ఆ గూడెం వాసులమీద అసహ్యం కలిగింది.

ఆ ఘోర్క జాతి బందిపోట్లు తనకీ శత్రువులే! అమాయకురాలైన, తనని నిష్కల్మషంగా ఆరాధించి ప్రేమించిన సుస్మితని దారుణంగా చంపిన కిరాతక జాతి అది! ఆమెని చంపినవాళ్లనైతే తను చంపగలిగాడు గాని, ఆ జాతినే సమూలంగా తుద ముట్టించటానికి తిరుగులేని నిర్ణయం తీసుకున్నది కోయిల.

ఎవరు ఆమె వెంట వెళ్ళినా వెళ్ళకున్నా తనుంటాడు ఆమె వెన్నంటి.

"పద కోయిలా, నేనున్నాను. నీ ప్రతిజ్ఞ నెరవేరటానికి నాకు చేతనైన సాయం నేనూ చేస్తాను." అన్నాడు సిద్ధార్థ ఎడమచేత్తో కత్తినెత్తి ప్రమాణం చేస్తున్నట్టు పట్టుకొని.

కోయిల కళ్ళు విప్పార్చి ఆనందాశ్చర్యాలతో సంబరంగా చూసిం దతని వంక.

"ఆవేశంతో తీసుకున్న నిర్ణయం తాటాకు మంట లాంటిది. నువ్వు మా అతిథివి. నేను తిరిగొచ్చే వరకు మా ఆతిథ్యం స్వీకరిస్తూ ఇక్కడేవుండు. నేను బతికి తిరిగొస్తే నిన్ను సురక్షితంగా మీ దేశం పంపిస్తాను," అన్నది కోయిల గంభీరంగా.

"కాదు ఆవేశంతో తీసుకున్న నిర్ణయంకాదు. పవిత్రాశయానికి ప్రభావితుడినై నీతో వస్తున్నాను. ఆ ప్రయ

త్నంలో నువ్వు దక్కించిన ఈ ప్రాణం పోయినా లెక్క చెయ్యను."

కోయిల కళ్ళవెంట ఆనందబాష్పాలు రాలాయి.

"సెహభాష్. నా వాళ్ళనుకున్న నా గూడెం మనుషులు స్వార్థంతో వెనుకంజవేస్తే ధైర్యంగా ముందుకొచ్చావు. పద..." అంటూ అంతలోనే ఏదో గుర్తొచ్చి ఆగింది.

ప్రశ్నార్థకంగా చూశాడు సిద్ధార్థ.

"నువ్వు ఆహారమేదీ తీసుకోలేదు. మంచినీరు కూడా అడిగావు ..!?" అన్నది.

"ఇప్పుడేమీ వద్దు ఓ పక్క తండ్రిని పోగొట్టుకొని ఎంతో మనోక్లేశాన్ని అనుభవిస్తూన్నావు. నా తిండి కోసం ఏమీ ప్రయత్నాలు చెయ్యవద్దు, పద." అన్నాడు అతడు.

నిజంగానే అతనికి ఆ వాతావరణంలో ఏమీ తినాలని లేదు. ఎటు చూసినా విషాదం తాండవిస్తోందక్కడ.

అప్పటికప్పుడు బయల్దేరింది కోయిల. మరిన్ని బాణాలు తీసుకుని వీపుకి అంబులపొద కట్టుకొని అందులో అమర్చుకొంది. మరో విల్లు, బాణాలు అతడికిచ్చింది.

రెండు ఆరోగ్యంగా చలాకీగావున్న ఒంటెల్ని ఎన్నుకొంది. ఓ ఒంటెమీదికి యెగిరికూచుంది. మరో ఒంటె నధిరోహించాడు సిద్ధార్థ.

మరు నిమిషము ఒంటెలు రెండూ ఆ రాత్రి సమయాన ఎడారిలో వేగంగా ముందుకు సాగిపోయాయి.

* * *

కోయిల ముఖం చాలా గంభీరంగా వుంది.

ఘూర్కా జాతివాళ్ళ స్థావరము అక్కడికి కొంత

దూరంలో వుందో యెన్ని గంటల ప్రయాణమో అడగాలనుకున్నాడు అతడు. కాని ఆమె ముఖం చూశాక అడగాలనిపించలేదు.

ఆకాశంలో చంద్రు డుదయించాడు. చల్లటి గాలి మనసుల్ని సేదతీరుస్తోంది.

అంత క్రితంవరకు భయంకరంగా భయపెట్టిన ఆ ఎడారి, కోయిల సమక్షంలో చాలా మనోజ్ఞంగా వున్నట్టనిపించింది అతనికి.

తమ కెవరి పంతాలు పట్టింపులతో సంబంధం లేనట్టు ఒంటెలు రెండూ తమ నిర్ణీత వేగంతో ముందుకు సాగి పోతున్నాయి.

దాదాపు ఓ గంట ప్రయాణం సాగినతర్వాత అకస్మాత్తుగా వాతావరణంలో మార్పు వచ్చింది.

ఎక్కడి నుంచో ఘాటైన వాసన వారి ముక్కుపుటాల నదరగొడుతూ గాల్లో తేలివచ్చింది.

ముక్కు మూసుకున్నాడు సిద్దార్థ భరించలేక. కోయిల మాత్రం స్థిరంగా ముందుకే చూస్తోంది. చాలా మామూలుగా చెప్పిందతనితో.

“మనం వెళ్ళే దారిలో చుర్యా మృగాలు తిరుగుతుంటాయి. వాటి శరీరాలమీదనుంచి వస్తూన్న వాసనే అది. అవి చాలా ప్రమాదకరమైనవి. ఏ క్షణంలోనైనా మనమీద దాడిచెయ్యవచ్చు. సిద్ధంగా వుండు” అన్నది.

చుర్యా మృగ మనగానే తన కిదివరకు తెలిసిన దంత మృగమేమోనని సందేహం వచ్చింది. కాని అది కాదని ఆమె చెప్పింది.

“దంతమున్న ఆ జంతువుని సింఘేళీ అని పిలుస్తారు ఇక్కడివాళ్ళు. దానికన్నా యెన్నోరెట్లు బలమైనదీ,

చురుకై ఏదీ చుక్కా...." అని ఆమె చెప్తుండగానే ఆ ఘాటైన కట్టువాసన చాలా సమీపంలో వారి నాసికా పుటాలని సోకింది.

"నీకు బాణాలు సంధించటం తెలుసా?" అడిగిందామె.

తెలుసునన్నట్టు తలూపాడు.

"సిద్ధంగా వుండు..." అన్నది కోయిల.

సరిగ్గా అప్పుడే వాళ్ళ కెదురైంది.

సింధేళి మృగం కన్న భారీగా వుంది. ఒంటిమీద చిన్న వెంట్రుక కూడా లేదు. సాఫీగా వుంది. దాని ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న అంశం దాని ముక్కు రంధ్రాలు.

ఆ రంధ్రాలనుంచి ఏదో వాయువు బయటికి వెలువడుతోంది. చిన్ని కళ్ళు, విశాలమయిన నుదురు భాగం. దాదాపు రెండు మీటర్ల పొడవుంది తోక. తోక చివర కూడా వెంట్రుకలు లేవు. దాదాపు అయిదుమీటర్ల పొడవు, మూడు మీటర్ల ఎత్తుంది.

అప్పటికే కోయిల విల్లు ఎక్కుపెట్టి సిద్ధంగా వుంది. మెల్లని స్వరంతో అతనితో చెప్పింది.

"దాని ముక్కునుంచి వెలువడుతున్న వాయువు విష పూరితమైనది. శత్రువు తనమీద దాడిచేసినప్పుడు ఆ వాయువును శత్రువు ముఖంమీదకి చిమ్ముతుంది. దాంతో ప్రాణాలు వెంటనే పోతాయి. దాన్ని ముఖాముఖి ఎదిరించి పోట్లాడలేం. విషవాయువు వదులుతుంది. అదింకా మనల్ని గుర్తించలేదు. బాణం వదులు" అంటూనే వింటి నారిని చెవిదాకా లాగి బాణం వదిలింది కోయిల.

ఆమె బాణం ఇంకా దాన్ని చేరకముందే వింటినారి చేసిన శబ్దం చుక్కాని ఎలర్టు చేసింది. చాలా లాఘ

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్టులో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 60/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

తంగా బాణం దెబ్బనుంచి తప్పించుకుంది. మరింత వేగంగా ముందు కురికింది.

సరిగ్గా అప్పుడే తన బాణం వదిలాడు సిద్ధార్థ. అది అలవాటులేని కారణంగా గురి తప్పిపోయింది.

చుప్పా మహోగ్రంగా వాళ్ళమీద కొచ్చేసింది. దాని ముక్కులనుంచి విషవాయువు వెలువడటం తీవ్రతరమైంది.

మరోక్షణం ఆలస్యమై వుంటే చుప్పా సిద్ధార్థ మీద కురికి అతన్ని నేలకూల్చి వుండేదే!

కాని కోయిల విడిచిన రెండో బాణం సూటిగా దాని ముక్కుల్లో దూరిపోయింది. సున్నితమైన ప్రదేశం కావటంతో చుప్పా గిలగిల లాడిపోతూ ఆ నిర్జన ప్రాంతం దద్దరిల్లేలా పెడబొబ్బ పెట్టింది.

సిద్ధార్థకి బాణం వదలటానికి వ్యవధి దొరికింది. ఈ సారి అతని గురి తప్పలేదు. బాణం దాని కంఠం వద్ద బలంగా నాటుకొంది.

చుప్పా పెద్ద పర్వతంలా నేలమీదికి ఒరిగిపోయింది. దాని ముక్కుల నుంచి ఇప్పుడు ఎలాంటి వాయువు వెలువడటం లేదు.

• • •

ఒంటెలు హుషారుగా ముందుకి సాగిపోతున్నాయి.

మరో అరగంటపాటు ఎలాంటి ఆటంకాలు లేకుండా ప్రయాణం కొనసాగింది.

ఆ తర్వాత ఉన్నట్టుండి ఒంటెలు రెండూ చటుక్కున వున్నచోటనే నిల్చుండిపోయాయి.

సిద్ధార్థ ఆశ్చర్యంగా కోయిలవైపు చూశాడు. కోయిల నేలమీదికి దృష్టి సారించి ఉలిక్కిపడింది.

అక్కడ ఇసక అతివేగంగా కదుల్తోంది. రైసు మిల్లులో ధాన్యం వేస్తే కింది కెలా దిగిపోతుందో అలా భూమి అంతర్భాగానికి అతి వేగంగా దిగిపోతోంది ఇసుక.

క్షణాల్లో అక్కడ పెద్ద అగాధం యేర్పడింది. ఆ చివర నుంచి యీ చివర వరకు అడ్డుగా పెద్ద కందకం తవ్వినట్టు నాలు గడుగుల వెడల్పున గొయ్యి పడిపోయింది.

ఆశ్చర్యాన్ని అణచుకొంటూ ఆమెవైపు చూశాడు సిద్ధార్థ.

"ఒంటెలు చాలా సెన్సిటివ్ గా గ్రహించాయి ప్రమాదాన్ని. లేకుంటే మన మీ అగాధంలో పడిపోయుండేవాళ్ళం. ఇదో చిన్న భూకంపంలాంటిది. అప్పుడప్పుడు నేల యిలా నెర్రెలు వేసి ఇసక భూమి అంతర్భాగానికి జారిపోతూ పెద్ద గోతుల్ని మిగుల్చుతుంది" చెప్పింది కోయిల.

సిద్ధార్థ దానికి సైంటిఫిక్ రీజన్ ఆలోచిస్తున్నాడు. బాగా ఎండిపోయిన నేల నెర్రెలు తీయటం సహజమే! భూమి అడుగుపొరలో అకస్మాత్తుగా ఖాళీ యేర్పడి ఇసక దాంట్లో కూరుకుపోయి అగాధాలు యేర్పడుతుండవచ్చు. దాన్ని కోయిల భూకంపంగా వ్యవహరిస్తోంది. ఆమెకి తెలిసిన విజ్ఞానం ఆమెది!

"ఇప్పుడెలా....? ఒంటెలు గోతిని దాటి పోగలవా మరి?"

"దాటలేవు. చిన్న గొయ్యి కాదు. నాలుగడుగుల వెడల్పున పడిపోయింది. మనం యెడమపక్క వైపు ప్రయాణం సాగించి తర్వాత మళ్ళీ కుడివైపుకి తిరిగితే ఇదే దిశలో మళ్ళీ కొనసాగుతాం" అన్నది కోయిల.

ఒంటెలు ఎడమవైపుకి మళ్ళించబడ్డాయి. సరిగ్గా అక్కడ వాళ్ళకోసం ఓ ప్రమాదం పొంచివున్న సంగతి వాళ్ళకి తెలియదు.

*  *  *

అప్పుడు సమయం అర్ధరాత్రి పన్నెండున్నర.

"మనం తెల్లవారే లోపల ఘోర్కజాతి నివశిస్తున్న పొథరానికి చేరుకోగలమని భావిస్తున్నాను. తెల్లవారకుండా వెళ్ళటం చాలా అవసరం. వాళ్ళు తెల్లవాఝు ఝామునే గాఢనిద్రలో వుంటారు...." చెప్పింది కోయిల.

"సాధారణంగా ప్రతివారికి గాఢనిద్ర పట్టేది తెల్లవారుఝామునే కదా....!?"

"అవుననుకో! అయితే ఈ జాతివాళ్ళు రాత్రంతా గూడేలనుంచి వస్తువులు, తిండిగింజలు జబర్దస్తీగా తెచ్చుకుంటూంటారు కదా! అందుకని వాళ్ళు సుఖనిద్ర పోయే సమయమే వాళ్ళ శాశ్వతనిద్రకి మహూర్తం కావాలి." ఆమె గొంతులో తిరుగులేని నిశ్చయం, కసి, పగ, ప్రతీకారం ధ్వనించాయి.

వాళ్ళు వెళ్తున్న దారిలో రెండు పొడవాటి పోక చెక్కల చెట్లు కనిపించాయి. ఆ చెట్ల మధ్యగా వున్న దారిగుండా పోతున్నాయి ఒంటెలు.

సరిగ్గా అప్పుడే వాళ్ళకి గాల్లో ఝుమ్మంటున్న శబ్దం వినిపించింది. గుంపుగా తేనెటీగలు చేసే శబ్దంలా వుంది.

కోయిలవైపు ప్రశ్నార్థకంగా చూసిన సిద్ధార్థ ఆమె ముఖం వివర్ణమై వుండటం గమనించి ఆశ్చర్యపోయాడు.

(ఇంకా వుంది)

